
Srimad SURRYA MUSIC
Audio Super Hit
At 21 every day it's a war
శ్రీ రాజ్యలక్ష్మి కంబైన్స్
నేను
ముళ్ళపూడి బ్రహ్మానందం
ఇ. సత్తిబాబు
విద్యాసాగర్ సి. రాంప్రసాద్ వేటూరి సీతారామశాస్త్రి భువనచంద్ర శ్రీకర ప్రసాద్ కేశవప్రసాద్ ఓ.వై. సత్యనారాయణ ఇ.వి.వి. గిరి
Designed by : AELAY

హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

62

Also available on net:
www.haasam.com

ముఖచిత్రం
రాశి



## హాస్యం

**సీరియల్స్:**
ఎలుక వచ్చే ఇల్లు భద్రం
-ఇలపావులూరి మురళీమోహనరావు 31
తాతా ధిత్తై తధిగిణతోం...
-జీడిగుంట రామచంద్రమూర్తి 66
డాక్టర్ డూ లిటిల్ -ఎమ్బీయస్ ప్రసాద్ 48
**కథ:**
దిసీజ్ దిస్....దటీజ్ దట్ !
- భువనచంద్ర 06
**బాపూరమణీయం:**
పెళ్లిపుస్తకం (వెండితెర నవల)
- ఇలపావులూరి మురళీమోహనరావు 24
**హ్యూమరథం**
దొందు-దొందే ! -రావి కొండలరావు 56
**శీర్షికలు:**
హ్యూమర్ బాక్స్ 18
చౌ చౌ చౌరస్తా 54
**స్పెషల్స్:**
**'క' రాజు కథలు:**
ఆస్థాన విమర్శకుడు -సింగీతం శ్రీనివాసరావు 14
'హాసం' క్లబ్ విశేషాలు 22

'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల ప్రత్యేకం













## సంగీతం

**సీరియల్:**
నేనూ నా పాటలు
- శ్రీమతి జమునా రమణారావు 10
**లలితం:**
కురిసెను జల్లులు అరవిరిసన మల్లెలు
- చిత్తరంజన్ 28
**పాప్‌కార్నర్:**
మికా సింగ్ - వి.అరుణ సత్యవతి 43
**అర్థంచేసుకుందాం-ఆస్వాదిద్దాం**
గంగా జమ్‌నా-పి.వి. సత్యనారాయణరాజు 34
ప్రేమించిచూడు -తమిళం- పి.ఎస్.గోపాలకృష్ణ 46
**సినిమా:**
**ఆపాత(ట) మధురం**
శభాష్ రాముడు - రాజా 64
**శీర్షికలు:**
కొమ్మా కొమ్మా కోకిలమ్మా
-ఇంద్రగంటి జానకీబాల 52
ఆడియోరివ్యూ -'నేనున్నాను'పాటల గురించి 20
సరిగపదమని - 17 45
సరిగపదమని - 15 ఫలితాలు 74
హిందీ సినీ సంగీతంలో
మలుపులూ మజిలీలూ 30
**కొమ్మకొమ్మకో సన్నాయి:**
నాగయ్య గురించి వేటూరి 43
**స్పెషల్స్:**
ఎం.వి.రాజు గురించి చిత్తరంజన్
సంగీత కథలు 58
ఎస్.జానకి పాటలు 59
**సమీక్షణం:**
వి.ఏ.కె.రంగారావు గారి ఆలాపన గురించి 17

**పాటల ప్రత్యేకం**
69
70
71
72
73
పేజీల్లో






క్యాబినెట్‌లో ముఖ్యమయిన మంత్రులెంతమందున్నా ముఖ్యమంత్రి మాత్రం ఒక్కరే వున్నట్టు, మార్కెట్‌లోకి ఎన్ని మంచి పత్రికలొచ్చినా, 'హాసం' పత్రిక స్థానం హాసానిదే అయింది. మంచి సినిమా పాటల సాహిత్యం కావాలన్నా, ఆ పాటల వెనక వున్న కొన్ని ఆసక్తికరమయిన విషయాలు తెలుసుకోవాలన్నా నాకు ఆసక్తి. అప్పట్లో ప్రేక్షకులకి తెలీని విషయాల్ని శ్రీ వి.ఏ.కె. రంగారావుగారు పత్రికల్లో రాస్తుంటే చాలా వుత్సాహంగా చదివేవాణ్ణి. ఎడిటర్ శ్రీ రాజాగారు యింకా కూలంకషంగా స్టడీ చేసి చాలా వివరాలు రాస్తుంటే మొదట ఆశ్చర్యపోయేను. ఇప్పుడు పత్రికాముఖంగా అభినందిస్తున్నాను. ముఖ్యంగా రీ-మేక్ చిత్రాల్లోని పాటల్లో ఒరిజనల్ రైటర్స్ ఏం రాసేరు? మనవాళ్లు ఏం రాసేరనే, తేడా తెల్సుకోవాలని చాలా వుత్సాహపడేవాణ్ణి గానీ, అలాంటి వివరాల్ని నాకు తెలిసి 'హాసం' పత్రిక తప్ప మరే పత్రికా అందించలేదు. ఇంక నాకు హాస్యమంటే ఎంతిష్టమో వేరే చెప్పక్కర్లేదు. నేను రాసిన శతాధిక చిత్రాల్లో ఎక్కువశాతం హాస్య ప్రధానమయినవే! కొన్ని సినిమాల్లో నేను వేసిన వేషాలు కూడా ఆ తరహావే! నేను 'హాసం' పత్రికకి రెగ్యులర్ పాఠకుడిగా మారడానికి గల కారణం, నాకు యిష్టమైన హాస్యాన్ని, సంగీతాన్ని మేళవించి దాన్ని ఓ ప్రత్యేక పత్రికగా శ్రీరాజాగారు రూపొందించడమే!

**- కాశీ విశ్వనాథ్ (సినీ రచయిత- నటుడు), విశాఖపట్నం.**

'హాసం' పత్రిక అత్యద్భుతంగా తయారవుతూ ఎందరో నాలాంటి పాఠకుల్ని ఆకట్టుకుంటోంది. ముఖ్యంగా - టూర్లలో వుంటూ, కుటుంబానికి దూరంగా నెలలో కనీసం 20 రోజులు వుండాల్సిన సందర్భాలలో 'హాసం' మంచి టానిక్‌లాగా మాలాంటి వాళ్లకు ఉపయోగపడుతోంది. 16-31 మార్చి 2004 సంచికలో శ్రీమతి జమునగారి "నేనూ నా పాటలూ" చదివి చాలా ఆనందించాను. పది కాలాలపాటు పదిలంగా వుంచుకోదగ్గ యిలాంటి విశేషాలతో కూడిన 'హాసం'ను నేను గత రెండు సంవత్సరాలుగా చదువుతున్నాను.

**- ఆర్.వి. బసవరాజు, హైదరాబాద్**

16-31 మార్చి 2004సంచికలో 'హ్యూమర్ బాక్స్' శీర్షికలో నా జోక్స్ ప్రచురించినందుకు గాను మీరు పంపిన 'సత్యం' ఆడియో సి.డి. అందినది, చాలా థ్యాంక్స్.

గత పదిసంవత్సరాలుగా వివిధ పత్రికలకు రచనలు చేస్తూ వస్తున్నాను. రచనలు పడి నెలలు దాటినా పారితోషికం ఊసెత్తని పత్రికలు ఎన్నోవున్న ఈ రోజుల్లో ఇలా పారితోషికం పంపిస్తున్న పత్రిక 'హాసం'!

**- మామిడి శ్రీలత, రేపల్లె**

నేను ఊరు వెళ్తున్నప్పుడు ఒకరి వద్ద ఈ పత్రిక చూశాను, వెంటనే తదుపరి సంచిక అనగా 1-3-04 సంచిక కొన్నాను. పత్రిక చాలా బాగుంది. అందులో పాత (నటుల) పరిచయాలు - ఇంకా పాత, క్రొత్త పాటలు నెమరు వేసుకొనుటకు వీలుపడింది. సరిగమపదమని, జోక్స్, పేరడీ పెరేడ్... అన్నీ బాగున్నాయి. నేను ఈ పత్రిక చదవలేకుండా వుండలేక పోతున్నాను.

**- డా. యస్.కె. జిలానీ, ఖమ్మం.**

50 సంవత్సరముల నటజీవితాన్ని పురస్కరించుకొని స్వర్ణోత్సవ నటి జమున, జ్ఞాపకాలు ధారావాహిక కొత్త శీర్షిక చక్కగా ఉంది. శ్రీమతి జమునగారి అనుభవాలు హృద్యంగా ఉన్నాయి. నిర్మొహమాటంగా విషయాలు చెప్పడం బాగుంది. 'హాసం' నిజంగా అందరికీ దరహాసం. **- వాస్తు రామచంద్ర, నెల్లూరు -2**

మీరు పంపిన 'నేను -నాయిల్లు' సి.డి అందినది. కొన్ని గజల్స్ మనసును హత్తుకు పోయాయి. చాలా థ్యాంక్స్. కీ॥శే॥ జగ్గయ్య(ఇలా పేరు ముందు కీ॥శే॥రాయడానికి బాధగా వుంది)గారి 'వెధవగారు' లోని అంశాలు ప్రచురించినందుకు ధన్యవాదములు. వర్చస్సు ముఖంలో ఉందనుకుంటాం - కానీ అది మేధస్సులో లేనప్పుడు ముఖంలో కన్పడదు. 'ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ మైండ్' అనే ఇంగ్లీషు సామెత జగ్గయ్యగారికి పూర్తిగా వర్తిస్తుంది. వారి మేధలోని వర్చస్సు,గాంభీర్యం, గొప్పతనం ముఖంలో ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. అంటే మేధావర్చస్సు గల వ్యక్తి చూపే హావభావాలు. ఎవర్ని అలరించవు!?జీవితాన్ని ఎలా జీవించాలో చెప్పకనే చెప్పారాయన. సినీ జగత్తుకి ఒక హుందాతనాన్నిచ్చి గంభీరంగా నవ్వుకుంటూ తప్పుకున్న ఆయన్నుంచి నేటి యువతరం నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది.

**- రమణశాస్త్రి,సంగారెడ్డి**

మీరు పంపిన 'సత్యం' పాటల సి.డి.,నా రచన ఉన్న 'హాసం' సంచిక (మార్చి 16-31) అందాయి. చాలా ఆనందించాను. మీరిచ్చిన ప్రోత్సాహానికి కృతజ్ఞతాభివందనాలు. సి.డి. అందింది కాబట్టి ఇక సి.డి.ప్లేయరును పొందేందుకై ప్రయత్నాలు సాగించాలి.

**- జయంతి వెంకటరమణ, పెందుర్తి.**

మెడలో స్టెతస్కోప్ చేతిలో రివాల్వర్ శంకర్‌దాదా యం.బి.యస్. గెటప్‌తో మెగాస్టార్ ముఖచిత్రంతో వెలువడిన 16-31 మార్చి 'హాసం' సంచిక సర్వాంగ సుందరంగా ఉంది. ఈ సంచికలో పాటలూ,పద్యాలతో కలిపి ప్రచురించిన 'లవకుశ' పాటల పుస్తకం ఇచ్చినందుకు థాంక్స్. ఇలాంటి పాటలు ఇస్తారనే ప్రతి 'హాసం' కోసం ఆతృతగా ఎదురు చూస్తూవుంటాము. ఇట్లాగే 'భక్తప్రహ్లాద' లో పాటలూ పద్యాలు ప్రచురించ గలరని అభిమానంతో అర్థిస్తూ...

**- వి.వి. రమణాచార్యులు, శ్రీకాకుళం.**

1-15 ఏప్రిల్ సంచికలో నేను రాసిన జోక్స్ ప్రచురించి బహుమతిగా పంపిన 'జై' ఆడియో సి.డి. కాంప్లిమెంటరీ కాపీ కంటే ముందుగా చేరి ఆనందం కలిగించింది. 'ఖేల్ ఖేల్ మే' (అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం) పాటల పరిచయంలో ఫిలింఫేర్ అవార్డు అందుకున్న గుల్షన్ బావ్‌రా పాట మేరే దేశ్ కి ధర్తీ 'ఉప్‌కార్' (మనోజ్‌కుమార్) సినిమాలోనిది- పుకార్ కాదు. యిది కేవలం ముద్రారాక్షసమే అయి ఉంటుంది కదూ!? ఈ సంచికలోనే కేవలం సప్తస్వరాలతోనే 'సరిగపదమని' పజిల్ కూర్చిన నేర్పరి తెలికిచెర్ల రామకృష్ణ గారికి ప్రత్యేకమైన అభినందనలు.

**- కోనే నాగవెంకట ఆంజనేయులు,ఉక్కునగరం.**

**(అవును. అది ముద్రారాక్షసమే. సరిగ్గా ప్రూఫ్ చూడకుండా ప్రింటింగ్‌కి పంపించేశాను కాబట్టి 'ముద్రారాజసం' అనుకుని క్షమించేయండి- ఎడిటర్)**

ఆ పాత మధురం శీర్షికలో మీరు పాత పాటలకి ఇస్తున్న వివరణ చాలా ఎడ్యుకేటివ్‌గా ఉంటూ మా చిన్నప్పటి రోజులని గుర్తుకి తెస్తోంది. 'హాసం' ఫిబ్రవరి 16-29, మార్చి 1-15 సంచికలలో 'సీతారామకళ్యాణం' చిత్రంలోని పాటలకి మీరు ఇచ్చిన వివరణ చదువుతూ, శ్రీరామనవమినాడు 'ఈ'టీవీలో వచ్చిన ఆ చిత్రం చూసాను. ఇదివరకు ఎన్నడూ కలగని అనుభూతి కలిగింది.

నేనొక ప్రవేటు సంస్థలో ఉద్యోగినిని. 2002 నవంబరులో అనారోగ్య కారణంగా 3 నెలలు శలవులో ఉన్నప్పుడు కాలక్షేపం కోసం 'హాసం' సంచికలు కొన్ని మా అన్నయ్య ఇచ్చాడు. బెడ్‌రెస్ట్ శరీరానికి విశ్రాంతినిస్తే, 'హాసం' మనసుకి విశ్రాంతి నిచ్చి త్వరగా కోలుకోనేలా చేసింది. తిరిగి డ్యూటీలో చేరిన తర్వాత కూడా 'హాసం' ప్రతి సంచిక కొని చదువుతున్నాను.

**- జి. విజయలక్ష్మి, విశాఖపట్నం.**

1-15 ఏప్రిల్ 'హాసం'లో ప్రచురించిన నాపేరడీ పాటకు సోహాన్ మ్యూజిక్‌వారు బహుమతిగా పంపిన "జై" ఆడియో సి.డి. అందినది. చాలా ఆనందాన్ని పొందాను. కించిత్ ఆశ్చర్యాన్నికూడా పొందాను. ఎందుకంటే అది నాకు పత్రిక కంటే ముందుగా 31-3-04నే అందినది. బహుమతి అందుకున్నందుకు బహు సంతోషం. సోహన్ మ్యూజిక్ వారికి, రచయితల పట్ల మీకున్న ప్రత్యేకమైన అభిమానానికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

హాసం విలువగల పత్రిక
హాసం లో నిండియుండు నమృతగుళికలు
హాసం నిరంతము చదువగ
హా! సంతోషాన వయసు"హాపు"కి తగ్గెన్

హాస్యరసాన్ని, సంగీతామృతాన్ని ఏకకాలంలో ఆస్వాదిస్తూ జీవించే వారు(హాసం పాఠకులు) వృద్ధాప్యాన్ని అవలీలగా జయించగలరు. నిత్యయవ్వనులై విలసిల్లెదరు.

**- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.**

సంపుటి: 3 సంచిక: 14

16-30 ఏప్రిల్ 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్

ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్

రాజా

రిఫరెన్స్ కర్టెసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య - సంగీత పత్రిక

62

చరిత్రకు మనం ఈయవలసిన ప్రాధాన్యం ఎంత? గతకాల వైభవాన్ని చాటడానికి అతిశయోక్తులుపయోగించడం, సమయాభావం అంటూ అరకొర జ్ఞానంతో, నిర్లక్ష్యంతో గ్రంథస్తం చేయడం ఎంతవరకు సమంజసం? ఈ ప్రయత్నాలకు ప్రభుత్వామోదం, తెలిసిన పెద్దల మౌనాంగీకారం లభించడం న్యాయమేనా?

మార్చినెలలో నాగయ్య శతజయంతి వేడుకల వేదికపై ఈ ప్రశ్నలు సంధించి వి.ఏ.కె.రంగారావు సభాసదులలో ఆలోచనలు రేకెత్తించారు. పెద్దల కృషిని భావితరాలకు తెలుపడానికి విగ్రహాల స్థాపనలకంటె సాధికారంగా పుస్తకరూపంలోకి వెలువడే మోనోగ్రాఫ్‌లే ఉపకరిస్తాయన్నారు. ఆనాటి వీడియో ప్రదర్శనలో 'త్యాగయ్య' సినిమా విడుదల సంవత్సరం తప్పుగా పేర్కొనడం గురించి ఆవేదన తెలుపుతూ - "ఈ తప్పును రేపు మరొకరు అనుసరిస్తారు. ఇదే చరిత్రలో నమోదయిపోతుంది. శ్రీకృష్ణతులాభారం వంటి గొప్పనాటకం రచయిత ఎవరని, పాటలు రాసిందెవరని అడిగితే పాత్రధారులకుగాని, గాత్రధారులకుగాని, వాద్యకారులకుగాని ఎవ్వరికీ తెలియదు. ఎవ్వరూ పట్టించుకోలేదు. ఇప్పుడే ఇలా వుంటే మరో ఏభై సంవత్సరాలు పోయాక ఏమవుతుంది? గట్టిగా ప్రయత్నిస్తే తప్పేదో, ఒప్పేదో చెప్పగలిగేవారు ఇప్పుడు దొరుకుతారు. అప్పటికి వారూ మిగలరు.

అందుకే సాధ్యమైనంత నిర్దుష్టంగా డాక్యుమెంటేషన్ జరగాలి. తప్పులు సవరించుకోవాలి. గొప్పవారు చెప్పారు కదాని శిరోధార్యమనకూడదు. ఉదాహరణకి 'స్వర్గసీమ'లో 'ఓహోహో పావురమా'కు 'బ్లడ్ అండ్ సాండ్'లో రీటా హేవర్త్ పాట ఆధారమని మహనీయులెందరో అంటూ వచ్చినా ఇటీవలే వీడియో చూసి రెండింటికీ సంబంధం లేదని తేల్చుకున్నాను. మరి వారు సైతం పొరబడతారా? అంటే పొరబడతారనే అనాలి..." అంటూ సాగిన ఆయన ఉపన్యాసం సత్యాన్వేషణ పట్ల ఆయనకున్న నిబద్ధతను, చాటిచెబుతూనే జర్నలిస్టులకు హెచ్చరిక అందచేసింది.

స్వవిషయాలు ముచ్చటించడంలో సైతం అనేకమంది పొరబడతారని పాత్రికేయులకు వృత్తి అనుభవం నేర్పుతుంది. జ్ఞాపకశక్తి క్షీణించడమో, గతంలో శ్రద్ధ పట్టకపోవడమో దీనికి కారణాలు కావచ్చు. వారిచ్చిన సమాచారం తప్పొప్పులు సరిచూసుకోవాల్సిన బాధ్యత పాత్రికేయులదే!

ఈ పత్రిక సంపాదకుడు 'జయభేరి' సంగీతం గురించి ఓ పత్రికలో వ్రాయబూనినప్పుడు ఆ సినిమాకు స్ఫూర్తినిచ్చిన అరవై యేళ్లనాటి మరాఠీసినిమాని సంపాదించి చూసిన తర్వాతనే వ్రాయడం జరిగింది. అలాగే 'శీను, వాసంతి..లక్ష్మి' ఆడియోరివ్యూకు సైతం మలయాళ, తమిళ వెర్షన్లు చూసి బేరీజు వేయడం జరిగింది.

అంతమాత్రం చేత 'హాసం'లో పొరబాట్లు దొర్లవని కాదు. ఏ ఒక్కరూ సర్వజ్ఞులు కారు. ఆథెంటిక్ ఇమేజి పెరిగినకొద్దీ బాధ్యత మరింత పెరుగుతుంది. 95 శాతం యథార్థాలతో కలిసినప్పుడు 5 శాతం పొరబాట్లు కూడా యథార్థాలుగా చలామణీ అయిపోతాయన్న భయం మాది.

వి.ఏ.కె. కూడా అదే అన్నారు. తనను తాను సవరించుకున్న సందర్భాలెన్నో ఉన్నాయన్నారు. ఇదే సందర్భంలో పుస్తకాలకిచ్చే నంది అవార్డుల విషయంలో ప్రభుత్వానికి చక్కని సూచన చేశారు. ఇతరత్రా యోగ్యత కలిగివుండి, పొరబాట్లు దొర్లిన సందర్భాలలో ఓ తప్పొప్పుల పట్టికను పుస్తకానికి చేర్చమన్నారు. దీనివల్ల రచయితకు గుర్తింపు రావడంతో బాటు చరిత్రకు అన్యాయం జరగదు. ఇదివరకు ప్రతిపుస్తకానికి చివరిలో తప్పొప్పుల పట్టిక ప్రచురించేవారు. ఇటీవల ఆ సంప్రదాయం పోయింది. అది పునరుద్ధరించడం ఎంతైనా హర్షదాయకం.



'ప్రయో'జనవాక్యం, 'పాటశాల' వంటి శీర్షికల ద్వారా 'హాసం' చేస్తున్నదదే!

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే**
**మరి మీ ఆవిడ?-7**

# డిసీజ్ డిస్.... డటేజ్ డట్!

## "యూవండోయ్...! యూత్ & బూత్ ప్రోగ్రాం వస్తోంది...!"

వంటింట్లోంచి అరిచింది మా ఆవిడ. మేడ మీద రాసుకుంటున్న వాడ్నల్లా మెట్లుదిగి హాల్లో టీవీ ముందు ఫిక్సైపోయా.

'బూత్' అంటే ఖంగారు పడకండి... పాల బూతుల్లాగాకాదు. అబ్బాయిలూ,అమ్మాయిలూ సరదాగా కలుసుకుని ఖబుర్లు చెప్పుకునే 'స్పాట్'ని 'బూత్' అంటారని మా ఎదురింటి కుర్రాడు చెప్పాడు.

టైటిల్ సాంగ్ మొదలయింది.

"నార్త్ or South
యూత్ is Youth
వెల్‌కమ్ to our
బ్యూటిఫుల్ Booth"

టైటిల్ సాంగు పూర్తికాక ముందే మా యింటి పక్కన ఇంజనీరింగ్ చదివే ఆడపిల్లలు మా యింటి కొచ్చేశారు. టైటిల్ సాంగ్ అవగానే అమ్మాయిలంతా చప్పట్లు కొట్టారు. టైటిల్స్ అయిపోగానే "అశేష ప్రజల విశేష ఆదరణ నోచుకున్న యూత్ & బూత్ ప్రోగ్రాంకి...వెల్‌కమ్.. స్వాగతం...సుస్వాగతం.."

చెవులు గింగిర్లెత్తేలా అరిచింది 'లంగరి'

(మరోసారి కంగారు పడకండి...! యాంకర్ అంటే 'లంగరు'కదా! అందుకే యాంకరింగ్ చేసేది ఆడదైతే 'లంగరి లేక యాంకరి' అనీ మగ వాడైతే 'లంగరుడు లేక యాంకరుడు' అనీ నేనూ మా ఆవిడా సంయుక్తంగా కనిపెట్టాం. యీ సరికొత్త పదాన్ని యావత్తు తెలుగు జాతికీ అంకితం చేస్తున్నామని మి(మా) 'హాసం' ద్వారా మనవి చేసుకుంటున్నాం.

ఇట్లు
నేనూ.... మా ఆవిడా)

"ఈనాటి ప్రోగ్రాం 'మిస్ వత్‌సాలా పిడ్‌కల్‌కర్' ఇంటర్వ్యూతో మొదలవుతుంది! ఇప్పుడో చిన్న బ్రే...క్.." గుండె పగిలేట్టు అరిచింది లంగరి.

వంటింట్లో బిందెలూ, చెంబులూ, పళ్ళాలూ గణగణా రాలి పడ్డాయి.

"ఛీ..!..యీ పిల్ల ఎప్పుడు 'లంగరింగ్' చేసినా ఇంతే..! సద్దుకోలేక ఛస్తున్నాను" అంటూ మా ఆవిడ వంటింట్లో విసుక్కుంటూ వుండగానే



.........

ఓ ఇరవైఏళ్ళ తల్లి ఓ పదినెల్ల బిడ్డని ఎత్తుకుని ఏడుస్తోంది. చంకలో వున్న బిడ్డ కూడా ఏడుస్తూనే వుంది. ఇంతలోకి ఓ నలభైఏళ్ళ ఆవిడ ఆ గదిలోకి వచ్చి "ఏమిటి సంగతీ..." అని ఆ పిల్లల తల్లిని అడుగుతుంది.

"పాప ఏడుస్తోందమ్మా.. కడుపులో నెప్పో ఏమో...! డాక్టరుకి ఫోన్‌చేస్తే ఆయన హస్పిటల్లో లేరట... కన్నబిడ్డ నెప్పితో ఏడుస్తుంటే ఏ తల్లి భరించగలదమ్మా... హే భగవాన్.. మాటలు రాని నా బిడ్డని ఏడిపించే బదులు ..ఆ కష్టం ఏదో నాకు పెట్టరాదా!" అని ఆ తల్లి టి.వి. సీరియల్లో తల్లిలా.. భగవంతుడికి మొరపెట్టుకుంటూ వుండగా ఇంకో అరవై యేళ్ళావిడ లోపలికి వచ్చి నవ్వుతూ.. "ఓసి మీ ఏడుపులు కూలా..! కడుపునెప్పి వచ్చి పాప ఏడుస్తుంటే మీ ఏడుపులేమిటే మధ్యలో... చిన్నప్పుడు నీకు కడుపు నెప్పి వచ్చినప్పుడల్లా 'నడ్డిమీద' నాలుగిచ్చుకునేదాన్ని, అన్ని నెప్పులూ ఠక్కున తగ్గేవి... కావాలంటే చూడు...!" అంటూ పసిపిల్ల నడ్డిమీద ఓ దెబ్బకొట్టగానే ఆ పిల్ల ఏడుపు ఆపేసి 'కిల కిలా' నవ్వుతుంది. ముగ్గురు పెద్దవాళ్ళు కూడా 'కిల కిల కిలా' నవ్వుతూండగా "గ్యాస్ట్రోఫోర్ట్" ఎంబ్లమ్..ఆవెనుకే వాయిస్..

"నడ్డిమీద నాజూగ్గా తట్టే 'బామ్మ'గారు లేకపోతే ...అందరికీ అందుబాటులో వుండే మా 'గ్యాస్ట్రోఫోర్ట్' వెయ్యండి! కడుపునెప్పి కంచికి...మీ పాప ఆటకి!"

.........

ప్రకటన అయిపోగానే నేను ఆవిడ వంకచూశా. ఈ వైద్యం బాగానే వుంది అన్నట్టు.

"అవును! చిన్న పిల్లలకయితే బామ్మ కొడితే సరిపోతుంది. పెద్దవాళ్ళకయితే పెళ్ళాం దెబ్బే కరెక్టు!" అంటూ నవ్వింది.

మళ్ళీ 'లంగరి' తెరమీద ప్రత్యక్షం అయింది ఫహాల్లున నవ్వుతూ-"హలో వ్యూయర్స్... ఇప్పుడు మన ఆంధ్రుల అభిమాన అభినేత్రి కుమారి 'వత్‌సాలా పిడ్‌కల్‌కర్'తో మనసారా ముచ్చటిద్దాం.! వెల్‌కమ్ టూ వత్‌సాలా పిడ్‌కల్ కర్...." అని అరవగానే ఓ పన్నెండు పదమూడేళ్ళ పిల్ల టైట్ జీన్సు కేజువల్ టీషర్ట్‌తో జుట్టు విరబోసుకుని 'ఎంటర్' అయింది. ఇద్దరూ కూర్చోగానే -

లంగరి : థేంక్యూ మిస్ పిడ్‌కల్‌కర్..! మీ పూర్తి పేరేంటి?

వత్‌సాలా : నా పేరు నా చేతే చెప్పించాలని కదూ మీ ప్లాన్..?
ఓకె!.. ఐయామ్ వత్‌సాలా పిడ్‌కల్‌కర్. మా పప్పాపేరు యస్. ఆర్. పిడికల్‌కర్. మా మమ్మీపేరు నరసమ్మా పిడికల్ కర్. చాలా ?"




లంగరి : ఫెన్‌టాస్టిక్ మిస్ వత్‌సాలా. ఇంతకీ మీది మహారాష్ట్రా? మరాఠీలా.? మీ ఫాదర్ పేరులో యస్.ఆర్. అంటే?

వత్‌సాలా : ఓహ్..నో! నేను సెంట్ పెర్సంట్ 'టెల్గూ' పిల్లనే! అఫ్‌కోర్స్...పుట్టిందీ పెరిగిందీ మహారాష్ట్రలో.. ఐమీన్ 'బాం బే'లో!

లంగరి : అలాగా! మరి పిడ్‌కల్‌కర్ అనే ఇంటిపేరు ఎలా వచ్చిందీ?

వత్‌సాలా : (కొంచెం సిగ్గుపడుతూ..) మా పప్పాది అసలు అమలాపురం. చిన్నప్పుడే బాంబేలో సెటిలయ్యారు. 'బీ ఏ రోమన్ వెన్ యూ ఆర్ ఇన్ రోమ్' అంటారుగా! అందుకే 'పిడికల కర్రు సుబ్బారావు' అనే అసలు పేరుని 'యస్.ఆర్. పిడ్‌కల్‌కర్'గా మార్చుకున్నారు.

లంగరి : సూపర్బ్..! ఇంతకీ మీ వయసెంత? సినిమాల్లోకి ఎలా వచ్చారు?

వత్‌సాలా : నా వైను (వయస్సు) పదిమీద మూడు సంసాలు.(అంటే పదమూడు సంవత్సరాలు) నా సెవెంత్ ఇయర్‌లో డిరెక్టర్ వడల్‌మానీ ఏప్‌రావ్ అంకుల్ (వడ్లమాని అప్పారావు) నన్ను స్కూల్లో చూసి..మా ఫాదర్‌నీ, మదర్‌నీ వొపించి (ఒప్పించి) 'వస్తావా పాపా' సినిమాలో 'బుక్' చేశారు. అంతే! అప్పట్నించీ బాంబే గుర్తురానంతగా 'సౌత్'లో బిజీ అయిపోయా.

లంగరి : ఇప్పటికి ఎన్ని సినిమాలు చేశారు?

వత్‌సాలా : (ఆలోచిస్తూ) టెల్గూలో ఆరు... కన్నడ్‌లో మూడు.. టామిల్‌లో ఐదూ.. మల్యాలంలో నాల్గూ 'సైన్' చేశాను.

లంగరి : మీరు 'చేసిన' వాటిల్లో మీకు



నచ్చిందీ జనం మెచ్చిందీ ఏది?

**వత్‌సాలా** : (విరగబడి నవ్వుతూ) నా కన్నీ నఛ్ఛినవే! (నచ్చినవే) జనం మెఛ్ఛిన (మెచ్చిన) సినిమా ఏమిటో రిలీజైతే గానీ చెప్పలేను.

**లంగరి** : వాట్? అంటే ఒక్కటి కూడా రిలీజ్ కాలేదా?

**వత్‌సాలా** : నోటెట్ (నాట్ యట్). కానీ మా ప్రొడ్యూసర్ సార్లూ డిరెక్టర్ సార్లూ 'ఏది ఎలా చెయ్యమన్నా - బాగా చేస్తానని' తెగ మెఛ్ఛు కుంటారు. అందుకే ఐ గాట్ లాట్ ఆఫ్ ఫిల్మ్ యూ నో? (కళ్ళు మెరుస్తుండగా అంది)

**లంగరి** : తెలుగు సినిమాల్లో వర్క్ చేయడం ఎలా వుంది?

**వత్‌సాలా** : ఇట్స్ నైస్..! చాలా చాలా హేపీ! వెరీ ఫాస్ట్‌గా 'వర్క్' జరుగుతుంది. గుడ్ రెమ్యునరేషన్!... ఇంకేం కావాలీ?

**లంగరి** : ఇప్పుడేం సినిమాలు చేస్తున్నారు?

**వత్‌సాలా** : 'వస్తావా పాపా' రిలీజ్‌కి సిద్ధంగా ఉంది. తరువాత తరుణ్ అంకుల్‌తో ఒకటీ. ..ఉదయ్ కిరణ్ అంకుల్‌తో ఒకటీ షూటింగ్స్ జరువు కుంటున్నాయి.

**లంగరి** : థేంక్స్ మిస్ వత్‌సాలా (అసలుపేరు వత్సల) పిడ్‌కల్‌కర్...! విష్ యూ గ్రేట్ సక్సెస్.... వ్యూయర్స్..ఇప్పుడో బ్రే...క్..!"

కొండలు ఎగిరేటు అరిచింది లంగరి. మా వంటిల్లు మళ్ళీ బిందెల శబ్దంతో మారుమ్రోగి పోయింది.

"ఓసీ దీని బండబడా..! తాడి చెట్టులా పెరిగింది..! దీనికి పన్నెండేళ్ళా..? ముక్కు పచ్చలారని తరుణూ, ఉదయకిరణూ దీనికి అంకుల్సా? తన్నేవాడు లేకపోతే సరి" కోపంగా వంటింట్లోంచి హాల్లోకి వచ్చింది మాఆవిడ.

"లేదాంటీ.... వత్‌సాలాకి పన్నెండేళ్ళట.! 'అదేదో పత్రికలో ఇంటర్వ్యూ కూడా ఇచ్చింది..!"




మా పక్కింటి ఇంజనీరింగ్ పిల్లా వత్‌సాలాకి వత్తాసు పలికింది.

"నీ మొహం ...! అయితే నాకు నలభైకాదు..! నాలుగేళ్ళే! మీ అంకుల్‌కి మూడున్నరేళ్ళే..! " కుర్చీలో సెటిలైంది నా పెళ్ళాం.

ఇంతలోనే టీవిలో మరో యాడ్ స్టార్టయింది.

.......

ఓ స్కూల్ ప్లేగ్రౌండ్‌లో పిల్లలు కప్పులతోటి 'డార్లిక్స్' తాగూతూ నడ్డి గుండ్రంగా తిప్పుతూ..."అస్కో..., ఇస్కో.... ఉస్కో.... బుస్కో..... కిస్కో..." అని అరుస్తూ వుండగా ఓ టీచరు తను కూడా నడ్డితిప్పుతూ .... "యస్ చిల్డ్రన్.... కిస్కోవారి 'డార్లిక్స్' తాగే నేనూ టీచర్నయాను...! ప్రతిరోజూ మీరు కూడా ఇలాగే 'డార్లిక్స్' తాగూతూ వుంటే నాలాగా అందంగా ఆరోగ్యంగా తయారవుతారు (?)"అంటుంది.

"మీరే, కాదు మిస్.. 'డార్లిక్స్' తాగే నేనూ 'హెడ్‌మాస్టర్నయాను...!" అంటూ నడ్డి తిప్పుతూ మరో ముసలాయన ఎంటర్ కావడంతో ప్రకటన ముగిసింది.

........

"నేను ఓ డార్లిక్స్ కొనుక్కురానా?" ఉత్సాహంగా అన్నాను నేను మా ఆవిడతో.

"అలా నడ్డి తిప్పడం కోసం వాళ్ళకి బోల్డన్ని డబ్బులిస్తారు! డార్లిక్సు తాగి నువ్వు నడ్డి తిప్పితే... డాక్టరు ఫీజులకి కొంప తాకట్టుపెట్టాలి... ఆ తరువాత నీ ఇష్టం..!" వార్నింగిచ్చింది మా ఆవిడ.

* * *

"వెల్‌కం బాక్ టూ యూత్ ఎండ్....." అని లంగరి అరవగానే "బూత్" అని మా పక్కింటి పిల్లల్తో సహా అరిచారు.

"థేంక్యూ వ్యూయర్స్...! ఎంతో సేపట్నించీ మీరెంతో ఉత్సాహంగా ఎదురుచూస్తున్న 'హీరో ఆఫ్ ది మిలీనియమ్...'బాసిత్ బానర్జీ' తో ఇంటర్వ్యూ మొదలు కాబోతుంది. లెట్స్ గివ్ హిమ్ ఏ బి...గ్ హేండ్"(?) అట్టహాసంగా అరిచింది లంగరి.

'సెట్'లో వున్న వ్యూయర్స్‌లో ఉత్సాహం పెల్లుబికింది. ఈలలూ, చప్పట్లూ, అరుపులూ, డాన్సులూ... ఎక్స్‌ట్రాలతో ప్రేక్షకులు నానా విన్యాసాలూ చేస్తుండగా 'స్పాట్ లైట్' 'బాసిత్ బానర్జీ' మీద ఫోకస్ అయింది.

నాకు మళ్ళీ కళ్ళు తిరిగినై.

ఆ 'బాసిత్ బెనర్జీ'కి పదిహేడేళ్ళు కూడా లేవు. రంగురంగుల పేంటు, ఎర్ర షర్టూ...! తెల్ల బెల్టూ.. నల్ల కళ్ళద్దాలతో జనాల మీదకి ఫ్లయింగ్ 'కిస్'లు విసురుతూ.... 'ఐ లవ్ యూ... ఐ లవ్‌యూ ఆల్'... అని గొంతు చించుకుని అరుస్తున్నాడు.

"అవునే సామ్రాజ్యం..! ఈ బెనర్జీకి



పదిహేడేళ్ళు కూడా లేవు కదా? హీరో ఆఫ్ ది మిలీనియమ్ ఎలా అయ్యాడు?" ఆశ్చర్యంతో మా ఆవిడ్ని అడిగా.

"హు! ఆ కుర్రాడు హీరోగా ఫీల్డుకొచ్చి ఆరేళ్ళయింది. 'కుర్ర లవ్' అనే అతని సినిమా మూడొందల రోజులాడింది. అప్పటినుంచీ బాక్సాఫీసు రికార్డులు వగలగొడుతూనే వున్నాడు...! అయినా... సినిమాలకి పాటలు రాస్తూ ఆ కుర్రాడెవరో తెలీదంటే ఎవరైనా నవ్విపోతారు..!" నా జనరల్ నాలెడ్జికి జాలి పడుతూ అన్నది మా ఆవిడ.

"వెల్‌కమ్ బాసిత్..." మళ్ళీ అరిచింది లంగరి. టీవీ ఓసారి ఒణికి మళ్ళీ మామూలైంది. బాసిత్ 'హాట్ సీట్' లో కూర్చోగానే-

లంగరి : మీరు బెంగాలీస్ కదూ?

బా.బె : నో..నో నేను పక్కా తెల్గూ బోయ్‌నే!

లంగరి : మరి బెనర్జీ అనే సర్‌నేమ్...?

బా.బె : మా అమ్మకి 'విక్టర్ బెనర్జీ' (బెంగాలీ నటుడు) అంటే ఇష్టం. అందుకే బాసిత్ బెనర్జీ అని పెట్టింది.

లంగరి : వెరీగుడ్..! మీరు చాలాచిన్న వయసులో ఫీల్డుకొచ్చారు గదా. కాలేజీ 'మిస్' అయిన ఫీలింగ్ లేదా?

బా.బె : నాటెటాల్..! ఎందుకంటే ..నేను యాక్ట్ చేసేవన్నీ 'యూత్' సినిమాలే అన్నిట్లోనూ కాలేజ్ బే గ్రౌండే..! సో.. కాలేజీ మిస్సయ్యాననే బాధ లేనేలేదు..!

లంగరి : మీ 'రెమ్యూరేషన్'కూడా చాలా ఎక్కువంటారు?

బా.బె : అలాగా..? వాళ్ళిస్తారు.... మేం పుచ్చుకుంటాం...! దాన్లో తప్పే ముందీ?

లంగరి : మీ ఫ్యూచర్ ప్లాన్లు?

బా.బె : హాలీవుడ్‌లో 'యాక్ట్' చేసి నా 'సత్తా' నిరూపించుకోవాలని. అలాగే చైన్ రెస్టారెంట్స్ కట్టాలని ! బౌషత్ (భవిష్యత్తు)లో హాలెండ్లో ఓ యిల్లూ...

సడెన్‌గా కరెంటు పోయింది. మా టీవీ లో ప్రోగ్రాం చూస్తున్న పిల్లలంతా కోపంతో ఊగిపోయారు.

"ఛీ..! చూడండంకుల్.. మాంచిటైమ్‌లో కరెంటు 'కట్' అయిందీ.."! ఓపిల్ల అంది.

"పిల్లల్లారా...! నాలుగింటిదాకా కరెంటు రాదు. పేపర్లో ఆ విషయం ముందుగానే ఎనౌన్సు చేశారు"! చావు కబురు చల్లగా చెప్పింది మా ఆవిడ. పాపం వాళ్ళు నిరుత్సాహంగా ఇంటికెళ్ళిపోయారు.

"అదికాదే..! గాంధీనీ, నెహ్రూనీ, సుభాష్ బోసునీ, మోక్షగుండం విశ్వేశ్వరయ్య గార్నీ, హెచ్.జె. బాబానీ, విక్రం సారాభాయినీ ఇంకా అనేకానేక మంది మహామహుల్ని వదిలిపెట్టి ఈ కుర్రాడ్ని హీరో ఆఫ్ ది మిలీనియమ్ అనటం ఏమిటీ?" అడిగా.

"నువ్వో పిచ్చాడివి దొరికావు నాకు...! 'హీరో' అంటే అర్థం 'ఆ హీరో' అని కాదు. సినిమా 'హీరో'అని !" తేలిగ్గా అంది మా ఆవిడ.

"మరి సినిమా హీరోల్లో... " చెప్ప బోతుండగా..

"చూడు నాయనా ....! ఎవరికీ పట్టని విషయాలు నీకూ నాకూ ఎందుకూ? ప్రోగ్రాం వచ్చింది! చూశాం.. అంతటితో సరి..!" లేచింది మా ఆవిడ.

"అసలు వాళ్ళ వయసు.." మళ్ళీ నసిగా.

"ఓమాట చెప్పనా? 'చైల్డ్ లేబర్'ని ప్రభుత్వం నిషేధించింది గదా? మరి వీళ్ళూ పిల్లలేగా? ఎందుకు పట్టించుకోవడం లేదూ? అలాగే...'తెలుగే చదవండీ..తెలుగులోనే మాట్లాడండీ' అని టీవీల్లో, పేపర్లో, రేడియోల్లో ప్రకటనలు గుప్పిస్తున్నారు కదా...! తెలుగు ఒక్క ముక్కరాని వాళ్ళచేతే ఎందుకు 'యాక్ట్' చేయిస్తున్నారు? ఎందుకు పాటలు పాడిస్తున్నారు?

ఒక వ్యవసాయదారుడో, ఓ టైలరో వాళ్ళ పిల్లలకి వ్యవసాయం చేయడమూ, బట్టలు కుట్టడమూ నేర్పిస్తుంటే 'చైల్డ్ లేబర్' అని వాళ్ళమీద కేసులు పెడుతున్నారు. వ్యవసాయం చిన్నతనంలోనే నేర్చుకోవాలి. చెట్టంత ఎదిగి ఏ డిగ్రీనో చదివిన వాడు బురదలో దిగి దున్నగలడా?

పోనీ చదువే ముఖ్యం అనుకుందాం! చదివిన ప్రతి వాడికీ ఉద్యోగాలు వస్తున్నాయా? వృత్తి విద్యల్ని చిన్నతనంలో నేర్చుకోబట్టే లక్షలాది మంది ఒకపూటైనా తినగలుగుతున్నారు. 'బాలకార్మికు'లని వాళ్ళందర్నీ పనిమాన్పిస్తే వాళ్ళు పెద్దయ్యాక ఏమౌతారు? ఏం చేస్తారు?

ఇక యీ 'బాసిత్ బెనర్జీలూ', వత్సాలా పిడకలకర్రుల సంగతంటావా? బోల్డంత సంపాయిస్తారు. సంపాయించింది దేన్లో ఓ దాన్లో 'ఇన్వెస్టు' చేస్తారు. తద్వారా కొంతమందికన్నా ఉపాధి కలుగుతుంది... సో.. చింతలపూడాయనా.. డోంట్ వర్రీ..! బ్రహ్మాండంగా అరటికాయ ఉప్మాకూర, కందిపచ్చడీ, పొట్లకాయ పెరుగు పచ్చడీచేశా. హాయిగా లాగించి పడుకో..!" నా వీపు మీద ఓ చరుపు చరిచి వంటింట్లోకి చక్కాపోయింది మా ఆవిడ.

నేను ఆలోచిస్తుండగానే - గణ గణా మని ఫోన్ మోగింది. "హలో" అన్నా.

"నేనండీ..వెంకట్రావుని! మీ అమ్మాయి సెవెంత్ పాసైందిటగా? మన డైరెక్టరు చైతన్య గారు మొన్న న్యూకల్ యానివర్సరీలో చూశారట....! మీరు ఓకె అంటే 'హీరోయిన్'గా బుక్ చేసుకుంటానంటున్నారు..." ఉత్సాహంగా అన్నాడు వెంకట్రావు.

"ఇదిగో ..! మనమ్మాయికి హీరోయిన్ ఛాన్సిస్తానంటున్నారట" మౌత్ పీసు మూసి మా ఆవిడకి వినిపించేట్టు అరిచా.

"దాని వయస్సు చాలా పెద్దదిగానీ - నిన్ను హీరోగా నన్ను హీరోయిన్‌గా బుక్ చేసుకుంటారేమో కనుక్కో" వంటింటిలోంచి అరిచింది మాఆవిడ.

దటీజ్ దట్! కథ కంచికి ! నేను డైనింగ్ టేబుల్ దగ్గరికీ.

(పి.ఎస్: అయ్యా...'బాల కార్మికులు ఉండాలనీ, బాలల చేత పనిచేయించాలనీ నా ఉద్దేశ్యం కానే కాదు. ఊహల్లో కూడా అలా ఆలోచించను. కానీ - కొన్ని 'పనులు' చిన్నతనం నుంచీ నేర్చుకుంటే గానీ రావు. అలా 'నేర్పటం' మాత్రం తప్పుకాదని నా మనవి. ఇది ఎవరినీ విమర్శించటానికి వ్రాసిన కథ కానే కాదు. ఓ పదేళ్ల పిల్లకి 'హార్మోన్ ఇంజక్షన్లు' ఇప్పించి 'పదహారేళ్ల' పిల్ల కింద చలామణీ చేస్తూ హీరోయిన్ వేషాల కోసం ట్రై చేస్తున్న ఓ పెద్ద మనిషిని చూశాక కలిగిన నా స్పందన మాత్రమే ఇది.)



50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

3

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

విజయా వారి 'సి.ఐ.డి.' సినిమాలో నేను హీరోయిన్‌గా చేసాను. యన్.టి.రామారావు గారు హీరో. ఆ సినిమా షూటింగ్ మధ్యలోనే అంటే 1965లో రమణారావు గారితో నాకు పెళ్ళి అయింది. అందులో నాకు బాగా ఇష్టమైన పాట మరపురాని పాట -

"ఎందుకనో నిను చూడగనే
కవ్వించాలని వుంటుంది
కవ్వించి నువు కలహ మాడితే
నవ్వుకోనాలని వుంటుంది'

ఈ పాటలో ఓ లైను....

**'కొంగున కట్టుకు నిను తిప్పాలని,**
**ఏదో వేడుక పుడుతుంది'** అని వుంటుంది.

ఆ పాట సాహిత్యాన్ని నేను ఎలా ఉపయోగించుకున్నానంటే -పెళ్లయిన కొత్తలో నేను, మావారితో ఎక్కడికైనా కారులో బయటకి వెళ్ళినప్పుడు ఆ పాటే పాడుతుండేదాన్ని. నిజంగానే నన్ను ఆయన కొంగున పట్టుకుని తిరుగుతూనే వుండేవారు లెండి.

ఏవియం వారి 'నాగుల చవితి'. దర్శకుడు చిత్రపు నారాయణమూర్తి. అందులో చాలా విచిత్రమైన అనుభవాలు. తెల్లవారి లేచిన దగ్గర్నుంచి 15 రోజుల పాటు పాముల మధ్యనే షూటింగ్. పాము పడగవిప్పేది. టేక్ అనగానే పడగ మూసేసేది. కెమెరా పక్కనుంచి ఒక ఎర్రటి గుడ్డ దాని ముందు కదిలిస్తే మళ్లా పడగ విప్పేది. సినిమాలో పాముకు పాలు పట్టి దాని చుట్టూ



జమునా-రమణారావుల "పెళ్ళిరోజు" 4-8-1965



నూతన వధూవరులతో కె.వి.రెడ్డి, చక్రపాణి



నూతన వధూవరులను అభినందిస్తున్న నిర్మాత రామానాయుడు



చిత్రం : సి.ఐ.డి.   రచన: పింగళి నాగేంద్రరావు   సంగీతం: ఘంటసాల,   గానం : ఘంటసాల,సుశీల






ఆమె : ఎందుకనో నిను చూడగనే
కవ్వించాలని వుంటుంది ॥ఎందుకనో॥
కవ్వించీ నీవు కలహమాడితే
నవ్వుకొనాలనివుంటుంది .......ఎందుకనో
అతడు: ఎందుకనో నిను చూడగనే
ఏదో ఇదిగా వుంటుంది
నీ పెదవులపై నవ్వు చింది
మనసు చల్లగా వుంటుంది ..ఎందుకనో...ఎందుకనో
ఆమె : అడుగడుగున నీరాజనమంత
ఒలికిస్తూ నువు కులుకుతువుంటే
కొంగున కట్టుకు నిను తిప్పాలని
ఏదో వేడుక పుడుతుంది... ఎందుకనో
అతడు: ఎందుకనో నిను చూడగానే
ఏదో ఇది గా వుంటుంది
ఆమె : కవ్వించే నువు కలహమాడితే
నవ్వుకొనాలని వుంటుందీ......ఎందుకనో..
అతడు: అణువణువున నీ సొంపులు ఒంపులు
నను మైకంలో ముంచుతు వుంటే॥అణువ॥
నీలో ఐక్యం చెందాలంటూ
నీలో ఐక్యం చెందాలంటూ
ఏదో తహ తహ పుడుతుంది
ఆమె : ఎందుకనో నినుచూడగనే
కవ్వించాలని వుంటుంది
కవ్వించీ నువు కలహమాడితే
నవ్వుకొనాలని వుంటుంది
ఎందుకనో.........ఎందుకనో
ఇద్దరు: ఆ........ఓ...ఓ.....ఓ.....ఓ..
ఆహా హో హో ఓ హో ఓహో ఓహో






తిరుగుతూ ఉండాలి. అది ఎంత సహజంగా ఉందంటే - గజ్జెలు కట్టుకుని చప్పుడుచేస్తూ తిరుగుతూ వుంటే గజ్జల సౌండ్‌కి అది తిరుగుతూ వుండేది.

ఆ సినిమాలో పాము కాటు వేయడానికి వచ్చినపుడు చాలా మంచి పాట ఒకటుంది. **'ఓ దేవా ఫణీశా శరణమయా'** అని చాలా హై పిచ్‌లో సుశీల గారు పాడారు. చాలా అద్భుతమైన పాట అది. ఆ పాటలో అఖరున - పాము పాలు తాగేసి వెళ్లిపోయిన తర్వాత

**నిలిపినాడవా నా తండ్రీ నిరుపమాన**
**కరుణ నా గళసీమ ఓ దేవ మాంగల్యశోభ**

అని చెప్పి చాలా బాగా పాడారు. అప్పుడు సుశీల గారు ఏ.వియమ్.లో పర్మినెంట్ ఆరిస్టుగా పనిచేస్తుండేవారు. ఆమె పాడిన విధానం.. అంటే చాలా ఎమోషనల్‌గా...చాలా బాగా పాడారు. అలాగే సాహిత్యం కూడా నాకు చాలా బాగా నచ్చింది.'నాగులచవితి'లో ఇంకొక సంఘటన ఏమిటంటే -

మొదటి రాత్రి సీనుకి డ్రస్ ఒక విధంగా వేశారు. సరే.. మొత్తం 15 రోజుల షూటింగు పాములతో.. వాటితో, అంతా అయిపోయింది. వీణ పాట కూడా అయిపోయింది. శంకరుడు మీద

**' ప్రభూ నీ పాద రాధనే'**

అనే పాట ఉంది. పాట మొత్తం పిక్చరైజేషన్ అయిపోయిన తర్వాత చెట్టియార్‌గారు ఎడిటింగ్‌లో చూసుకుని హీరోయిన్ డ్రస్ బాగాలేదు. మళ్లీ రీ-షూట్ చేయమన్నారు. మొత్తం రీ-షూట్ చేసారు. ఆ రోజుల్లో పిక్చర్స్ తక్కువ కాబట్టి, కాల్‌షీట్స్ ఎడ్జెస్ట్ చేసి ఇవ్వగలిగాం. అటువంటి మంచి టేస్ట్ ఉన్న సంస్థ.

అసలు ఫస్ట్ నేను ఏవీయంలోకి ఎలా వచ్చానంటే - రాజ్‌కుమార్ గారు హీరోగా వాళ్లు తీస్తున్న 'బేడర కన్నప్ప' కోసం నాకు కబురు పెట్టారు. మా నాన్నగారు వెళ్లి మాట్లాడి, ఏ క్యారెక్టరో తెలుసుకుని 'మా అమ్మాయికి డ్యాన్స్ చేయటం అంతగా రాదు, పైగా ఆమె హీరోయిన్‌గా యాక్ట్ చేస్తుంది. వేశ్య పాత్ర లాంటివి అమ్మాయి చేత చేయించటం ఇష్టం లేదండి' అని రెఫ్యూజ్ చేశారు.

అలా అనగానే చెట్టియార్‌గారు కొంచెం అప్‌సెట్ అయి 'వాట్ మిస్టర్ శ్రీనివాసరావ్! సీ...అవర్ కన్‌సన్ ఈజ్ ఏ బిగ్ కన్‌సన్...యూ ఆర్ నాట్ థింకింగ్ ఎబౌట్ దట్...'అని ఏదో అన్నారు. మా నాన్నగారు కొంచెం ఆవేశంగా ఉండేవారు. ఆయన గుణాలే నాకు వచ్చాయి.

చెట్టియార్ గారు అలా అనగానే 'సార్ మీ సంస్థలోనే మా అమ్మాయికి హీరోయిన్‌గా వేస్తుంది. మాకా కాన్ఫిడెన్స్ ఉంది. మా అమ్మాయికి డ్యాన్స్ రాదు. ఇప్పటికి ఐ యామ్ సారీ... డోంట్ థింక్ అదర్‌వైజ్' అని చెప్పి వచ్చేశారు. రాజసులోచన ఆ క్యారెక్టర్ చేశారు.

ఇమ్మీడియట్‌గా నాగులచవితి -

# నేనూ నా పాటలు



సాకీ : ఔరా కుటిల విధాన వినోదా
మహా కఠోర విధాతా
పాట : గర్భశోకమే నా పరమాయె
కడుపే కాల్చెరా ధాతా ॥గర్భశోకమే॥
తల్లియు తండ్రియు తనయుని చేతిలో
దహన మౌటయే గతిరా - సద్గతిరా
తారుమారై తామే తనయుని
దహనము సేయుట విధిరా - దుర్విధిరా-
హతవిధీ - హతవిధీ - నీవిదే ఘోరమా
నీకు హృదయమె లేదా ॥గర్భశోకమే॥
సుందర తరమగు శోభన గృహమే
స్మశానమే చేసితివా
ప్రేమానందము నందకముందే
దాంపత్యము కూల్చితివా - నవ
దాంపత్యము కూల్చితివా
కరిగింతువే కన్నె మోముపై
పసుపు కుంకుమ పటిమ
మాయము సేతువే మంగళమూర్తికి
మంగళ సూత్రపు మహిమ-సతి
మంగళ సూత్రపు మహిమ
హే జగదంబా కనరావమ్మా
విధి దురంతమో యమ్మా ॥గర్భశోకమే॥




'నాగులచవితి' పాటల పుస్తకం కవర్‌పేజీ



'నాగులచవితి'లో...

సాకీ : ఓ దేవ ఫణీశా శరణమయా
నా నాధుని బ్రోవుమయా
నా నాధుని బ్రోవుమయా
పాట : ఓ దేవ ఫణీశా శరణమయా
నా నాధుని బ్రోవుమయా ॥ఓదేవ॥
ప్రేమ భావన లేమో యేమో
ఊహా జగతి నేపారే
కాంచిన కలలే నిజమగు తరినే
నిజమే కలగానగునే
ఓ దేవ మహాత్మా మరలు మాయా
నా నాధుని బ్రోవుమయా ॥ఓ దేవ॥
వలపు తేనియల సోనలనానే
ప్రధమ సమాగము మయ్యా
యౌవన జీవన సుధా నిధులలో
విష బిందువు చిందకయా
నా పసుపు కుంకుమ నిలుపుమయా
నా నాధుని బ్రోవుమయా ॥ఓదేవ॥
శోభన రాత్రే కాళరాత్రిగా
సేయుటే న్యాయమా దేవా
కరువ దలచిన కరువు మిరువుర
మరణింతము ఒకమారే
గీ : నిలిపి నాడవా నా తండ్రి నిరుప మాన
కరుణ నా గళసీమ ఓ దేవ మాంగల్యశోభ
అందు కొనుమయ్యా ఓ దేవ ఆశ్రితుల
కృతజ్ఞతా పూర్వకంబు వందన శతంబు

① 

② 

③ 

తెలుగు, కన్నడం, తర్వాత భూకైలాస్ - తెలుగు, కన్నడం. కన్నడంలో రాజ్‌కుమార్ గారికి ఆర్టిస్ట్‌గా అది రెండో సినిమా. ఆర్టిస్ట్ గా నేనే ఆయనకంటే సీనియర్‌ని. తర్వాత లేతమనసులు డబుల్ వర్షన్, మూగనోము సింగిల్ వెర్షన్,రాము సింగిల్ వెర్షన్, మిస్‌మేరీ (హిందీ)...ఇలా వారికి పది పిక్చర్స్‌దాకా చేశాను. ఏవియం సంస్థలో ఫ్యామిలీ ఎట్మాస్ఫియర్ ఉండేది. చెట్టియార్‌గారు ఎక్కువగా సెట్‌లోకి వచ్చేవారు కాదు.

'లేతమనసులు' అరవంలోనూ, తెలుగులోనూ తీశారు. అన్నీ మంచి పాటలే. అందులో **'అందాల చెలికాడా అందుకో నాలేఖ'** చాలా పాప్యులర్ సాంగ్. సాహిత్యం కూడా నిజంగా చాలా బాగుంది. తమిళంలోనూ బాగుంటుంది. **అన్బుళ్ళ మాన్ విళియే**...అనేది ఆ పాట పల్లవి. ఈ పాట యాక్ట్ చేసినపుడు ఒక సంఘటన జరిగింది.

అక్కడ తమిళహీరో జయశంకర్ అని - అతనికి హీరోగా ఇదే మొదటి సినిమా. తమిళ పాట పిక్చరైజేషన్ జరుగుతున్నప్పుడు గడ్డివాము పైనుంచి దొర్లుకుంటూ వచ్చి నా పక్కన కూర్చోవాలి. అతను లావుగా, కొంచెం మొరటుగా వుండేవాడు.

రిహార్సిల్స్‌లో బాగానే చేశాడు. కానీ ఫైనల్ టేక్‌లో కాలిక్యులేషన్ వేసుకోవడంలో పొరబడ్డాడేమో, టేక్ అనేటప్పటికి అతను కంగారుగా దొర్లుకుంటూ నా తలపై

④ 

⑤ 

⑥ 

# నేనూ నా పాటలు





















శ్రీమతి జమున మెడకు యాక్సిడెంట్ జరిగిన పాట చిత్రీకరణలో తమిళ హీరో జయశంకర్ దొర్లుకుంటూ పడిన సన్నివేశంలోని దృశ్యాలివి.

పడిపోయాడు. కంప్లీట్‌గా బాడీ వెయిట్ అంతా నా తలపైన పడిపోయింది. నా మెడ విరిగిపోయింది అనుకొన్నా. అమ్మా అని పెద్దగా అరిచాను.

డైరెక్టర్ అతనికి బాగా చివాట్లు పెట్టారు. అతను ఏం చేస్తాడు పాపం. అతనికి కొత్త, కంగారు. అప్పటికి నేను పెద్ద హీరోయిన్ ని. షూటింగ్ ఏమీ ఆపలేదు. ఐస్ తెచ్చి మెడపైన, తలపైన పెట్టారు. ఒకటి,రెండు గంటలతర్వాత తలనెప్పి తగ్గిపోయింది. అదొక యాక్సిడెంట్, అది మరువలేని సంఘటన.

ఇప్పుడు నా మెడ ఊగడానికి ఆ ఇన్సిడెంట్ ఒక కారణమేమో అనిపిస్తుంటుంది. డాక్టరుని అడిగితే ఏం చెప్పలేదు. దానివల్ల నాకు పెద్ద నష్టం లేదు. అప్పుడప్పుడు నొప్పి వస్తుంటుంది దానికదే తగ్గిపోతుంది అంతే.

అలాగే ఇదే ఏవియంలో అక్కయ్య (సావిత్రి) తో కలిసి నటించిన "నాదీ ఆడేజన్మే'లో మరో యాక్సిడెంట్! నాకు జరిగిన రెండు యాక్సిడెంట్లూ ఏవియమ్‌లో కావడం యాదృచ్ఛికం. ఆ సినిమాలో సావిత్రిగారి చెల్లిగా యాక్ట్‌చేశాను. హరనాథ్ నా పక్కన హీరో. మా ఇద్దరికీ,

**'నామాట నమ్మితివేలా,**
**నామీద కోపమదేలా '**

అనే పాట ఉంది. అతను స్కూటర్ మీద నన్ను ఎక్కించుకొని కబ్బన్ పార్క్‌లో ఫౌంటెన్ చుట్టూ తిరగాలి. అతనికేమో స్కూటర్ డ్రైవ్ చేయటం అంతగా రాదు.

అప్పటికీ రిహార్సిల్స్ టైమ్‌లో "ఏమయ్యా బాగా డ్రైవ్ చేస్తావా, లేక కింద పడేస్తావా' అని అడిగితే "లేదు మేడమ్, మీరేం భయపడకండి, బాగా డ్రైవ్ చేస్తాను' అని అన్నాడు.

టేక్ అన్నప్పుడు రౌండ్ తిరగడంలో బాలన్స్ అవ్వలేదు. ఎదురుగా మెట్లువున్నాయి. ధన్ ధన్ మని మెట్లమీద నుంచి పడేశాడు. నేను పడిపోతున్నానని గ్రహించి, ఆ స్కూటర్ నా మీద ఎక్కడ పడుతుందో అని తెలివిగా ముందే దూకేశాను.

జనరల్‌గా నాగేశ్వరరావు, రామారావుగార్లు హీరోలుగా ఉంటే నా హైట్ సరిపోతుంది కాబట్టి హైహీల్స్ వేసుకోను. హరనాథ్ చాలా పొడవుగా ఉంటాడు. అందుకని ఒకటిన్నర అంగుళాల హీల్స్ వేసుకున్నాను. మెట్ల మీద పడ్డానుగా, కాలు చెప్పులోంచి బయటకి వచ్చి ట్విస్ట్ అయింది. అప్పుడే బాగా నొప్పి వచ్చింది నేను కుంటుకుంటూ వచ్చి కూర్చున్నాను.

రాత్రికి రాత్రి ఎక్సరే తీశారు. బోను చిట్లిపోయింది కానీ విరగలేదు. ఎప్పుడూ నేను బెడ్‌లో ఉండి ఎరుగను. అటువంటిది ఫస్ట్‌టైమ్ 10,15 రోజులు బెడ్ రెస్ట్ తీసుకోవలసి వచ్చింది.

కాలు నయమయిన తర్వాత 'నా మాట నమ్మితివేలా' పాట చేశాను.

(వచ్చేసంచికలో మరికొన్ని పాటల గురించి....)






















శ్రీమతి జమున కాలు యాక్సిడెంట్ జరిగిన పాట చిత్రీకరణలోని కొన్ని దృశ్యాలివి.



ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు 11

# ఆస్థాన విమర్శకుడు

కొన్ని దశాబ్దాలుగా మంత్రి ఆదర్శం ఒకటే. కరాజు రాజ్యంలో ఎవరు ఏపని చేసినా అది ప్రజాబాహుళ్యానికి ఉపయోగపడేదిగా వుండాలే గాని తమ కుటుంబ సభ్యులకో, దగ్గరి బంధువులకో సహాయపడేవిగా ఉండకూడదు. మంత్రి పదవే ఉన్నా, సంసార విషయంలో తనూ అందరిలాగా సామాన్యుడే. అందరిలాగా తనకూ ఇంటి సమస్యలెన్నెన్నో వున్నాయ్. అయినా తన సొంత అవసరాల్ని తీర్చుకునేందుకు ఏనాడూ ప్రభుత్వ యంత్రాంగాన్ని ఉపయోగించడానికి ప్రయత్నించలేదు. అందుకే తన మేనల్లుడైన సర్వజ్ఞ దేవుడికి ఆస్థానంలో ఏదైనా మంచి ఉద్యోగం చూడమని చెల్లెలు పదేపదే కోరుతున్నా మంత్రి మాత్రం చలించలేదు. సర్వజ్ఞుడు కష్టపడి సకలవిద్యలనూ అభ్యసించి ఉత్తీర్ణుడైతే ఉద్యోగాలు వాటంతటవే వెతుక్కుంటూ వస్తాయని చెల్లెలికి నచ్చచెప్పాడు. కాని ఆమె అదేం వినిపించుకోక నర్వజ్ఞుని నేరుగా అన్నయ్య దగ్గరకు పంపించి ఆయన ఎలా చెప్తే అలా చెయ్యమని కొడుకును ఉపదేశించింది.

నర్వజ్ఞుడు ఆరడుగుల అందమైన యువకుడు. పేరుకు తగ్గట్టుగా అతనెప్పుడూ అన్నీ తెలిసిన వాడిలా అన్నిటికీ చిఱునవ్వుతో తల ఊపుతుంటాడు. ఇటువంటి వానికి బోధించడం చాలా తేలికైన పని అనుకున్న మంత్రి మేనల్లుణ్ణి ఆప్యాయంగా చూసి "నాయనా! నర్వజ్ఞా! నీవు సకల విద్యాపారంగతుడ వౌతావనడంలో ఎలాంటి సందేహమూ లేదు. అందుకని ఇప్పుడు నేను చెప్పినట్లు చెయ్. మొదట వారణాసికి వెళ్ళి అక్కడ నాకు తెలిసిన వార్నొకరిని కలువు. ఆయన



సంస్కృతంతో పాటు పన్నెండు భాషలలో మహాపండితుడే గాక ఎన్నో కావ్యాలు రాసిన కవి. ఆయన దగ్గర శిష్యరికం చేసి సంస్కృత ఆంధ్ర సాహిత్యాలలో సంపూర్ణ పాండిత్యాన్ని సంపాదించు. ఆ తర్వాత ఉజ్జయినికి వెళ్ళి అక్కడ నాకు తెలిసిన చిత్రకళానిపుణుల దగ్గర అన్ని లలిత కళలనూ అభ్యసించి పరిపూర్ణత సంపాదించు. ఆ తర్వాత విజయనగరం వచ్చి అక్కడ నాకు తెలిసిన సంగీత విద్వాంసుల వద్ద ఉత్తరాది దక్షిణాది శాస్త్రీయ సంగీతాలను అభ్యసించు. అప్పుడిక్కడకు వచ్చావనుకో సర్వజ్ఞుడనే పేరు నీకు సార్థకమైందని అందరూ ఒప్పుకుంటారు. ఇక నీ జీవిత ప్రయాణం ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా సాగుతుంది'' అని మేనల్లుణ్ణి ఆశీర్వదించి, తనకు తెలిసిన గురువులకు సర్వజ్ఞుణ్ణి పరిచయం చేస్తూ రాసిన ఉత్తరాలతో పాటు కొన్ని సంవత్సరాలకు సరిపడే డబ్బిచ్చి సాగనంపాడు.




మరుసటి రోజు మంత్రి కరాజును కలిసి తన మేనల్లుణ్ణి విద్యాభ్యాసం కోసం ఎలా పంపినదీ సగర్వంగా చెప్పాడు. కరాజు కూడా ఆనందిస్తూ సర్వజ్ఞుడు తిరిగి రాగానే తనకు తెలపమని చెప్పాడు. సర్వజ్ఞుడు తన ప్రమేయం లేకుండా స్వంత ప్రతిభతోనే రాజుగారి కొలువులో మంచి స్థానం సంపాదించగలడని అనుకొని సంతోషించాడు మంత్రి.



సర్వజ్ఞుడు వారణాసికి ప్రయాణమయ్యాడు. బండ్లమీద, ఓడలమీద ప్రయాణం చెయ్యాలి. సామాన్యంగా అందరికీ వారణాసి చేరుకోవడానికి మూడు వారాలు పడ్తుంది. కాని సర్వజ్ఞుడు డబ్బుకొరత లేనందువల్ల మధ్య మధ్య ఊళ్ళల్లో ఎక్కువసేపు విశ్రాంతి తీసుకుంటూ నిదానంగా ప్రయాణం చేశాడు. ఒక్కొక్క ఊళ్ళో ఒక్కొక్క రకమైన తిండి తింటూ దేశంలోని రకరకాల భోజనాల ప్రత్యేకతల్ని రుచి చూస్తూ వీటితో ఎన్నో విషయాలను మంత్రిగారు చెప్పకపోయినా నేర్చుకున్నాడు. అందుకని వారణాసి చేరేటప్పటికి కొంత ఆలస్యమైంది.

కరాజు రాజ్యపు మంత్రిగారి మేనల్లుడు వచ్చాడనగానే గురువుగారైన సదానంద పండితులు పరమానంద భరితులయ్యారు. ప్రయాణ బడలిక తీర్చుకొని మరుసటి రోజువస్తే పాఠాలు మొదలెడతాం అన్నారు.

అక్కర్లేదు, ఇప్పుడే మొదలెడదామని సర్వజ్ఞుడనగానే శిష్యుని ఉత్సాహానికి ఆశ్చర్యపోయారు గురువుగారు. కాని ఆయనకి తెలియని విషయమేమిటంటే సర్వజ్ఞుడు రెండు రోజులుగా నగరపొలిమేరల్లోనే వుంటూ ఉత్తరదేశానికి చెందిన ప్రత్యేకమైన భోజనాలని రుచిచూస్తూ బాగా విశ్రాంతి తీస్కొని ఉదయమే అక్కడికి వచ్చాడని. భారతీయ సాహిత్య సంప్రదాయాల్ని గురించి, రామాయణ భారత భాగవతాల ప్రాశస్త్యాన్ని గురించి మొదటి రోజు పాఠం ప్రారంభమైంది. సర్వజ్ఞుడు విన్నంత సేపు విన్నాడు. కొంత సేపటికి అతనికొక



సందేహం వచ్చింది. "గురువుగారూ! వాల్మీకి మహర్షి రామాయణం మాత్రం ఎందుకు రాశాడు? భాగవతం ఎందుకు రాయలేదు?" అని అడిగాడు. గురువు బిత్తర పోయాడు. ఈ సందేహం ఆయన కెపుడూ రాలేదు. ఇపుడు సర్వజ్ఞుని ప్రశ్నకు ఏం చెప్పాలో తోచలేదు.

"దానికి జవాబు నేనే చెప్తాను" అన్నాడు సర్వజ్ఞుడు. గురువు గారు ఎగాదిగా చూశాడు.

"వాల్మీకి రామాయణం మాత్రం ఎందుకు రాశాడంటే బ్రహ్మ అలా రాసాడు కనుక", అన్నాడు సర్వజ్ఞుడు. తిరుగులేని ఈ జవాబుతో చాలా సేపటి వరకూ గురువు గారి నోటెంబడి మాట రాలేదు. కాని ఆలోచించగాఎన్నో సంవత్సరాలుగా వున్న సందేహాలన్నీ ఒక్క తృటిలో పటాపంచలయ్యాయ్. అప్పట్నుంచి ఎటువంటి పండిత సమావేశంలోనైనా ఎవరైనా ఒక సందేహాన్ని వెలిబుచ్చితే "బ్రహ్మ అలా రాసాడు" అని ముక్తసరిగా జవాబు చెప్పేవాడు.

ఒకరోజు ఏకాదశిన సదానంద పండితులు ఉపవాసం చేస్తారు కనుక పాఠాలు లేవన్నారు. సర్వజ్ఞుడికి ఉపవాసానికి చాలా దూరం. అతనా రోజు ఉదయాన్నే అన్నపూర్ణేశ్వరిని దర్శించుకొని ఆ తర్వాత వారణాసిలో ప్రత్యేక తినుబండారాలవేమ్మే చోటుకెళ్ళి కొత్త కొత్త ఫలహారాలను సేవించి గంగానదీ తీరాన కాసేపు నడిచి ఇల్లు చేరుకున్నాడు. మరుసటి రోజు సర్వజ్ఞుడు గురువుగారితో 'గురువుగారూ! మీ దగ్గర నా విద్య పూర్తి కావడానికి ఎంతకాలం పడ్తుంది?'' అనడిగాడు. గురువుగారు తడుముకోకుండా "సామాన్యులకైతే అయిదారు సంవత్సరాలు పడ్తుంది. కాని నీలాంటి సర్వజ్ఞునికి ఒక సంవత్సరం కూడా ఎక్కువే" అన్నాడు. ఆ తర్వాత సర్వజ్ఞుడు పాఠాలు వింటున్నప్పుడెల్లా ఏదో ఒక కుంటిప్రశ్న వేసి సందేహాలడిగి గురువుగారిని తికమక పెట్టేవాడు. మంత్రిగారి మేనల్లుడు కదా అనే గౌరవంతో అన్నిటినీ దిగమింగి సంవత్సరం కాగానే సర్వజ్ఞుని పలిచి "నాయనా ! నీ విద్య పూర్తయింది" అని అతన్ని ఆశీర్వదించి ఊరి నుండి సాగనంపాడు.

మంత్రికిచ్చిన మాట ప్రకారం సర్వజ్ఞుడు అక్కణ్ణుంచి ఉజ్జయని చేరుకున్నాడు. యథాప్రకారం ముందు ఉజ్జయినీ నగరపు ప్రత్యేక భోజనాలను వారం రోజులు రుచి చూసి గురువుగారైన మహాశిల్పి కాళీవరప్రసాదుల వారిని కలిశాడు. ఆయన కళాశాలల్లో ఉత్తీర్ణులైన విద్యార్థులు దేశ విదేశాల్లో పేరు ప్రఖ్యాతులను గడించారు. తనను కలిసిన సర్వజ్ఞుణ్ణి చూసి

వరప్రసాదుల వారు "నాయనా ! గౌరవ పాత్రులైన మంత్రిగారి మేనల్లుడవై నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. నీవేం చేయగలవు?" అన్నాడు.

"ఏదైనా చెయ్యగలను. కాని ఎందుకు చెయ్యాలనేదే నా సందేహం" అన్నాడు సర్వజ్ఞుడు. ఆదిలోనే సందేహాలతో ప్రారంభమైన శిష్యరికం ఎంతవరకు సాగుతుందో అని గురువు సందేహించాడు. కుంచెను పట్టుకునే తీరు, రంగులు కలిపే విధానం, ఎదటి దృశ్యాల పరిశీలన లాంటి ప్రాథమిక సూత్రాలతో సర్వజ్ఞుని విద్యాభ్యాసం ప్రారంభమైంది.

కొద్ది రోజుల్లోనే అతనికో సందేహం కలిగింది. జీవితం యొక్క ముఖ్య లక్షణం కదలిక. మనిషి నడుస్తున్నా, పక్షులెగురు తున్నా, నీరు పారుతున్నా ఆకులు ఆడుతున్నా ఆ కదలికే ప్రాణం. అది లేకపోతే ప్రాణం లేనట్టే. మరి ప్రాణంలేని వస్తువంటే పనికి రాని వస్తువేకదా అంటే కదలిక వున్న జీవితాన్ని కదలికలేని చిత్రపటంగా మార్చడం ప్రాణం తీసేయడం లాంటిదే కదా. అంటే ఇది పనికిరాని వస్తువౌతుందని సర్వజ్ఞుడి సందేహం. ఇది వినగానే గురువుగారికి ప్రాణం పోయినంత పని అయింది. ఇతనితో ఎన్ని సంవత్సరాలు బాధపడాలో అని గుంజుకున్నాడు. మర్నాడు సర్వజ్ఞుడు "గురువుగారూ ! చిత్ర లేఖనము, శిల్పము ఇవన్నీ సంవత్సరం లోగా నేర్చుకోవచ్చు కదా?" అనడిగాడు.

'సంవత్సరం ఎందుకు నాయనా! ఆర్నెలలు చాలు" అన్నాడు గురువుగారు కాస్త కుదుట పడుతూ. అప్పట్నుంచీ సర్వజ్ఞుడు తన చేత్తో ఏమీ చెయ్యకపోయినా మిగతా శిష్యుల చిత్ర పటాల్నీ, శిల్పాల్నీ తణిఖీ చేస్తూ ఇది సరిగాలేదు, అదిసరిగా లేదు అని తన అభిప్రాయాన్ని తెలియపరుస్తూ ఆర్నెల్లు గడిపాడు. ఎప్పుడెప్పుడా అని కాచుకొని వున్న గురువుగారు సర్వజ్ఞుని విద్య పూర్తయిందని చెప్పి ఆనందంతో అతన్ని అక్కణ్ణుంచి సాగనంపాడు.

సర్వజ్ఞుడు చివరి మజిలీగా విజయనగరం చేరుకున్నాడు. మంత్రి ఆదేశానుసారం సంగీత సార్వభౌముడు విద్వాన్ లక్ష్మీనరసింహం వారిని కలిసి తనకు తాను పరిచయం చేసుకున్నాడు.

లక్ష్మీనరసింహం మంత్రిగారికి దూరపు బంధువు. అంచేత తన దగ్గర శిష్యరికానికి వచ్చిన సర్వజ్ఞుణ్ణి అక్కడా యిక్కడా ఎందుకు తన ఇంట్లోనే వుండమని ఆహ్వానించాడు. పైగా "ఇక్కడ నీకేం కావాలన్నా అడుగు, ఏం సంకోచించకు" అన్నాడు. అనడం చాలు సర్వజ్ఞుడు, వెంటనే వంటవాణ్ణి కలిసి మూడు




నెలలవరకు రోజువారి ఎప్పుడెప్పుడు ఏయే ఆంధ్రా వంటకాలు చెయ్యాలో వివరంగా చెప్పాడు. ''దానిక్కావలసిన డబ్బులన్నీ నేనిస్తాను" అన్నాడుకూడా.

''నీవు హిందుస్తానీ సంగీతం నేర్చు కుంటావా, కర్ణాటక సంగీతం నేర్చుకుంటావా?" అనడిగాడు గురువు.

"రెండునూ" అన్నాడు సర్వజ్ఞుడు.

"గాత్రమా? వాయిద్యమా?"

"రెండూనూ".

"వీణా? వేణువా? ఫిడేలా? మృదంగమా?.."

"అన్నీను".

ఇంత ఉత్సాహం ఉన్న శిష్యుణ్ణి గురువుగారెప్పుడూ చూళ్ళేదు. పాఠం మొదలెట్టాక అసలు సంగతి తెలిసొచ్చింది. మొత్తం గురువుగార్ని పాడమనేవాడు శిష్యుడు. కాసేపు విని "అంతేకదా? నాకు తెలిసిపోయింది. తరువాతి పాఠం మొదలెట్టండి" అనేవాడు. ఇలా రోజూ పాడడం, వాయిద్యాల్ని వాయించడం గురువుగారే చేస్తున్నారు కాని ఒక్కపూట కూడా సర్వజ్ఞుడు వాటిని నేర్చుకోవాలనే ప్రయత్నానికి పోలేదు. ప్రతిసారీ "నాకు తెలిసిపోయింది" అని ధీమాగా ముందుకు సాగిపోయేవాడు. ఇక ఆగలేక గురువుగారు సర్వజ్ఞునితో "నాయనా! నేనే అన్నీ చేస్తూంటే మరి నువ్వెప్పుడు నేర్చుకుంటావు?" అనడిగాడు. "గురువుగారూ! ఒక కవిగారన్నట్టు కోయిలకెవరు పాట నేర్పారు? నెమలి కెవరు నాట్యం నేర్పారు? మరి మానవుల్లో మాత్రం ఈ నేర్పడాలు, నేర్చుకోడాలూ ఎందుకొచ్చాయా అని నా సందేహం" అన్నాడు సర్వజ్ఞుడు. "చాలా బాగా చెప్పావు నాయనా! నీకు విద్యాభ్యాసం అనవసరం. ఇక నీవు హాయిగా మీ వూరెళ్ళొచ్చు" అన్నారు గురువుగారు.

మరికొన్ని ఊళ్ళ భోజనాల రుచులను చూసి సర్వజ్ఞుడు చివఱకు వాళ్ళ వూరు చేరుకున్నాడు. కాని ఈలోగా మంత్రి తన మేనల్లుడు ఎలా విద్యాభ్యాసం చేస్తున్నాడో రహస్యంగా తెలుసుకు రమ్మని ఒక వార్తా హరుణ్ణి పంపాడు. అతను అన్నిచోట్లా తిరిగి సర్వజ్ఞుడు ఎలా విద్యాభ్యాసం సాగించిందీ, అతని భోజన పరిశోధనలు గురించి వివరంగా చెప్పాడు. ఇది విన్న మంత్రి విపరీతమైన విచారంలో మునిగిపొయ్యాడు. మేనల్లుడి నిర్వాహకం అటుంచి అతన్ని గురించి కరాజుకు చెప్పాను కదా ఇప్పుడు రాజుగారికి అసలు విషయం తెలిస్తే ఏమనుకుంటారో అనే బాధ అతనిలో ఎక్కువగా వుంది. ఎప్పటికైనా చెప్పాలి కనుక కడకు మహరాజు గారిని కలిసి సర్వజ్ఞుని విద్యాభ్యాసం గురించిన నిజం చెప్పేశాడు.

కరాజు శాంతంగా విన్నాడు. ఒక్క క్షణం ఆలోచించి "ఇందులో చింతించ వలసిన అవసరంలేదు, మంత్రీ! సర్వజ్ఞునికి తగిన ఉద్యోగం మన కొలువులో ఇప్పిద్దాం"అన్నాడు. మంత్రి అర్థం కాక చూశాడు.

"కాని మహరాజా! సర్వజ్ఞుడు ఏ విద్యా నేర్చుకోలేదు. ఏ పనీ చెయ్యలేదు" అన్నాడు మంత్రి.

"మంత్రీ! ప్రపంచంలోని పనులన్నీ చేతనైన వాళ్ళే చెయ్యాలనే నియమం ఏమీ లేదు. ఏ పనీ చేతకాని వాళ్ళు చెయ్యగలిగిన పనులు కూడా వున్నాయ్. ఉదాహరణకు ఏదీ చేయలేని వ్యక్తి సులువుగా చెయ్యగలిగిన పని ఒకటుంది - విమర్శించడం, ఎదటివారి కవితల్ని గానివ్వండి, సంగీతాన్ని గానివ్వండి చివఱకు ఎదటివాళ్ళు చేసే ఏ పనినైనా - ఇది బాగాలేదు, అది బాగుంది, అది ఓమోస్తరుగా వుంది, అల్లది మరీ బాగాలేదు -'అని చెప్పడానికి ప్రత్యేకమైన విద్య అవసరం లేదు. రకరకాల వంటకాల రుచులు తెలిసిన సర్వజ్ఞుడికి ఈ పని మరీ సులభం. అందుకని అతన్ని నేను ఆస్థాన విమర్శకుడిగా నియమిస్తున్నాను.

కరాజు బుద్ధి కుశలతకు మంత్రి ఆశ్చర్య పడిపోయాడు. ■






ఆలాపన (వ్యాస సంకలనం)
-వి.ఎ.కె.రంగారావు

**వెల : 250/- రూ॥లు**
**బదరీ పబ్లికేషన్స్, పొమ్మర్రు,**
**ప్రతులకు - విశాలాంధ్ర, నవోదయా**

పాటల విశ్లేషణ అనగానే తన పేరు గుర్తుకువచ్చేట్లా చేసుకున్న సంగీత, సాహిత్య, నృత్య విమర్శకుడు వి.ఎ.కె.రంగారావు విశ్వరూపదర్శనం కోసం చదివి తీరవలసిన పుస్తకం 'ఆలాపన'.

ఆంధ్రపత్రిక(వీక్లీ)లో 'సరాగమాల' శీర్షిక ద్వారా నాలుగు దశాబ్దాల క్రితమే ఈ ప్రక్రియను ప్రారంభించి ఒకతరం పాఠకులకు ఆరాధ్యుడిగా నిలిచారు రంగారావు. 'మలయమారుతం' (ఆంధ్రప్రభ వీక్లీ) 'వినవేడుక' (జ్యోతిమాసపత్రిక) ఇలా అనేక పత్రికలలో శీర్షికలు నడిపిన రంగారావు తర్వాత వచ్చిన సినిమాపాటలు రుచించకపోవడంతో వీటిని నడవడం మానేశారు.

మళ్లీ 20 ఏళ్లకు 'స్క్రీన్' వారపత్రికలో 'సౌండ్స్ ఆఫ్ మ్యూజిక్' శీర్షిక ద్వారా ఆంగ్ల పాఠకులకు చేరువయ్యారు. రెండేళ్ల తర్వాత అదీ మానేసిన మరో ఇరవై యేళ్లకు 'ఆలాపన' ద్వారా తన అభిమానులను అలరిస్తున్నారు. ఈ శీర్షిక ప్రారంభానికి, 'హాసం' ఆవిర్భావానికి లింకు ఉంది.

'హాసం' సంపాదకుడు రాజా అప్పట్లో 'వార్త' దినపత్రిక సినిమాపేజీ చూస్తూండేవారు. ప్రతి సోమవారం 'ఆపాత/ట మధురం' శీర్షికద్వారా పాత పాటలను పరామర్శించేవారు. (ఆ శీర్షికే మరింత విస్తృతంగా ఇప్పుడు 'హాసం'లో కొనసాగుతోంది). జూన్ 2000లో 'హాసం' పని ప్రారంభించడానికి రాజా వచ్చేయడంతో 'వార్త'లో ఆ శీర్షిక ఆగిపోయింది. ప్రతి సోమవారం 'ఆపాతమధురం' చదివి ఆనందించే సంగీత ప్రియులైన పాఠకులకోసం ప్రత్యామ్నాయం వెతకవలసివచ్చింది. అప్పుడు సంపాదకులకు స్ఫురించిన మొదటిపేరు వి.ఏ.కె.రంగారావుదే!

అక్టోబరు 16, 2000 నుండి ప్రతిసోమవారం 'వార్త' సినిమాపేజీలో 'ఆలాపన' కనబడడం ప్రారంభమయింది. నిజానికి 'ఆపాతమధురం'కు 'ఆలాపన'కు పోలిక లేదు. సంవత్సరాల వారీగా, సినిమాలవారీగా పాటలను ఆత్మీయంగా పరామర్శించడం రాజా బాణీ అయితే, తనదైన శైలిలో సంగీతాన్ని, సాహిత్యాన్ని, లోకంలోని అనేకానేక ఇతర విషయాలను స్పృశిస్తూ, విశ్లేషిస్తూ, వ్యాఖ్యానిస్తూ, విసుర్లు విసురుతూ, పాఠకులకు పరీక్షలు పెడుతూ, మందలిస్తూ, మెచ్చుకుంటూ సాగే శీర్షిక 'ఆలాపన'.

'నీదు మార్గమున నీయంత నియంత లేడు' అన్నట్టు రంగారావు శైలి రంగారావుదే! విజ్ఞాన సముపార్జనలో గాని, దాని ప్రదర్శనలో గాని, అభిప్రాయ వ్యక్తీకరణలో గాని ఆయన పద్ధతి ఆయనదే. ఆయనతో ఏకీభవించవచ్చు, విభేదించవచ్చు కానీ విస్మరించడం ఎవరితరం కాదు. ఈ రంగంలో ఆయన ఓ 'కల్ట్ ఫిగర్'. రాసేటప్పుడు ఏ పొరబాటు దొర్లినా 'ఇది రంగారావు కంటపడుతుందేమో, ఏమంటాడో ఏమో' అని రచయితలు బెదిరే స్థానాన్ని ఆయన నిలువుకుంటూనే ఉన్నాడు. ఆయన భావవ్యక్తీకరణా విధానాన్ని సహించలేనివారు సైతం ఆయన సత్యాన్వేషణను, కర్తవ్యనిష్ఠను మెచ్చుకోకుండా ఉండలేరు.

ఆయన నడిపిన 'సరాగమాల' వంటివి పుస్తకరూపంలో రాకపోయినా 'ఆలాపన' మాత్రం డాక్టర్ ఆర్. భార్గవిగారి వల్ల ఆ భాగ్యానికి నోచుకుంది. వంద 'ఆలాపన'లు, ఆ పైన రంగారావుగారితో 60 పేజీల సుదీర్ఘ ఇంటర్వ్యూ కలిపి 500 పేజీలు దాటిన ఈ పుస్తకం ధర 250 రూ॥లు. ఈ ఒక్క పుస్తకం చాలు రంగారావు వ్యక్తిత్వాన్ని, విజ్ఞానాన్ని పరిచయం చేసుకోవడానికి.

ఇందులో తన గురించి తాను చెప్పుకున్నవి -

"నేను ఇంటర్ ఫెయిలయిన తర్వాత మల్లాది రామకృష్ణశాస్త్రిగారి వద్దకు వెళ్లి కూర్చుని ఏడ్చాను. నా కిదిరాదు, అది రాదు, సంస్కృతం రాదు, వ్యాకరణం తెలియదు, కావ్యాలు రావు అంటూ. నన్నిలాగ ఓ పదినిమిషాలు ఏడవనిచ్చి 'నాయనా నీకు తెలియనివి అయిదో, ఆరో చెప్పావు. ఇంకా నీకు తెలియనివి 108 వున్నాయి' అన్నారు. ..."నీకు లేనివి చెప్పావు. ఇంకా ఎన్నో ఉన్నాయి అని చెబుతున్నాను. నీకు ఉన్నవి నువ్వు చెప్పుకోలేదు. నీకు నాట్యం మీద ఇంటరెస్టు ఉంది. పదముల గురించి కొంత తెలుసు. పాత సినిమాపాటలంటే నీ కిష్టం. శ్రమ, శ్రద్ధ వీటిలోనే చూపిస్తే సరస్వతి నిన్ను వెదుక్కుంటూ వస్తుంది!" అన్నారు.

రంగారావు అనగానే శ్రమ, శ్రద్ధ గుర్తుకు వస్తాయి. దానికి ఉదాహరణ ఈ పుస్తకంలోనే కనబడుతుంది.

"బ్రహ్మ కడిగిన పాదము' అనే అన్నమయ్య కీర్తనలో 'పామిడి తురగపు పాదము' అన్న పంక్తి ఉంది. బహుశ పామిడి అన్న ఊళ్లో కలికి అవతారం ఆలయముందేమో అని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారి నడిగితే 'నాయనా, గుడి వున్నదని రూఢిపరుచుకున్న తరువాతనే ఆ మాట అనవలె' అన్నారు. దర్యాప్తు పైన అలాంటిదేదీ లేదని తెలిసింది.

తి.తి.దే.వారి అన్నమాచార్య ప్రాజెక్టులో పనిచేసే డా॥ కె.వాణిని 'పామిడి'కి అర్థం అడుగగా. 'ముక్కిడి యనగా ముక్కులేనివాడు. పాము + ఇడి = పామిడి, పాములేకుండా చేయువాడు. అనగా గరుడుడు. తురగమనగా వాహనమని అర్థము. 'పామువైరియైన గరుత్మంతుని వాహనముగాగల విష్ణుమూర్తి అని ఆ వాక్యమున కర్థము' అని చెప్పారు.

ఇది తర్కానికి అందని అసందర్భాలాపన అని తెలిసిపోయినా కాదని వాదించే స్తోమతు అప్పటికి లేక ఊరుకున్నాను. ఆ మాటకు సరియైన అర్థం ఇప్పుడు సముద్రాల లక్ష్మణయ్య గారి పుస్తకం వలన తెలిసింది. ప్రామిడి= పామిడి= అడ్డమాక లేక ఉద్దండముగా సంచరించు గుఱ్ఱముగల పాదము అని. యీ అర్థంలోనే మరొక అన్నమయ్య కీర్తన (పామిడి కోరికలకు బంట్లైన వారలు) లో చూపించి లేశ సంశయాన్నీ దూరం చేశారు."

చదువు'కొన్న'వారిమీద, పేరు చివర పొడి అక్షరాలకై ప్రాకులాడేవారిపైన అరకొరజ్ఞానంతో అహంకరించే వారి పైన రంగారావు ఒంటికాలిపై ఎందుకు లేస్తారో ఇలాటి సంఘటనలు తెలుపుతాయి. తను వాడే భాష ఎంత పరుషంగా ఉంటుందో తెలిసే ఆయన ఉపయోగిస్తారని ఈ క్రింది వాక్యాలు తెలుపుతాయి -

'ఈ వయసులో నాకం వ్యక్తులమీద కోపతాపాలు ఉండకూడదు. వారి దుశ్చింతనపై, దుష్కార్యాలపైన ఉంటుంది. ఇది సాహిత్యాన్ని గౌరవించే వారందరికీ ఉండాలి. వారి వారికి వీలయిన ధోరణిలో యీ దుండగీడుతనాన్ని ఎదుర్కోవాలి. ఇదీ సాహిత్యసేవే.

త్రికరణశుద్ధిగా ప్రజాహిత కర్మ చేయబడినప్పుడు వేనోళ్ల కొనియాడగలను. అహంకారంతో (నాకీ విషయం తెలుసూ అని) ఆ విషయాన్ని యితరులకు తెలియజెప్పగలను. అలాగే పెద్దపీటలపై ఆసీనులైనవారు చేయకూడనిది చేస్తే రేవు తీసుకువెళ్లి ఉతకగలను... దీనికి వెరచేవారు బలహీనతలున్న వారే! చేయవలసినంత శ్రద్ధతో పని చేయనివారే!..

(సశేషం)

**- ఎమ్బీయస్ ప్రసాద్**



చైతన్య :- మీ పక్కింటి ఉషని ప్రేమిస్తున్నావటగా ఎందాకా వచ్చిందేంటి మీ ప్రేమ?

ప్రశాంత్ :- ఇపుడు నీ దాకా వచ్చిందిగా... ఇక వూరందరికీ తెలియడమే తరువాయి.



సినిమాహాలు రద్దీగా ఉంది. సీటు వెతుక్కోవడంలో ఓ ముసలావిడ మీద పడ్డాడు రవి.

ముసలావిడ : బుద్ధుందా లేదా ? కాస్త మనిషిని చూసి పడు.

రవి : చూసి పడేటట్లయితే మీ మీదెందుకు పడతాను!?



ప్రశాంత్ : నామాట నమ్ము ఉషా, నన్ను పెళ్ళి చేస్కుంటే నువ్వు నేల మీద నడవకుండా చూస్కుంటాను.

ఉషా : నాకు తెలుసు ప్రశాంత్ ఆ మాటకర్థం నీకున్నది రిక్షా ఒక్కటేనని.

భర్త : (కోపంగా ఇంటికొచ్చి ) నా పరువు గంగలో కలిపాడే నీ సుపుత్రుడు.

భార్య : (ఓ డజను అరటిపళ్ళు పక్కనే పెట్టుకొని సోఫాలో కులాసాగా కాళ్ళు జాపుకుని విలాసంగా టీవి చూస్తున్న పుత్రరత్నం తో) ఏరా అబ్బాయ్ మాటమాత్రమైనా చెప్పకుండా కాశీ ఎప్పుడెళ్ళావురా చెబితే నేను కూడా వచ్చేదాన్ని కదరా.



ఫ్లయింగ్ స్క్వాడ్ వాళ్ళు వచ్చి బస్సు చెక్ చేస్తున్నారు

"టికెట్ లేని వారు ఎవరైనా ఉన్నారా బాబూ?" అడిగారు

"ఉన్నారండీ" అన్నారు ప్రయాణీకులంతా ముక్తకంఠంతో.

"ఎవరు వారు?"

"డ్రైవరు, కండక్టరు" అన్నారు ప్రయాణీకులు తాపీగా.





తొమ్మిదివందల రూపాయలు అప్పుగా తీసుకుని రెండు సంవత్సరాల తర్వాత కలిసిన సుబ్బారావును బాకీ తీర్చమని అడిగాడు అప్పారావు

"మార్చి తరువాత ఇస్తాను " అన్నాడు సుబ్బారావు

"నా దగ్గర వెయ్యిరూపాయల నోటుకి కూడా చిల్లర ఇమ్మీడియట్‌గా దొరుకుతుంది" అన్నాడు అప్పారావు ఆశగా

"చిల్లరేంటీ? మార్చి తరువాత ఇస్తానని అంటే మార్చినెల తరువాత ఇస్తానని అర్థం" అన్నాడు సుబ్బారావు. ఇది ఏప్రిల్ నెల అని గ్రహించినవాడై.

**ఈ జోకులను పంపించిన వారు: గొల్లపూడి శ్రీనివాస్, మారుతీనగర్,హైదరాబాద్**



"మీ అమ్మాయికి మాంఛి సంబంధమొకటి రెడీగా వుందండీ. అబ్బాయికి గవర్నమెంటులో ఉద్యోగం. గుణవంతుడు, పైగా నిప్పలాంటి మనిషి" అంటూ ఏకరువు పెడుతున్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"వద్దులెండి. మనదసలే పెట్రోలు బిజినెస్" అన్నాడు అమ్మాయి తండ్రి భయపడుతూ.



"ఆరోగ్యం బాగా లేదన్నప్పుడల్లా నువ్వెందుకు ఆ చిన్నపిల్లల డాక్టరు దగ్గరకెళుతున్నావ్?" ప్రశ్నించింది వర్ధమాన తార మరో గడుసు తారని.

"నా వయసు గురించి ఎవరికీ అనుమానం రాకూడదని" అంటూ చెప్పింది గడుసుతార.



"మా అమ్మాయి అసలు ఈ కాలంలో పుట్ట వలసిన పిల్ల కాదంటే నమ్మండి. అన్నీ పాతకాలం పద్ధతులే"

"దానికేం, ఎవరైనా పురావస్తు పరిశోధనకు సంబంధించిన డిపార్టుమెంట్లో వాడిని చేసుకుంటే సరి".

**ఈ జోకులను పంపినవారు: టి. ప్రియాంక, హనుమేష్ నగర్, గుంతకల్లు.**



"ఇక మన ప్రేమకు ఫుల్‌స్టాప్ పెట్టి, పెళ్ళి చేసుకుంటే బావుంటుంది డియర్ ! ఏమంటావ్ " అన్నాడు ప్రేమికుడు.
"నిజమే ! మా ఇంట్లో వాళ్ళ ప్రయత్నాలు ఫలించి మంచి వరుడు దొరికే వరకూ కొంత ఓర్పు వహించటం బెటర్ అని నా అభిప్రాయం" అన్నది ప్రేమికురాలు.



ఇద్దరు ప్రేమికులు పార్కులో మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఓ వ్యక్తి చెట్టు చాటునుంచి పదే పదే తమకేసి తొంగి చూడటం గమనించిన ప్రేమికుడు లేచి వెళ్ళి "తండ్రిలాంటి వారు మీకిదేం బుద్ధి" అన్నాడు ఒకింత కోపంగా.
"తండ్రి లాంటి వాడిని కాదు బాబూ....తండ్రినే...ఆ పిల్లకి" అన్నాడా వ్యక్తి దీనంగా.

ఓ పల్లెటూరి ఆసామి పనిమీద పట్నంవచ్చి, మధ్యాహ్నం వేళ భోజనానికని ఓ హోటల్లో అడుగు పెట్టాడు. ఎంతసేపైనా ఒక్క సర్వర్ కూడా రాలేదు.
"ఎవ్వరూ కనిపించడం లేదేమిటి" కౌంటర్ దగ్గరికెళ్ళి విసుగ్గా అడిగాడు అసలే ఆకలి మీదున్న ఆ ఆసామి.
"లంచ్ అవర్ కదా! ప్రక్క సందులోని మెస్‌లో భోజనానికి వెళ్ళారు లెండి" అంటూ తాపీగా చెప్పాడా కౌంటర్లోని వ్యక్తి.



ఈ జోకులను పంపినవారు:
'మా' ఫిన్‌లె,
న్యూ బోయిన్‌పల్లి,
సికింద్రాబాద్

ఆఫీస్ నుంచి వచ్చిన భర్తకి వేడి వేడి ఉప్మా, కాఫీ అందించింది భార్య.
"ఏమిటీ ఈ పూట విశేషం?" అడిగాడు ఆనందంగా.
"అది కాదండీ ఈ రోజు..."
"నీ పుట్టిన రోజా?"
"కాదండీ"
"పోనీ మనం మొదటిసారి ఒకరినొకరు చూసుకున్న రోజా?"
"అబ్బ.... అదీ కాదండీ...."
"ఏంటే ఇందాకట్నుంచీ తెగ ఊరించి చంపుతున్నావ్ అసలేంటే ఈ రోజు స్పెషల్ ?" అని గద్దించాడు భర్త విసుగ్గా.
"ఈ మాత్రం తెలుసుకోలేరూ.. మీకు జీతాలిచ్చే రోజు" అంటూ గుర్తు చేసిందా ఇల్లాలు గోముగా.



"మన పెళ్ళి జరుగుతుందంటావా" సందేహంగా అడిగాడు త్రినాథ్.
"ఏమో? ఇంద్రుడికే తెలియాలి" అంది పంకజం
"అదేమిటి.. ఏ దేవుడి పేరో చెప్పకుండా ఈ ఇంద్రుడెందుకొచ్చాడు మధ్యలో" అంటూ తెగ ఆశ్చర్యపోయాడు త్రినాథ్.
"మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అని అన్నారుగా.... మరి స్వర్గంలో జరిగే వాటి గురించి అతనికేగా తెలిసేది!" అంది పంకజం కులాసాగా.






"ఒరే బంటీ... మీ అమ్మ ఏం చేస్తోంది"
"ఉతికి ఆరేస్తోంది"
"మీ నాన్ననా ? బట్టలనా?"

ఈ జోకులను పంపినవారు: సోనికా ఫిన్‌లె, మనోవికాస్ నగర్, సికింద్రాబాద్.

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన శ్రీ గొల్లపూడి శ్రీనివాస్, హైదరాబాద్, టి. ప్రియాంక ,గుంతకల్లు, 'మా'ఫినెలె, సికింద్రాబాద్, సోనికాఫినెలె, సికింద్రాబాద్., గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'జై' సినిమా పాటల ఆడియో సి.డి.నిబహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC






శ్రోతల వినగల సామర్థ్యాన్ని పరీక్షించే స్థాయిలో రికార్డవుతున్న పాటలు గల ఆడియోలు విరివిగా విడుదలవుతున్న తరుణంలో - ప్రతిపాటా చెవికి హాయిగా వినిపించేలా వచ్చిన ఆడియోగా 'నేనున్నాను' ఆడియోని పేర్కొనాలి. (ఆడియో లెవెల్ కర్ణభేరి పగిలిపోయేలా ఉండకపోవటమే హాయిగా వినబడటం అనే మాటకు ఇవాళ్టి అర్థంగా చెప్పుకోవాలి)

రాసినవారికి, స్వరపరిచిన వారికి, పాడిన వారికి చిరకీర్తిని కట్టబెట్టడమే కాకుండా తర్వాతి తరాల వారి కోసం నిలిచిపోయే నిధి వంటి పాటలు ఎప్పుడో గాని పుట్టవు. ప్రస్తుత పరిస్థితులలో అయితే అది దుర్లభమే అని అనిపిస్తున్న సమయంలో 'నేనున్నాను' అంటూ ముందుకొచ్చిన పాటగా - 'ఏశ్వాసలో చేరితే గాలి గాంధర్వమవుతున్నదో' పాటను పేర్కొనాలి. స్వతంత్ర సంచారంలో అక్కడక్కడ రాగాతిక్రమణ లేదా అన్యస్వర ప్రయోగం జరిగినా. పూర్తిగా మోహనరాగంపై ఆధారపడిన, లేదా మోహన రాగానికి సదుపమానంగా నిలిచిన పాట యిది. ఇదివరకు ఒక రాజేశ్వరరావు, ఒక ఘంటసాల నుండి మాత్రమే ఇటువంటి పాటలు వచ్చేవి. ఆ - పాత ఆపాత మాధుర్యాన్ని పుణికి పుచ్చుకొంటూ ఈ పాటను స్వరపరిచిన కీరవాణికి అభిరుచి గల ప్రతి శ్రోత ఋణపడి వుండవలసిందే! మోహనరాగంలోని జీవస్వరాలను అంత గొప్పగా పిండుకుని పాటంతా పరిచాడాయన. జాగ్రత్తగా పాటను పరిశీలిస్తే మొదటి చరణం పూర్తయిన తర్వాత - రెండో చరణం ఇంటర్‌లూడ్‌కి ముందు - వచ్చే పల్లవిలో 'ఏ మంత్ర మౌతున్నదో' అని వాక్యం చివర్న 'దో ఓ ఓ ఓ' అంటూ చిత్ర చేత పాడించి అటు రాజేశ్వరరావును ఇటు ఘంటసాలని ఏకకాలంలో ఆయన స్ఫురింప చేస్తుంటే రసస్పర్శతో గుండె చెమ్మగిల్లి పోతుంది. మిగిలినపాటలో 'కీరవాణి మార్కు మోహన'ని బాగా పట్టుకోవచ్చు. పాట ఎత్తుగడలోని "ఏ మోవిపై వాలితే మౌనమే మంత్రమౌతున్నదో" అనే వాక్యం వినగానే 'చందురుణ్ణి దారం కట్టి దించుకుందాం ఎంచక్కా దీపమల్లె పెట్టడానికి' (లాహిరి లాహిరి లాహిరిలో టైటిల్ సాంగ్) అనే ట్యూన్‌లోకి మనసు తనంతట తానే దారి తీస్తుంది. అదే 'కీరవాణి మార్కు మోహన'! మోహనరాగంలోని మాధుర్యాన్ని బొట్టు బొట్టుగా పిండి అందించడంలో కీరవాణి ఎంత తృప్తిని పొందుతాడో 'అలజడితో అణువణువూ తడబడదా' దగ్గర్నుంచి 'నువ్వే నడుపు పాదమిది' వరకు ఒక వైపు చిత్ర ఆలాపన, మరో వైపు వీణ బిట్స్... ఈ రెంటినీ సమాంతరంగా నడిపించటాన్ని గమనిస్తే మననుకి ఆ అనుభూతి అందిపోతూ ఉంటుంది. పాట చివర్లో వచ్చే స్వరాలు పాటను పతాకస్థాయికి తీసుకుపోవడమే కాకుండా పతకంలా నిల్చిపోయాయి కూడా. ఇక రచనా పరంగా




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ॥ 38/-

పాటగురించి ప్రస్తావించదలచుకుంటే.. ప్రతి పాటకీ ప్రాణం పెట్టి రాసే విద్య సీతారామశాస్త్రి గారికి ఎలా అబ్బిందో తల్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఏదో ఒక పాటకీ, పది పాటలకి లేదా ఓ వంద పాటలకి అయితే అనుకోవచ్చు... ప్రతిపాటకీనా!? పద సంపద అమితంగా ఉన్నా పదాల్ని మితంగా హితంగా వాడే ఇటువంటి భావుకుడు సినీ రచయితగా ఉండడం ప్రేక్షక శ్రోతల పూర్వజన్మ సుకృతం. 'ఏ శ్వాసలో చేరితే గాలి గాంధర్వమౌతున్నదో -ఏ మోవిపై వాలితే మౌనమే మంత్రమౌతున్నదో-మునులకు తెలియని జపములు జరిపినదా మురళీసఖీ వెనుకటి బ్రతుకున చేసిన పుణ్యమిదా' వంటి వాక్యాల్లో ఎంత గొప్ప ఎక్స్‌ప్రెషన్ ఉంది !? మల్లాది రామకృష్ణశాస్త్రి , దేవులపల్లి కృష్ణశాస్త్రి కలిసి సీతారామశాస్త్రి అయిపోయారా? రాత్రిళ్ళు బలం వుండేది రాక్షసులకే అని అంటారు. రాత్రిళ్ళు మాత్రమే రాసే సీతారామశాస్త్రి గారి నుంచి ఇంతటి అమృత తుల్యమైన పదాలు, భావాలు ఎలా పుట్టుకొస్తున్నాయి !? ఈ కారణజన్ముడి కోసం నడిరాత్రి నుండి తెల్లవారు ఝామువరకు ప్రతిక్షణం ఒక బ్రహ్మీ ముహూర్తం అయిపోతోందా!? లేకుంటే వేణువు గురించి పుంభావ సరస్వతి వేటూరి - పిల్లనగ్రోలికి నిలువెల్ల గాయాలు అల్లన మోవికి తాకితే గేయాలు - వంటి వాక్యాలతో వేసిన శాశ్వత ముద్రలతో సమానంగా నిలిచే - తనువును నిలువున తొలిచిన గాయములే తన జన్మకీ తరగని వరముల సిరులని తలచినదా - వంటి వాక్యాలు ప్రాణ శక్తితో ఎలా ఊపిరి పోసుకుంటాయి!? ఇక గాయనిగా ఈ పాటకు చిత్ర కాంట్రిబ్యూషన్ గురించి చెప్పాలంటే ఒక సుశీల, ఒక జానకి, ఒక వాణీజయరామ్ మాత్రమే పాడి ఒప్పించగల స్థాయి గలిగిన ఈ పాటకు చిత్ర నిజంగా ఒక వరం. అసలు ఆ తరానికి వారసురాలిగా, ఈ తరానికి ప్రధాన ప్రతినిధిగా మిగిలిన చిత్ర అనే గాయనిని ఈపాటకు ఎంపిక చేయకపోయివుంటే ఈ పాట చిత్రహింసల పాలయివుండేది. ఇవాళ వినిపిస్తున్న ఏ గాయని గళంతోనూ ఈ పాటను ఊహించలేం. అవార్డులే ప్రతిభకు కొలమానం అనుకుంటే సంగీత విభాగానికి సంబంధించిన ఉత్తమ రచన, ఉత్తమ గానం, ఉత్తమ సంగీత దర్శకత్వం వంటి మూడు అవార్డులూ ఈ పాటకు రావలసిందే!!

ఔత్సాహిక గాయనీ గాయకులకు వరం లాంటి ఈపాటను ఈ సంచిక 39 పేజీలో స్వరాలతో సహా అందించే అవకాశం కలిగినందుకు 'హాసం' మురిసిపోతోందని సంపాదకుడిగా ఈ సమీక్షకుని సవినయ భావన.

చంద్రబోస్ రాయగా శ్రేయాఘోషల్, అర్నబ్ చక్రవర్తి పాడిన 'నూజివీడు కెళ్ళినా న్యూజిలాండు కెళ్ళినా' పాట మాంచి ఊపున్న పాట. 'ఆదిశంకరుల సౌందర్యలహరి' అంటూ 'సీతయ్య' సినిమాలో చంద్రబోస్ రాయగా కీరవాణి స్వరపరిచిన పాటొకటుంది. ఆ పాటలో 'పట్టాల్సిన పిచ్చే ప్రేమరా - తిరగాల్సిన మలుపే ప్రేమరా' అంటూ మంచి ఊపు, ఎక్స్‌ప్రెషన్‌తో కూడిన కొన్ని లైన్లు ఉన్నాయి. అంతమంచి పాట జనంకి సరిగ్గా అందలేదన్న బాధ కొంతమంది అభిమానులకు ఉండిపోయింది. ఈ 'నూజివీడుకెళ్ళినా' పాటలో 'ప్రేమల్లో పిచ్చ మారునా - కుర్ర వయస్సుల్లో కచ్చ తీరునా' వంటి వాక్యాలు ట్యూన్‌పరంగా విన్నాక ఆ బాధ కొంత తీరినట్టు అనిపిస్తుంది. ప్యారుకాక, లవ్వు కాక, కాదలే చేసినా - సెల్లు మారు ఇల్లు మారు పిల్లదాని ఒళ్ళుమారు గజ్జెల్లో ఘల్లు మారునా లాంటి చమత్కారాలను రంగరించిన చంద్రబోస్ 'వస్త్రం మారినా వరస మారునా' అనే మాటలను ఏ అర్థంతో ప్రయోగించాడో తెలిపితే బావుంటుంది.

'చీకటితో వెలుగే చెప్పెను నేనున్నాననీ... నేనున్నాననీ నీకేం కాదనీ' పాటని అటు చంద్రబోస్ - కీరవాణి కాంబినేషన్‌లో గాని ఇటు కీరవాణి - సునీత కాంబినేషన్‌లో వచ్చిన పాటల్లో మరో మంచి పాటగా చేర్చదగ్గ పాటగా

చెప్పుకోవాలి. ముఖ్యంగా మొదటి చరణంలో రచయితగా చంద్రబోస్‌ని ఎత్తున నిలబెట్టే వాక్యాలు జతపడ్డాయి. ఈ పాటను బీ సైడు కూడా రిపీట్ చెయ్యడం జరిగింది.

సీతారామశాస్త్రి రాయగా శ్రియాఘోషల్, కె.కె. పాడిన 'వేసంకాలం వెన్నెల్లాగ.... నీ కోసం నీకోసం నీకో...సం' పాట మెలొడీని, హుషారుని సమపాళ్ళలో కలుపుకున్న మంచి పాట. 'ఓరోరి అందగాడా - నన్నేలు మన్మథుడా' అనే వాక్యాల దగ్గర శ్రియాఘోషల్ ఎంతో చక్కగా పాడింది. ఏ ఔత్సాహిక గాయని అయినా తన స్వర సామర్థ్యాన్ని తనకు తానుగా పరీక్షించుకో దలుచుకుంటే ఈ వాక్యాలని యథాతథంగా అనగలిస్తే - తన గళం నుంచి వెలువడిన స్వరాలు సరియైన స్వర స్థానాల్లో శృతి పక్వంగా వినిపించినట్టు తనకు అనిపిస్తే చాలు. పాట చివర్లో ఈ వాక్యాలు వినిపిస్తున్నప్పుడు, రెండో చరణం ముందర వచ్చే ఇంటర్‌లూడ్‌లోనూ వినిపించే వయొలిన్ బిట్స్ (వాయించింది కళ్యాణ సుందరం కావచ్చు) ప్రత్యేకంగా గమనిస్తూ వింటే మంచి పనితనం కనిపిస్తుంది. ట్యూన్ తగ్గ పదాల్ని పసందుగా అందించిన సీతారామశాస్త్రి గారి రచనలో 'తాళిబొట్టుగా కాలిమట్టెగా చేరుకోవ ప్రేమతీరమా' అనే వాక్యాలు చాలా బావున్నాయి.

అలనాటి 'దసరాబుల్లోడు' చిత్రంలోని 'ఎట్టాగో ఉన్నాది ఓలమ్మి ఏటేటో అవుతోంది చిన్నమ్మి' పాటలోని సంగీత సాహిత్యాలను, పాడే పద్ధతిని బేస్‌గా తీసుకొని 'ఈ ప్రయోగం బావుంది' అని విన్నవారందరిచేతా అనిపించుకునేలా చేసిన 'ఫ్రీమిక్స్' పాట చరిత్రలో నిలిచిపోతుంది. ఎన్నో మంచి మార్పులు ఈ పాటలో చోటుచేసుకున్నాయి. కనుక ఈ పాట రీమిక్స్ కోవలోకి రాదు. ఫ్రీమిక్స్ అనుకోవడమే బెటరు. ముఖ్యంగా ఒరిజినల్ పాటలో 'జడచూస్తి మెడ చూసి జబ్బల నునుపు చూస్తి కానరాని ఒంపులన్ని ఓలమ్మి కసికసిగా చూస్తినే చిన్నమ్మి' అంటూ రాసిన ఆత్రేయ సాహిత్యం కొంత ఇబ్బందిగానే ఉంటుంది. ఆ ఇబ్బంది నుంచి బైటపడి హాయిగా పదిమందిలో పాడుకునేలా 'జడవూపి నడుం వూపి నిగనిగల నిధుల చూపి నువ్వు వీరంగం వేస్తుంటే ఓలమ్మి ఊరంత ఊగిందె చిన్నమ్మి' అంటూ రాసిన సీతారామశాస్త్రి గారిని ప్రత్యేకంగా అభినందించి తీరాలి. ఇవేకాక ఈ పాటలో మరికొన్ని విశేషాలున్నాయి. ఒరిజినల్ పాటను అభినయించింది అక్కినేని, ఈ పాటను అభినయించింది ఆయన కుమారుడు నాగార్జున. ఒరిజినల్ పాటను స్వరపరిచింది మహదేవన్ ఈ పాటను స్వరపరచింది - మహదేవన్‌ని అమితంగా అభిమానించే కీరవాణి. ఒరిజినల్ పాటను రాసింది ఆత్రేయ, ఈ పాటను రాసింది ఆత్రేయ పేరిట వెలసిన అన్ని అవార్డులను అందుకున్న సీతారామశాస్త్రి. ఇవన్నీ ఈ పాటకు జతపడ్డ అండర్ కరెంట్ ఎస్పెట్స్. ఇక సుశీలకు ఏ మాత్రం తీసిపోని విధంగా పాడిన చిత్రని - 'ఘంటసాలే బాగా పాడాడు' అనిపించుకునే పరిస్థితి రానీయకుండా పాడిన టిప్పుని కూడా మరీ మరీ అభినందించి తీరాలి.

'బంతి కావాలా బాలు కావాలా' (రెండూ ఒకటే) అంటూ మొదలయ్యే పాటలో చంద్రబోస్ చమత్కారాలకి సునీత, టిప్పు హుషారుగా పాడిన పద్ధతి సమపాళ్ళలో పడింది, పండింది కూడా. 'చిల్లరకొట్టు చిట్టెమ్మ'లోని 'ఏంచెప్పేది నేనేం చేసేది' అనే పాటలో సంగీత దర్శకుడు రమేష్ నాయుడు వినిపించిన 'ఏంటబ్బాయా ఇదేంటబ్బాయా నా దుంప తెంచావు నా కొంప ముంచావు' అనే ట్యూన్ 'ఈ బంతి కావాలా బాలు కావాలా' పాట బిగినింగ్‌లో గుర్తొస్తుంది.

ఇదివరకు కొన్ని పాటల్లో చంద్రబోస్ ప్రయోగాలు స్కిమింగ్‌లాగ అనిపించేవి. కీరవాణితో అతనికి 'సాంగత్య వైభవం' పెరిగాక ఆ స్కిమింగ్‌లు చమత్కారాల్లాగ మారాయని పిస్తోంది. 'ఇంతదూరమొచ్చాక అడ్డెందుకు ఈడు రగులుకున్న కసిసిగ్గెందుకు' పాట వింటుంటే చంద్రబోస్‌తో కాస్త సన్నిహితంగా పెరిగే వారెవరికైనా కలిగే అభిప్రాయం ఇదే! 'గుడుగుడు గుడుగుడుగుడు గుంచం'కి పేర్లల్‌గా 'అడుగుడు అడుగుడు గుడు లంచం/జరుగుడు జరుగుడు గుడు కొంచెం/ విరుగుడు విరుగుడు గుడు మంచం/ పెరుగుడు పెరుగుడు గుడు పైత్యం/ తిరికిట తిరికిట కిట తథ్యమ్' లాంటి వాక్యాలే అందుకు ఉదాహరణ. శ్రియాఘోషల్, టిప్పు కూడా చాలా హుషారుగా పాడారీపాటని.

# హైదరాబాదులో ప్రారంభమైన

**తారణ సంవత్సరం తొలిరోజే మూడు 'హాసం క్లబ్స్' ప్రారంభం కాగా, వారం తిరక్కుండా జంటనగరవాసులను అలరించడానికి హైదరాబాదులో 'హాసం క్లబ్' ఆవిర్భవించింది. ఆ వివరాలు...**

**21 .03. 2004** ఉగాదినాడు రాజమండ్రి, ఏలూరు, విశాఖపట్టణం లలో ప్రారంభమయిన 'హాసం క్లబ్' ఉద్యమం హైదరాబాదుకు కూడా విస్తరించింది. 27 03 2004 శనివారం సాయంత్రం గం॥ 6.35 ని॥లకు హైదరాబాదు రాజీవ్‌నగర్‌లోని 'హాసం' ఆవరణలో 'హాసం క్లబ్' రూపుదిద్దుకుంది.

రెండుగంటలపాటు సాగిన హాస్య-సంగీత కార్యక్రమం తక్కిన పట్టణాలలో జరిగిన కార్యక్రమాలకు ఏ మాత్రం తీసిపోకుండా ప్రేక్షకులను ఆకట్టుకుంది. వైవిధ్యభరితమైన ఈ కార్యక్రమంలో జోక్స్, పేరడీలు, పలుభాషాగీతాలు, మిమిక్రీ, ఏకపాత్రాభినయం ఇత్యాదులతో పాటు ఆ యా పాటలపై, పాడిన తీరుపై 'హాసం' ఎడిటర్ రాజా చేసిన విశ్లేషణ ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది.

'హాసం క్లబ్స్' స్టేట్ కన్వీనరు 'సినీ విజ్ఞాన విశారద' ఎస్.వి.రామారావు 'హాసం క్లబ్' ఆశయాల గురించి వివరించిన అనతంతరం చింతామణి' నాటకంలో సుబ్బిశెట్టి పాత్రద్వారా స్టార్ స్టేటస్ సంతరించుకున్న రోశిరెడ్డి ఏకపాత్రాభినయంతో కార్యక్రమం మొదలయింది. 'బాలనాగమ్మ'లో చాకలి తిప్పడు వేషం వేస్తూండే తను దుస్తులు అద్దెకిచ్చేవాడు తనకు సుబ్బిశెట్టి పాత్ర బాగా నప్పుతుందనడంతో ఆ పాత్రవేసి ప్రజాదరణ పొందానని తన అనుభవాలు చెప్పి సుబ్బిశెట్టి సంభాషణలు చెప్పి నవ్వించారు. ఎయిడ్స్ వ్యాధిపై ప్రజల్లో అవగాహన పెంపొందించడానికి ఈ పాత్రద్వారా కృషిచేస్తున్నానని, తద్వారా హాస్యంతో సాంఘికప్రయోజనం సాధిస్తున్నానని రోశిరెడ్డి అన్నారు.

మిమిక్రీ ఆర్టిస్టులలో ఆడవాళ్లు బహుతక్కువ. చిన్నవయసులోనే మిమిక్రీకళపై అభిమానం పెంచుకుని పేరు తెచ్చుకుంటున్న బేబీ మోనికా చౌదరి ప్రముఖ రాజకీయనాయకులను అనుకరించి మన్ననలు పొందింది. మిమిక్రీ పితామహుడు వేణుమాధవ్ వ్రాసిన ఆత్మకథను బహూకరించి 'హాసం' బేబీ మోనికాను ఆశీర్వదించింది. మరొక మిమిక్రీ కళాకారుడు దుర్గాప్రసాద్ వివిధగాయకులు ఏ విధంగా పాడతారో పాడి చూపడంతో బాటు అరిగిపోయిన రికార్డులను అనుకరించి చూపారు.

ధర్మాచార్యులు పేరడీ పంచాంగపఠనం చేయగా, సంగారెడ్డిలో 'హాసం క్లబ్' ప్రారంభించబోతున్న ఆర్.వి.రమణశాస్త్రితోబాటు పలువురు జోక్స్ వినిపించారు. మంగళంపల్లి బాలమురళీకృష్ణతో మురళీ మాధురి అనే టీవి సీరియల్ నిర్మిస్తున్న నిర్మాత మేడూరి కామదాసు సీతాకళ్యాణం హరికథ (వాగ్దానం) వినిపించగా అనేకమంది తెలుగు, హిందీ పాటలు పాడి రంజింపజేశారు. సురేష్ విజిల్‌సాంగ్, మాధురి టైటానిక్ ఇంగ్లీషుపాట పలువురిని ఆకర్షించాయి.

'జంగ్లీ'లోని 'యెహసాన్ హోగా' పాటను సరస్వతి పాడి వినిపించగా ఆ పాటను రఫీ, లతాలు పాడిన విధానంలో తేడాలను రాజావివరించారు. అలాగే 'గోదారి గట్టుంది' పాట ముక్తపదగ్రస్తానికి చక్కటి ఉదాహరణ అని ఎస్.వి.రామారావు వ్యాఖ్యానించారు.

ఇదే విధంగా పాటలతో, జోక్స్‌తో, వ్యాఖ్యలతో ప్రతి ఆఖరి శనివారం 'హాసం క్లబ్' కార్యక్రమాలు సాగుతాయని, తదుపరి కార్యక్రమం ఏప్రిల్ 24 సాయంత్రం గం॥ **6.35లకు 'హాసం' ఆఫీసు ఆవరణలోనే** జరుగుతుందని ఎస్.వి.రామారావు తెలిపారు.

ప్రత్యేకత కలిగిన కొన్ని పాటలను విని, సేకరించి, అభ్యసించటం ద్వారా ఔత్సాహిక, వర్ధమాన గాయనీ గాయకుల వాచకం, స్వరజ్ఞానం పెంపొందే అవకాశం మెండుగా ఉంటుందని రాజా వివరిస్తూ ఇటీవల సంగీత దర్శకుడు కీరవాణి గారిదగ్గరున్న లాప్‌టాప్‌లో 'ముత్తైతరు' అనే ఓ తమిళ భక్తి గీతాన్ని విన్నానని, పాటంతా ఎక్కువగా 'త్త' అనే అక్షరంపై ఉంటుందని, ఆ గీతాన్ని 24.4.2004న జరుగనున్న 'హాసంక్లబ్' సమావేశంలో వినిపిస్తానని అన్నారు.

**తమ ఊళ్లలో 'హాసం క్లబ్స్' ప్రారంభించ దలచిన హాస్యసంగీత ప్రియులు సంప్రదించవలసినది**
**శ్రీ ఎస్.వి.రామారావు, హైదరాబాద్.**
**ఫోన్ - 040- 24160279**

# 'హాసం క్లబ్' విశేషాలు

విశాఖపట్నంలో
'హాసం క్లబ్'
అవతరణ సందర్భంగా
ప్రఖ్యాత రచయిత
అవసరాల రామకృష్ణారావు
వ్రాసిన గేయం

ఒరోరీ సోదరా
నోరోరా నవ్వరా
ఆరారా ఊరూరా
హాసం అందించరా

లోకంలో చీకాకులు
నీకే ఉన్నాయటరా?
జోకులనే జోతులతో
చీకటి తరిమేయరా!

నవ్వడమను లక్షణమే
మనిషికి మహాభాగ్యంరా!
నలుగురికిది పంచడమే
బతుకున పరమార్థం రా!

శుభ ఉగాది సభలో ఇది
మధురమైన సూచనరా!
ఈ మాదిరి నెలకొకపరి
నవ్వు పంచుకుందాం రా!

**27.3.2004 తేదీన జరిగిన 'హాసం క్లబ్' సమావేశంలో బేబీ మోనికా చౌదరి 'ఉప్పుకప్పురంబు' పద్యాన్ని మిమిక్రి చేసిన విధానం యిది:**



బేబీ మోనికా చౌదరి

**చంద్రబాబు నాయుడు :**

ఉప్పు కప్పురంబు... ఒక్క పోలికనుండు...
చూడ చూడ రుచులు... జాడవేరు...!
బాబులందు... చంద్రబాబునే నేనయా
విశ్వదాభిరామ... యన్.టి.ఆరే నా మామ!!

**వై.యస్.రాజశేఖరరెడ్డి :**

అయ్యా..
ఉప్పు కప్పురంబూ... ఒక్క పోలికనుండూ
చూడ చూడ రుచులూ... జాడవేరూ...!
అయ్యా...
పురుషులందూ... చంద్రబాబు లేడయా...
విశ్వదాభిరామా... చంద్రబాబుదే పెద్ద డ్రామా!!

**సూపర్‌స్టార్ కృష్ణ :**

ఉప్పు కప్పురంబు ఒక్క పోలికనుండు,
చూడ చూడ రుచులు జాడవేరు!
స్టారులందు సూపర్‌స్టారుని నేనయా,
విశ్వదాభిరామ విజయనిర్మలే నా భామ!!

**ఆ తరువాత ఆ అమ్మాయి మిమిక్రి చేస్తూ చెప్పిన జోకుల్లో ప్రేక్షకులు బాగా నవ్విన జోక్ ఇది.**

టీచరు : ఇవాళ మనం కప్పల గురించి తెలుసుకుందాం. కప్పలకు నాలుగు కాళ్ళుంటాయి, రెండు కళ్ళుంటాయి.

ఓ విద్యార్థి : లోపల్కు రావాల్నా సార్?

టీచర్ : ఎందుకు లేటయిందిరా?

విద్యార్థి : నా జేబులో రూపాయి పడిపోయింది సార్ దాన్ని వెదకటంలో లేటయింది.

టీచర్ : సరే పోయి కూర్చో... ఇప్పుడు కప్పల గురించి చెప్పుకుంటున్నాం కదూ.

ఇంకో విద్యార్థి : లోపల్కు రావాల్నా సార్?

టీచర్ : ఏంట్రా ఎందుకు లేటయిందిరా?

ఇంకో విద్యార్థి : ఇందాకొచ్చినోడేం చెప్పాడ్సార్?

టీచర్ : వాడేం చెప్తే నీకెందుకురా... రూపాయి ఎక్కడో పడిపోయిందని చెప్పాడు... నువ్వేం చెప్తావో చెప్పు.

ఇంకో విద్యార్థి : మరి ఆ రూపాయి మీద కాలు పెట్టింది నేనే కద్సార్ వాడెళ్ళే వరకు ఉంటే లేటవదా సార్!?

## పత్రికల స్పందన

### హాస్యగుళికలను అందించిన 'హాసం క్లబ్'

హాసం క్లబ్ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో పలువురు కళాకారులు ప్రదర్శించిన వివిధ హాస్య, సంగీత అంశాలు సభికులను ఎంతగానో నవ్వించాయి, అలరించాయి. ఈ కార్యక్రమంలో 'హాసం' సంపాదకవర్గం, ఇతరులు హాస్యానికి, సంగీతానికి సంబంధించి పలు అంశాలను ప్రదర్శించారు. వైవిధ్యభరితమైన ఈ కార్యక్రమంలో అనేకమంది కళాకారులు సభికులందరినీ నవ్వులలో ముంచెత్తారు....

**(29.3.2004 ఆంధ్రజ్యోతి, హైదరాబాదు)**

***Film : Titanic*** ***Music : James Horner***
***Singer : Celinedion*** ***Lyrics : Will Jennigs***

Every night in my dreams
I see you, I feel you
That is how I know you, go on..
Far across the distance
and spaces between us
You have come to show you, go on..
Near, Far, where ever you are
I believe that the heart does go on...
Once more you open the door
And your'e here in my heart
And my heart will go on and on..
Love can touch us one time
And last for a life time
And never tel's go till were gone.
Love was when I loved you,
One true time I hold to...
In my life well always go on...
Near, far, where ever you are
I believe that the heart does go on..
Once more you open the door
And your'e in my heart
And my heart will go on and on..
Your'e here, there's nothing I fear,
And I know that my will go on...
We'll stay forever this way
You are safe in my heart
And my heart will go on and on....



పి.సి.మాధురి

**పాశ్చాత్యగాయనే పాడుతోందా అని 27.03.2004న హైదరాబాద్‌లో 'హాసం క్లబ్'కు హాజరైన ప్రతి వారికీ అనిపించే స్థాయిలో పి.సి.మాధురి పాడిన 'టైటానిక్' పాట సాహిత్యం అభిమానుల కోసం పక్కనే ప్రత్యేకంగా....**

# పెళ్ళిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**5**

> **జరిగిన కథ**
> మధ్యతరగతి కుటుంబాలలో ఉండే అన్ని బాధలు కొత్తగా పెళ్లయిన కృష్ణమూర్తి, భామలకు కూడా ఉన్నాయి. అందుకే కృష్ణమూర్తి బొంబాయిలో ఉద్యోగం చేస్తుంటే, భామ కేరళలో ఉద్యోగం చేస్తుంటుంది. ఒక కుటుంబానికి ఒకే ఉద్యోగం అంటూ ప్రకటించిన శ్రీధరరావు కంపెనీలో ఇద్దరూ ఒకరితో ఒకరికి పరిచయం లేనట్టుగా వెళ్లి ఉద్యోగాలు సంపాదించుకుంటారు. శ్రీధరరావు కూతురు వసుంధర, కృష్ణమూర్తిని అభిమానిస్తుంటుంది. -(ఇక చదవండి)

భామ పులకాంకితయింది. ముత్యాల పలువరసను మెరిపించింది. రవిశంకర్ చేతిలోని సితార అయింది. హరిప్రసాద్ చౌరాసియా పెదవుల మీద వేణువయింది. బాలమురళి గళంలోని స్వరరాజ్ఞిగా మారిపోయింది. తాను స్వయంగా డిజైన్ చేసిన చీరలో భామ పాలరాతి శిల్పంలా గోచరించింది కృష్ణమూర్తికి. ఆ మధుర భావన రాగంగా సంతరించుకుంది. భావ కవిత పలికింది.

సరికొత్త చీర ఊహించినాను
సరదాల సరిగంచు నేయించినాను
మనసు -మమత -పడుగూ- పేక
చీరలో చిత్రించినాను.

లేత తమలపాకుల్లా నవనవలాడుతున్న భామ పాదాల వద్ద వాలిపోయాడు కృష్ణమూర్తి. గోరింటాకుతో ఎర్రగా పండి కెంపుల్లా మెరుస్తున్న వేళ్ళను కదిలించాడు.



ఇది ఎన్నోకళల కలనేత
నా వన్నెల రాశికి సిరిజోత
నా వన్నెల రాశికి సిరిజోత
ముచ్చట గొలిపే మొగలిపొత్తుకు
ముల్లూ- వాసన ఒక అందం
అభిమానంగల ఆడపిల్లకు
అలుక -కులుకు ఒక అందం
నీ అందాలన్నీ కలబోశా -నీ
కొంగుకు చెంగున ముడివేస్తా-



నీ అందాలన్నీ కలబోశా -నీ
కొంగుకు చెంగున ముడివేస్తా-
ఇది ఎన్నోకళల కలనేత
నా వన్నెల రాశికి సిరిజోతా ॥సరి॥
చుర చుర చూపులు ఒకమారు
నీ-చిరు చిరునవ్వులు ఒకమారు
మూతి విరుపులు ఒకమారు
నువ్వు ముద్దుకు సిద్ధం ఒకమారు
నువు ఏ కళనున్నా మా బాగే
ఈ చీర విశేషం అల్లాగే ॥సరి॥



* * *

భామ జడవేసుకుంటూ అద్దంలో తన అందాన్ని పదే పదే చూసుకుని, వెళ్లి తల్లి కాళ్లకు నమస్కరించింది. "అవునూ ఇవాళ నీ పుట్టిన రోజు గదమ్మా చెప్పొచ్చు కదా." అన్నది తల్లి మురిపెంగా.

"ఇప్పుడు చెప్పానుగా" అన్నది భామ ఇంకా మురిపెంగా.

"అంతేలే, ఒకరోజు ముందు చెబితే మాత్రం ఈ పేద తల్లి తవ్వి తలకెత్తే పాతర్లేమున్నాయి గనుక? రోజూ కట్టే ఈ చెండు తప్ప" అన్నది, కాంతమ్మ కూతురు సిగలో పూలు తురుముతూ. కూతురు చీరవంక చూసి "ఆ చీర కట్టింది కొత్తచీరలా లేదే?" తెలిసీ తెలియనట్టు అడిగింది.



"ఇప్పుడు అయన తెస్తున్నారమ్మా"

"అలాగా?"

"ఆయన స్వయంగా డిజైను చేసి నేయించిన చీర" చెప్పింది భామ పరవశంతో.

* * *

ఆఫీసులో చీరెల డిజైన్లు చూస్తున్నాడనేగానీ మనసంతా ఇంటిమీదనే ఉంది కృష్ణమూర్తికి. ఆ రోజు భార్య పుట్టిన రోజు. భామ కోసం అత్యంత అద్భుతంగా చీరను డిజైన్ చేశాడు. అలాంటి చీర భామ తప్ప మరొకరు కట్టరాదు. మరెవరి దగ్గరా ఉండరాదు. అందుకనే జాగ్రత్తగా చీరను కవర్లో పెట్టి ఇంటికి బయలుదేరాడు. తను స్వయంగా డిజైన్ చేసిన చీరను

బహుమతిగా ఇస్తానని భార్యకు మాట ఇచ్చాడు. ఆ చీరలో తన ప్రేమనంతా పొదిగాడు.

చీరలో దాగున్నది నూలు పొరలు కాదు. తన మనసు పొరలు. భార్య పట్ల తనఅనురాగం,ఆరాధన, ప్రేమల కలబోత ఆ చీరె. ఒకటికి పదిసార్లు చీరను తృప్తిగా చూసుకుని "భామా..భామా ఓ సత్యభామా... తరినానా.. నానా... ఊ..ఆ..." అంటూ శభాష్ రాముడులోని 'హల్లో డార్లింగ్ మాట్లాడవా' పాట ట్యూన్‌లో ఆలాపన చేస్తూ బయలుదేరాడు.

"ట్రింగ్..ట్రింగ్ .."ఫోన్ మోగింది. విసుక్కుంటూ ఫోనెత్తాడు. "హల్లో..నేను..కె.కె.మూర్తి...ఆర్ట్...."చెబుతుండగా 'నేనూ......"అని వినిపించింది అవతల నుంచి అది తన యజమాని శ్రీధరరావు సహజ ఊతపదం.



"సార్..." అన్నాడు కృష్ణమూర్తి వినయంగా.

"ఒకసారి ఆ చీర తీసుకుని మా ఇంటికి రావోయ్ అర్జంటు వనుంది" ఆర్డరేశాడు శ్రీధరరావు.

కృష్ణమూర్తి గుండెల్లో రాయిపడింది."సార్..." అని ఏదో చెప్పబోతుండగా ఫోన్‌పెట్టేశాడు శ్రీధరరావు.

నీరుగారి పోయాడు కృష్ణమూర్తి . "చీరా....అక్కడ నువ్వెరికీ అందంగా కనిపించేం, ప్లీజ్.." అని బ్రతిమాలుకుని బయల్దేరాడు. చీరకోసం కాలుగాలిన పిల్లిలా అటు ఇటు తిరుగుతూ ఎదురు చూపులు చూస్తున్నది భామ. పాపం.. ఆ నాథుడి అవస్థ తనకెలా తెలుస్తుంది?

* * *

శ్రీధరరావు బంగళాలోకెళ్ళాడు కృష్ణమూర్తి. ఆయనతోబాటు భార్య మంగళ, కూతురు వసుంధర అందరూ తనకోసమే ఎదురు చూస్తున్నట్టున్నారు.

"గుడీవినింగ్ సార్.. అయాం కె.కె..సార్.." విష్ చేశాడు కృష్ణమూర్తి.

"రావయ్యా రా.... కూర్చో..." అన్నాడు శ్రీధరం. మంగళకు కూడా నమస్కరించాడు కృష్ణమూర్తి.



కృష్ణమూర్తి చేతిలోంచి చీరెను తీసుకుంది వసుంధర.

"ఇట్స్ ఓకె...మిస్టర్ కె.కె...ఈ చీరె నాది. డాడీ సరే అన్నారు. అంచేత డబుల్ ఓ.కె." అన్నది.

కంగారు వడ్డాడు కృష్ణమూర్తి. "సార్..ఈ చీరె డిజైన్ డీలర్స్ అంతా ఓకె చేశారు. రేపే ప్రింటింగ్ ఆర్డరిస్తున్నాను పదివేల చీరెలకు" యజమానితో అన్నాడు కృష్ణమూర్తి. అప్పటికే ఆ చీరమీద సగం ఆశ వదులుకున్నాడతను.

"ఆ పదివేల చీరలు నేనే కొని గోడౌన్లో దాచేస్తాను. ఇదొక్కటే చీర ఉండాలి. నేనొక్కదాన్నే కట్టుకోవాలి." అన్నది వసుంధర చీరను వెనక్కు దాచేసుకుంటూ.

ఏడుపొక్కటే తక్కువైంది కృష్ణమూర్తికి "సార్... బట్... బట్..." అంటూ నిస్సహాయంగా యజమాని వంక చూశాడు.



తల్లిచాటుకు వెళ్ళింది వసుంధర. కూతురు ఆ చీర మీద అంత ముచ్చటపడటం ముచ్చటగొలిపింది మంగళకు.

"ఇచ్చెయ్ నాయనా... వంద చీరలున్నా ఒక్కటీ ముట్టుకోదు. ఈ మొగ చొక్కాలతో ముఖం మొత్తిపోయింది నాకు. అడక్కడక్క ఇన్నాళ్ళకు ఈ చీర నచ్చింది... ఇచ్చెయ్." అన్నది వెంటనే.

ఏం చెయ్యాలో తోచలేదు కృష్ణమూర్తి కి..

"ఆఫ్‌కోర్స్....అయాం వెరీ హ్యాపీ...ఓ వారం రోజుల్లో" (ఇలాంటిదే మరొకటి డిజైన్ చేస్తాను.) అన్నట్టుగా ...శ్రీధరంతో బ్రతిమాలాడు కృష్ణమూర్తి.

లోలోపల నవ్వుకుంది మంగళ. "మీరు చెప్పండి. బాసుగారు కదా...." అన్నది.



"ఆడబానుల ఆర్డరైపోయింది. మగబానులు నలాములు కొట్టాల్సిందే" అన్నాడు శ్రీధరం స్థిమితంగా.

"బట్ సార్..అందులో చిన్న రిపేర్లున్నాయి. నేనింటికి తీసుకెళ్ళి..." వంట్లో చివరి రక్తపు బిందువున్నంతవరకు శతృవుతో పోరాడే వీరసైనికుడిలా ప్రయత్నించాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి బాధ ఆయనకు తెలియదు కదా మరి!

"ఇంకా రిపేర్లేమిటయ్యా! అది పులిగుహలోకి వెళ్ళిపోయింది" చెప్పాడు శ్రీధరం తాపీగా.

చీర మీద మోజు పడటం తప్ప కట్టుకోవడం తెలిని వసుంధర -

"ఆర్ట్‌గారూ....కమాన్...ప్లీజ్...ఈ చీరను కట్టడం ఎలాగో చూపించండి.." అంటూ అడిగింది లోపల్నుంచి.

కృష్ణమూర్తి అరికాలిమంట నెత్తికెక్కింది. అయినా పేదవాడి కోపం పెదవికి చేటని ఎరిగిన వాడు కాబట్టి నిగ్రహించుకున్నాడు.

"సార్... ఇక నేను బయలుదేరుతాను...."అన్నాడు దేభ్యం మొహంతో.

"కూచో...కూచో...భోంచేసి వెళ్ళువుగాని....అన్నాడు శ్రీధరం.

"ఫర్వాలేదుసార్...." నమస్కరించాడు కృష్ణమూర్తి. "కూర్చోవయ్యా అంటుంటే. .పెళ్ళి పెటాకులు లేనివాడివి. వెళ్ళి ఏం చేస్తావ్? కూచో....." అన్నాడు శ్రీధరం చిరుకోపం, చిరునవ్వు మిళాయించిన ఆప్యాయతతో..

* * *

రాత్రి పదకొండుయింది. భర్త వస్తాడని, తనకోసం సరికొత్త చీర తెస్తాడని ఎదురు చూసీ చూసీ కళ్ళుకాయలు కాచిన భామ అలిసిపోయి పడుకుంది.



ఇంటిముందు కారు ఆగింది. వట్టిచేతులతో దిగాడు కృష్ణమూర్తి. భార్య కిచ్చిన మాటనిలబెట్టుకోలేనందుకు అతనికీ బాధగానే ఉంది. భార్య ఎక్కడ అపార్థం చేసుకుంటుందోనని భయం... ఏం చెయ్యగలడు? తను స్వతంత్రజీవి కాదు కదా!

పూలమాల తీసుకుని వచ్చి భార్య పక్కన కూర్చున్నాడు. పూల పరిమళాలకు మెలుకువ వచ్చి ఆవులిస్తూ లేచింది భామ. భర్తను చూసి నవ్వింది పలకరింపుగా.



"పదిన్నర దాటింది" సిన్సియర్‌గా అన్నాడు. సమాధానంగా మరోసారి ఆవలించి లేచి ఒళ్ళు విరుచుకుంది. "నేను బయలుదేరుతుంటే బాస్ ఫోన్ చేశారు. కేరళ,బొంబాయి, మెడ్రాసు నుంచి ఏజెంట్లు

వచ్చారు మీటింగని" సగం నిజం, సగం అబద్ధం చెప్పాడు కృష్ణమూర్తి.

కథలనేవి ఇక్కడే పుడతాయి. నదులన్నింటికి జన్మస్థానం ఒక్కొక్కచోట ఉంటుంది. కానీ కథలకు మాత్రం అన్ని ఇళ్ళు జన్మస్థానాలే.

ఓ చెయ్యి తిరిగిన (అంటే పక్షవాతంతో వంకర పోవడం కాదు) రచయిత్రిని "మీరిన్నిన్ని వైవిధ్య భరితమైన కథలు ఎలా వ్రాయగలిగారు" అని అడిగితే "మా ఆయన ఇంటికి ఆలస్యంగా వచ్చినపుడల్లా అందుకు కారణంగా చెప్పిన కథ చెప్పకుండా చెబుతుంటాడు. అవే నా ఇతివృత్తాలు" అని చెప్పిందట!

ఇటువంటి సందర్భాలలో సత్యహరిశ్చంద్రుడు లాంటి వాడు కూడా ఆలోచించకుండా అబద్ధం చెబుతాడు. కాపురంలో అబద్ధాలకు, అపార్థాలకు ఇక్కడే నాంది పడుతుంది. ఆ అబద్ధాలను భార్య నమ్మినా, నమ్మినట్లు నటించినా మగాడు అదృష్టవంతుడు. లేదంటే యుద్ధానికి సిద్ధం కావల్సిందే. ప్రస్తుతానికి మాత్రం కృష్ణమూర్తి అదృష్టవంతుడే.

"ఇట్స్ ఓకె మిస్టర్ కె.కె." అన్నది భామ మత్తుగా.



ఊపిరి పీల్చుకున్నాడు కృష్ణమూర్తి.

"నా చీరేది?" అడిగింది భామ.

మరో అబద్ధం కృష్ణమూర్తి నోటనుంచి తన్నుకొచ్చింది.

"అదా...అది మనది కాదు! కంపెనీది గదా...దాన్ని చూడగానే ఏజెంట్లు ఎగిరి గంతేశారు. వెయ్యి రెండువేలు కావాలని ఎగరేసుకుపోయారు" చెప్పాడు.

"పోన్లెండి...మీకు మంచి పేరొచ్చిందిగా. నాకు లేకపోయినా" అన్నది.

అయినా గిల్టీఫీలింగ్ వదల్లేదు కృష్ణమూర్తికి. "అయాం సారీ భామా." అన్నాడు.

"అయాం హ్యాపీ అంటుంటే... లేవండి. భోంచేద్దాం రండి. ఆకలి..." అంటూ లేచింది భామ.

"అయాం సారీ...వాళ్ళు బలవంతం పెడితే .."గొణిగాడు .

"అక్కడే తినేశారు అంతేగా... దానికి సారీ ఎందుకండీ. నేను తింటాను. మీరు లొట్టలేద్దురుగాని... రండి" వంటింట్లోకి నడిచింది భామ.

కడుపు నిండటంతో కృష్ణమూర్తికి నిద్ర ముంచుకొస్తున్నది. ఆవులించసాగాడు.



"బాగుంది. లొట్టలెయ్యమంటే ఆవులిస్తూ చిటికెలు వేస్తున్నారా? పోనీ పడుకుందురుగాని రండి పక్కసర్దుతా" లేచింది భామ.

ఇంతమంచి భార్య దొరికినందుకు ఆమె వెళ్లిన వంక గర్వంగా తృప్తిగా చూస్తూ లోపలికి కదిలాడు కృష్ణమూర్తి.

* * *



ఆఫీసులో పని చేసుకుంటున్న భామ ఏవో ఫైళ్ళు తీసుకుని వెళ్ళబోతుండగా వసుంధర వస్తున్న అలికిడి వినిపించి ఆగింది.

కొత్తచీర కట్టుకున్న వసుంధర తన ఫ్రెండ్స్‌కు గర్వంగా చూపిస్తూ 'లాలాలా' అంటూ హమ్ చేస్తోంది.

"వనూ....వనూ...ఈ చీర ఎంతో బాగుంది. నాకు ఒకటి నేయించవే." అన్నదో స్నేహితురాలు.

"నథింగ్ డూయింగ్. ఇలాంటి చీర ఒక్కటే ఉంది. దాన్ని నేనొక్కదాన్నే కట్టుకోవాలి. తెలిసిందా" గర్వంగా అంది వసుంధర.



అనుమానంతో చూసింది భామ. అది భర్త తనకు ప్రెజెంట్ చేస్తానన్న చీర! ఆమెలో అనుమాన బీజం బలపడింది. వారి సంభాషణ తన భార్య వినడం, చూడటంతో గుండె గుభేల్ మంది కృష్ణమూర్తికి.

కృష్ణమూర్తి రావడం గమనించి "ఆర్టుగారూ...ఓ మాటిలా రండి" పిలిచింది వసుంధర.



భర్తను చూసి రగిలిపోయింది భామ. భార్య కోపం గ్రహించాడు కృష్ణమూర్తి.

వెంటనే వచ్చి "మన చీరకట్టు సూపర్ హిట్టండోయ్" అన్నది వసుంధర నవ్వి షేక్‌హాండిస్తూ. కృష్ణమూర్తి కూడా నవ్వాడు.

"ఈయన మా ఆర్ట్ డైరెక్టర్ మిస్టర్ కె.కె. " ఫ్రెండ్స్‌కు పరిచయం చేసింది వసుంధర. అందరూ సంతోషాన్ని ప్రకటిస్తూ నమస్కారాలు చేశారు. ఆనందంతో పొంగిపోతూ అందరినీ విష్ చేశాడు కృష్ణమూర్తి.

"సార్...సార్..మా క్కూడా ఇలాంటిదే...తలా ఒక్కటి నేయించండి సార్" అంటూ రిక్వెస్ట్ చేశారు స్నేహితురాళ్ళు.

పైగా "..ఎంత డబ్బైనా సరే..." అని డిక్లేర్ చేశారు కూడా.

ఈ భాగవతాన్నంతా చూస్తూనే ఉంది భామ. లోపల ఏడుస్తూ పైకి నవ్వాడు కృష్ణమూర్తి. 'కరవమంటే కప్పకు కోపం. విడవమంటే పాముకు కోపం'లా ఉందతని పరిస్థితి.



వసుంధరకు కోపం వచ్చింది. 'నథింగ్ డూయింగ్ అన్నానా. ఇది నాకు... నాకోసం మా ఆర్ట్‌గారు స్పెషల్‌గా డిజైన్ చేయించారు. నా వొడ్డూ పొడుగూ, నా బాడీ వంపులు, నా పాదాల రంగు వాటిని బట్టి అంచులు వేయించారు" వెలికలు తిరుగుతూ చెబుతున్నది వసుంధర ఫ్రెండ్సుతో.

పుండు మీద కారం చల్లుతున్నట్టుగా ఉంది భామకు వారి మాటలు వింటుంటే. భర్త నిన్న చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. తన చెక్కిళ్ళు నిమురుతూ 'ఆ చీర మొట్టమొదటిసారి నువ్వే కట్టుకోవాలి. నీ తరువాతే ఊర్వశులు రంభలూ..'అన్న మాటలు జ్ఞప్తికొచ్చి కళ్ళు అరుణిమ వర్ణాన్ని దాల్చాయి.

వసుంధర తన స్నేహితురాళ్ళతో ఇంకా చెబుతున్నది. "అంతెందుకూ...నేనెప్పుడూ చీర కట్టుకోలేదు కదా. ఆ టెక్నిక్ అంతా నిన్న ఆయనే నేర్పించారు" అన్నది.

ఇక ఆపుకోలేపోయింది భామ.

"హాయ్..ఆంటీ ..ఎలా ఉంది ఈ చీర నేను కట్టుకుంటే? అసలు ఈ చీర మీలాంటి బ్యూటీలు కట్టాలి. కానీ నేను కట్టినందువల్ల మీకే పోటీవచ్చేస్తున్నా...." అన్నది వసుంధర గలగలా నవ్వుతూ.

ఏడుపు దిగమింగుకుంటూ నవ్వింది భామ. భామ మనసులో రగులుతున్న మంట వసుంధరకు తెలియదాయె. అందువల్ల ఉన్నదున్నట్లుగా మాట్లేడేస్తున్నది - "హౌ డూయూ లైకిట్ ? ఇది మన

అర్థగారు ..నాకోసం....డిజైన్ చేశారు..నాకోసం...నాకోసం...నాకోసం" అంటూ తెరలు తెరలుగా నవ్వుతూ చెప్పింది వసుంధర.



అకాళ్ళక్రింద భూమి కంపించినట్టుగా వీలైంది సత్యభామ. తొలిసారిగా భర్త నిజాయితీపట్ల శంక మొదలైంది. ఏం చెప్పాలో తోచక చూస్తుండిపోయింది.

* * *

రాత్రి తొమ్మిది గంటలు. ఇంట్లోకి ప్రవేశించాడు కృష్ణమూర్తి. రోజూ ఇంటికి రాగానే నవ్వుతూ ఎదురొచ్చే సత్యభామ కనిపించలేదు. ఇంట్లోకొచ్చి బట్టలు మార్చుకున్నాడు. పడకగదిలో పడుకుని ఉన్నది సత్యభామ.

"భోంచేద్దామా?" అడిగాడు.

భామ నుంచి ఏ సమాధానం రాలేదు.

"తొమ్మిదైంది. భోజనం పెడతావా?" అడిగాడు ఈసారి. భామ జవాబివ్వకుండా గోరింటాకు పట్టించిన తన రెండు హస్తాలను చూపించింది. భామ చేతులతో పాటు పాదాలను కూడా చూశాడు కృష్ణమూర్తి . గోరింటాకు దిట్టంగా పట్టించింది.



"నేనే వడ్డించి తినిపిస్తాను. పట్రానా?" అడిగాడు. భామ నోరు తెరిచి నాలుక జాపింది. ఎర్రగా పండింది నోరు.

"ఓహో...అప్పుడే నువ్వు తాంబూలం కూడా వేశావా ?" అన్నాడు.

భామ మాట్లాడలేదు. తన అసహాయతను భార్య అపార్థం చేసుకుందని అర్థం చేసుకున్నాడు.

"నేను చేసింది తప్పు అని నువ్వు అనుకుంటే క్షమాపణ చెబుతాను" అన్నాడు. భామ మాట్లాడలేదు. కోపంగా చూసింది. ఇద్దరు సూర్యులు కనిపించారా కళ్ళలో. "కళ్ళకు కూడా గోరింటాకు పెట్టావా? బాగా పండింది.. ఎర్రగా" అన్నాడు కచ్చిగా.

భామ అటు వైపు తిరిగింది. నిట్టూరుస్తూ టేబుల్ ముందు కూర్చుని అన్నం వడ్డించుకుంటున్నాడు కృష్ణమూర్తి. 'ఇవాళ మనకు పస్తే ...' అని గొణుక్కున్నాడు.



* * *

మరునాడు తలంటు పోసుకోవాలని టవల్ చుట్టుకొని కుర్చీలో కూర్చున్నాడు కృష్ణమూర్తి. భామ నూనె చేతిలో వేసుకుని భర్త తలకు మర్దించసాగింది మౌనంగా. హాయిగా ఉంది కృష్ణమూర్తికి.

"కొట్టు.. కొట్టు.... చితగొట్టు... కొట్టు... ఆడపిల్లలకు షేక్ హాండ్లివ్వటం - వాళ్ళికిలిస్తే మనం సకిలించడం - ఒళ్ళు మైమర్చి పోవడం... డం..... డం.." అంటున్నాడు.

భర్త మాటలకు నవ్వొస్తున్నది భామకు.



"క్షమించలేదా.. కోపం పోలేదా..?" అడిగాడు కృష్ణమూర్తి దీనంగా.

"కోపం కాదు. బాధ...చీర అమ్మాయికి ఇచ్చినందుకు కాదు. నాతో అబద్ధం చెప్పినందుకు" అన్నది భామ గారంగా.

"సారీ..."

"ఇంకెపుడూ నాతో అబద్ధం చెప్పనని ....."

"ప్రాణం పోయినా చెప్పను".

"నా కళ్ళలోకి సూటిగా చూసి చెప్పండి"



"చెప్పగలను, కానీ నీ కళ్ళలోకి సూటిగా చూడలేను "

"భయమా?"

"కాదు... కుంకుడుకాయ పులుసు." కళ్ళనిండా విరగబడి నవ్వాడు కృష్ణమూర్తి.

సత్యభామ కూడా కలకల నవ్వింది. అపార్థాల అడ్డుగోడ మనసులు విప్పి మాట్లాడుకోవడంతో కూలిపోయింది.

**(ఇంకావుంది)**



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## కురిసెను జల్లులు అరవిరిసిన మల్లెలు

ప॥ కురిసెను జల్లులు అరవిరిసిన మల్లెలు
శ్రీపదపంకజ రూపాంకితముల
సుందరతర ప్రియసంకేతమ్ముల ॥కురిసెను జల్లులు॥

చ॥ అడుగుతీసి అడుగిడుశుభవేళల
అమృత భాండమందించినవేళల
పడగనీడ పవళించినవేళల
ఎదనిండి కొలువుండినవేళల ॥కురిసెను జల్లులు॥

చ॥ వెదదకనుదోయి విరిసినవేళల
కొసరు చూపులందించినవేళల
మిసిమివెన్నెలలు చిందినవేళల
హృదయవీణ స్పందించిన వేళల ॥కురిసెను జల్లులు॥

**రచన** : "గోపాలి"
**గానం, సంగీతం** : డి.వి. మోహన కృష్ణ
**రాగం** : మిశ్ర శుద్ధ సారంగ్ (హిందుస్తాని సం॥)
**తాళం** : ఆది (కర్ణాటక సం॥) - కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : ని స రి మ ప ని స
**అవరోహణ**: స ని మ ద ప మ రి ని స
- కాకలినిషాదం, షడ్జము,చతుశృతి రిషభం, ప్రతి మధ్యమం, పంచమం, ఆరోహణలోని స్వరాలు. కాకలినిషాదం,ప్రతిమధ్యమం, చతుశృతి ధైవతం, పంచమం, శుద్ధమధ్యమం, చతుశృతి రిషభం అవరోహణలోని స్వరాలు యీ రాగంలో.

"భక్తి శృంగారాలకు అనుకూలమైన యీ రాగం హిందుస్తాని నంగీతంలో బాగా ప్రాచుర్యాన్ని పొందినది. లలిత సంగీతంలో కూడా యీ రాగం యొక్క వాడుక బాగానే కనిపిస్తుంది. హిందీ, తెలుగు చలన చిత్రాలలోను ఆకాశవాణిలోను కూడా యీ రాగాన్నీ చాలామంది స్వర కర్తలు వినియోగించి చక్కని బాణీలు మనకు అందించారు.

శుద్ధసారంగ్‌లోని స్వరాలేకాక అంతర గాంధారం, కైశికి నిషాదం వంటి అన్యస్వరాలతో మిశ్రమం గావించి చక్కని బాణీని కూర్చారు స్వరకర్త మోహనకృష్ణ "కురిసెను జల్లులు అరవిరిసిన మల్లెలు" అనే పాటకు.

గోపాలి అనే కలంపేరుతో కుమారి కౌతా ప్రియంవద రచించిన యీగీతాన్ని మోహనకృష్ణ ఆకాశవాణిలో పాడి శ్రోతల మన్ననలు పొందారు.

## డి.వి.మోహనకృష్ణ

మచిలీపట్నంలో 1962లో జన్మించిన మోహనకృష్ణది కళాకారుల వంశం. నాటక రంగంలో సుప్రసిద్ధులు, 'నటరాజశేఖర' బిరుదాంకితులైన కీ॥శే॥ డి.వి.సుబ్బారావు గారు యీయన తాతగారు. చిన్నతనంలోనే కర్ణాటక సంగీతంలో ప్రాథమిక అభ్యాసం ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ శిష్టు ప్రభాకర కృష్ణమూర్తి శాస్త్రి గారి వద్ద గావించారు. ఆ తరువాత జగద్విఖ్యాతులు, మహా విద్వాంసులు డా॥మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి వద్ద గురుకుల పద్ధతిలో శాస్త్రీయ సంగీతంలో శిక్షణ



పొందారు. 72 మేళకర్తలు గానం చేయడంలోను, 35 తాళాలలోను పాడడంలో కూడా నేర్పును పొందారు. సంగీత త్రిమూర్తుల కీర్తనలే కాక శ్రీ బాలమురళీ గారి కీర్తనలెన్నిటినో అభ్యసించారు మోహనకృష్ణ. కర్ణాటక సంగీతంలో డిప్లొమా పరీక్షలో ఫస్టుక్లాసులో డిస్టింక్షన్‌తో ఉత్తీర్ణులైనారు. బి.కాం పట్టా కూడా పొందిన మోహనకృష్ణ ఆకాశవాణి హైదరాబాదులో 'ఎ' గ్రేడ్ నిలయ విద్వాంసుడుగా వున్నారు. శాస్త్రీయ సంగీతంలోనే కాక, లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలలో కూడా ప్రావీణ్యత గల కళాకారుడు ఆయన. అనేక లలిత సంగీత కార్యక్రమాలలో కూడా పాల్గొని పండిత పామరుల సైతం ప్రశంసలు పొందారు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో భక్తిరంజని కార్యక్రమానికై నేనాయన చేత మంచి కీర్తనలు 1989లో పాడించాను. ఆకాశవాణిలో ఎన్నో భావగీతాలు, దేశభక్తి గీతాలు, భక్తి గీతాలు పాడడమే కాక స్వరకర్తగా కూడా చాలా పాటలకు మధురమైన బాణీలు కూర్చారు. సంగీత రూపకాలను కూడా నిర్వహించారు తన గానంతోను, సంగీతంతోను విజయవాడ ఆకాశవాణిలో. భారతదేశంలో పలుచోట్ల సంగీత కచేరీలు చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు నిర్వహించే బ్రహ్మోత్సవాలలోను, స్పిరిట్ ఆఫ్ యూనిటి కార్యక్రమాలలోను, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక మండలి వారు నిర్వహించే సభలలోను మోహనకృష్ణ కర్ణాటక సంగీత కచేరీలు చేశారు. టాలెంట్ అకాడమి, విజయవాడ వారు 1994లో బెస్ట్ మ్యుజీషియన్ అవార్డు ఆయనకు బహూకరించారు. 1995లో కళా నీరాజనం అవార్డు ఇంకా యింకా మరెన్నో పురస్కారాలు ఆయనకు లభించాయి. ఇండోనేషియా దేశంలో చాలాచోట్ల తన సంగీత కచేరీలతో ప్రజల మన్ననలు పొందారు. శాస్త్రీయ, లలిత



సంగీతాలలో ఎన్నో క్యాసెట్లు, సి.డి.లు వీరి గాత్రంతో వెలువడినాయి. గురువుగారు బాలమురళీగారి గానశైలిని ఆదర్శంగా చేసుకుని రాణిస్తున్న సుమధుర గాత్రం గల ప్రముఖ విద్వాంసుడు శ్రీమోహనకృష్ణ. ఆయన ఆయన కుటుంబ సభ్యులు నాకెంతో ఆత్మీయులు.

## కుమారి కౌతా ప్రియంవద

1937వ సంవత్సరంలో కాకినాడలో జన్మించిన కుమారి కౌతా ప్రియంవద ప్రపంచ ఖ్యాతినార్జించిన చిత్రకారులు శ్రీ కౌతా రామమోహన శాస్త్రి గారి తనయ. సంగీత కళాకారిణి శ్రీమతి మధురవాణమ్మగారు యీమె తల్లి. వెనుకటి తరం వారికి తెలిసిన సుప్రసిద్ధులు పెద్దాడ రామస్వామి గారు యీమె మాతామహులు. ప్రియంవద కర్ణాటక సంగీతాన్ని శ్రీయుతులు లంకా వెంకటేశ్వర్లు, ముడికొండాన్ వెంకట్రామయ్యర్, ద్వారం వెంకటస్వామి నాయుడుగార్ల వద్ద అభ్యసించారు. ఆంధ్రా విశ్వవిద్యాలయం నుండి మ్యూజిక్ డిప్లొమా,మద్రాసు మ్యూజిక్ అకాడమీనుండి టి.టి.సి. పట్టాలను పొందారు. లలిత సంగీతంలో శ్రీయుతులు బాలమురళీకృష్ణ, రజనీ కాంతరావుగార్లు యీమెకు మార్గదర్శకులు. శ్రీపాలగుమ్మి విశ్వనాథం, శ్రీమల్లిక్ గార్లు కూడా



యీమెకు ఆదర్శం. నెల్లూరు జిల్లా కావలిలో విశ్వోదయా ఫైన్ ఆర్ట్స్ డిపార్టుమెంటులో 11సం॥లపాటు ఉపాధ్యాయినిగా పనిచేశారు. 1960 నుండి ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో లలిత సంగీతం, శాస్త్రీయ సంగీతం కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆ సమయంలో ఆమెతో నాకు పరిచయం ఏర్పడినది. చక్కని గాత్రం కలిగి ఎంతో మధురంగా పాడే గాయని ఆమె. కొన్ని పాటలు కూడా నేను ఆమెకు నేర్పినట్లు జ్ఞాపకం. 1976లో ఆకాశవాణి కడప కేంద్రంలో ఆమె మ్యూజిక్ కంపోజర్ గా ఉద్యోగంలో చేరి ఎన్నో మంచి కార్యక్రమాలను నిర్వహించారు. ఆ తరువాత కొంతకాలానికి విజయవాడ కేంద్రానికి బదిలీ అయి అక్కడే స్థిరపడ్డారు. 1995లో పదవీ విరమణ గావించి ప్రస్తుతం లలిత సంగీతం కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.



సుమారు 45 సంవత్సరాల నుండి ఆమె చేస్తున్న సంగీత సేవతో బాటు రచనా వ్యాసంగం కూడా కొనసాగిస్తున్నారు. శ్రీకృష్ణుడు ఆమె ఆరాధ్యదైవం. 'గోపాలి' అనే కలం పేరుతో శ్రీకృష్ణపరంగా నాయికా భావంతో సుమారు 1800గీతాలను రచించారు. కొన్ని గీతాలను ఆకాశవాణిలో చాలామంది గాయనీ గాయకులు గానం చేశారు. సంగీతపరంగా ఆకాశవాణి లో 'మహాకవి అక్కయ్యా మాత్యుల వారి'శ్రీకృష్ణ లీలా విలాసం' యక్షగానానికి సంగీత సారథ్యం వహించారు. 'వినయాభిరామం', 'ముగ్గుల పందిరి' మొ॥లగు సంగీత రూపకాలకు స్వరకర్తగా వ్యవహరించారు. ఆ కార్యక్రమాలతో ప్రియంవద పలువురి ప్రశంసలను పొందారు. అనుశ్రుత ఆమని, దీపరశ్మి, తథాగత గీతికలు మున్నగునవి ఆమె సంగీతం లో కూర్చిన ఆమె రచనలు ఆకాశవాణి లో ప్రసారమైనవి.

పదవీవిరమణానంతరం శేష జీవితమంతా సంగీత సాధన, రచనావ్యాసంగాతో పాటు తండ్రి గారి నుండి వారసత్వంగా వచ్చిన చిత్రలేఖనం లో కూడా పరిశ్రమను గావిస్తూ సార్థకం చేసుకుంటున్న కళాకారిణి కుమారి ప్రియంవద.

## శుద్ధ సారంగ్/ మిశ్ర శుద్ధ సారంగ్ రాగం
## ఆధారంగ కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. ఝున్ ఝున్ కంకణము లూగ ఘల్ ఘల్ కింకిణులు మ్రోగ | తెనాలిరామకృష్ణ | ఆర్. బాలసరస్వతి | విశ్వనాధన్ - రామ్మూర్తి |
| 2. పలుక వేలనే చిలకా | షావుకారు | ఆర్. బాలసరస్వతి | ఘంటసాల |
| 3. జయ జయ జయ శారదా జయ కళా విశారదా | మహాకవి కాళిదాసు | పి. సుశీల | పెండ్యాల |
| 4. ఎంత కృపామతివే భవాని | కీలుగుఱ్ఱం | ఘంటసాల, శ్రీదేవి | ఘంటసాల |
| 5. ఎదుట నుండి కదలను పదము లింక వదలను | వాడేవీడు | పి. సుశీల | సత్యం |

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1963

'పారస్‌మణి' చిత్రం ద్వారా సంగీత దర్శకులుగా పరిచయమైన లక్ష్మీకాంత్-ప్యారేలాల్‌లు అతి తక్కువకాలంలోనే చక్కటి


లక్ష్మీకాంత్- ప్యారేలాల్

సంగీత దర్శకులుగా గుర్తింపు పొందారు. శంకర్-జైకిషన్‌ల 'బర్సాత్' చిత్రం తర్వాత తొలి చిత్రంతోనే ఉన్నత స్థాయికి చేరుకున్న జంట వీరిదే!

రఫీ-లతా ల డ్యూయెట్ 'వో జబ్ యాద్ ఆయే, బహుత్ యాద్ ఆయే...', రఫీ సోలో 'రోషన్ తుమ్హీ సే దునియా', లతా-ముఖేష్‌ల 'చోరీ చోరీ జో తుమ్‌సే మిలీ తో లోగ్ క్యా కహేంగే', లతా సోలో 'ఉయీ మా ఉయీ మా యే క్యా హో గయా'(తెలుగులో 'నా వయసూ వలపూ నీదే సుమా' పాట ఈ ట్యూన్ పై తయారయింది), 'మేరే దిల్ మేఁ హల్కీ సీ వో ఖలిశ్ హై' పాటలు హిట్ కావటమే కాదు లతా-కమల్‌బారోట్‌ల డ్యూయెట్ 'హఁసతా హువా నూరానీ చెహరా'(తెలుగులో 'నీలి కన్నుల నీడలలోన' (గుడిగంటలు) పాట ఈ ట్యూన్ పై తయారయింది.) కూడా హిట్ అయ్యాయి. అతి తక్కువ బడ్జెట్‌తో నిర్మితమైన ఈ చిత్రంలోని పాటలు ఇప్పటికీ మరువలేనివే కదా! ఈ సినిమాలో తెలుగు తార గీతాంజలి హీరోయిన్‌గా నటించింది.

పౌరాణిక చిత్రమైనప్పటికీ 'హరిశ్చంద్ర తారామతి' చిత్రం ద్వారా లక్ష్మీ-ప్యారే లు తమదైన ముద్రను నిలుపుకోగలిగారు. ఈ చిత్రంలో లతా పాడిన 'మేఘవా గగన్ బీచ్ జాఁ కే', 'మైఁ ఏక్ నన్హా సా మైఁ ఏక్ ఛోటా సా బచ్చా హూ' తో పాటు హేమంత్ కుమార్ పాడిన 'జగత్ భర్ కీ రోషనీ కే లియే, కరోడోఁ కీ జిందగీ కేలియే, సూరజ్ రే జల్తే రహనా...' పాటలు సూపర్ హిట్స్ అయ్యాయి.

జంట సంగీత దర్శకులు సపన్-జగ్‌మోహన్‌ల తొలి చిత్రం 'బేగానా' ఈ సంవత్సరమే విడుదలైంది. 'ఫిర్ వో భూలి సి యాద్ ఆయీ హై...(రఫీ), 'న జానే కహాఁ ఖో గయా వో జమానా'(ముఖేష్) పాటలు మంచి హిట్స్‌గా పేరు తెచ్చుకున్నాయి.

ఈ సంవత్సరం శంకర్-జైకిషన్‌లకు కేవలం


'దిల్ ఏక్ మందిర్' చిత్రంలో రాజేంద్రకుమార్, మీనాకుమారి, రాజ్‌కుమార్

రెండు చిత్రాలు మాత్రమే హిట్‌గా నిలిచాయి. రెండూ రీ-మేక్ లే! 'దిల్ ఏక్ మందిర్'(తెలుగులో మనసే మందిరం) చిత్రం కోసం టైటిల్ సాంగ్‌ను రఫీ, సుమన్ కళ్యాణ్‌పుర్ లు పాడితే, 'హమ్ తేరే ప్యార్ మేఁ సారా ఆలమ్ ఖో బైఠే హైఁ', 'రుక్ జా రాత్, ఠహర్ జా రే చందా' పాటలను లతా పాడారు. రఫీ ఎవర్‌గ్రీన్ హిట్ 'యాద్ న జాయే' ఈ చిత్రంలోనిదే!

'హమ్‌రాహీ'(తెలుగులో నాగేశ్వరరావు,


'హమ్‌రాహీ' చిత్రంలో రాజేంద్రకుమార్, జమున

కృష్ణకుమారి జంటగా వచ్చిన భార్యాభర్తలు) చిత్రం కోసం ముబారక్ బేగం-రఫీ కలిసి పాడిన 'ముజ్‌కో అపనే గలే లగా లో ఏ మేరే హమ్‌రాహీ' తో పాటు రఫీ-లతా కాంబినేషన్‌లో వచ్చిన 'వో దిన్ యాద్ కరో, వో ఛుప్ ఛుప్ కే మిలనా', లతా సోలో 'మన్ రే తూ హీ బతా క్యా గావూఁ' పాటలు సూపర్ హిట్స్‌గా నిలిచిపోయాయి. ఈ చిత్రంలో మన తెలుగు నటి జమున హీరోయిన్‌గా నటించింది.

'ఏక్ దిల్ సౌ అఫ్సానే' చిత్రంకోసం లతా పాడిన టైటిల్ సాంగ్‌తో పాటు,'ఓ జాదూగర్ ప్యార్ కే యే బతా' పాటలతో పాటు ముఖేష్ పాడిన 'సునో జీ సునో హమారీ భి సునో' పాట మంచి పాటలుగా గుర్తింపు పొందాయి. శంకర్-జైకిషన్‌లు ఈ చిత్రానికి సంగీత దర్శకులు.

'భరోసా'(తెలుగులో గాలిమేడలు), 'గెహరా దాగ్', 'గృహస్తి' (తెలుగులో మంచి కుటుంబం), 'గుమ్‌రాహ్'(తెలుగులో అభినందన), 'కౌన్ అప్నా కౌన్ పరాయా', 'నర్తకి', 'ప్యార్ కియా తో డర్నా క్యా', 'ఉస్తాదోం కా ఉస్తాద్' (తెలుగులో మొనగాళ్లకు మొనగాడు), 'యే రాస్తే హై ప్యార్ కే' చిత్రాలు మ్యూజికల్‌గా హిట్ అయి సంగీత దర్శకుడు రవిని అగ్రశ్రేణి సంగీత దర్శకుల జాబితాలో చేర్చాయి.


రవి

-(వచ్చే సంచికలో మరికొంత)

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



28

**హెచ్చరిక**

బిరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



**జరిగిన కథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయిలు ఖర్చు పెట్టిస్తారు. మేనేజరు ఇంటి నుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారు పడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం కోసం శాస్త్రిని కలిసిన వెంకట్రావుకు నరక బాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటూ తూతూమంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగ మంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడిన వెంకట్రావుకు తెల్లవారుజాము మూడున్నరకు ఆయనను కలిసే అవకాశం దొరుకుతుంది. తన సమస్యను విన్నవించటంతో స్వయంగా వచ్చి ఇంటి వాస్తు పరిశీలిస్తానని చెప్పి వెంకట్రావు ఇంటికి వచ్చిన వాస్తుభూషణరావు వెంకట్రావు ఇంటికి చేయాల్సి మార్పులు గూర్చి చెబుతుంటాడు. అంతలో అక్కడకు వచ్చిన వా.వి.చా, వాస్తుభూషణం చెప్పేదంతా అబద్ధమని, అతనిని నమ్మవద్దని చెబుతాడు. అతడి మాటలే అబద్ధమని వాదిస్తాడు వాస్తుభూషణం. ఇద్దరూ కలిసి సుందరి, వెంకట్రావులను భయపెడుతూంటారు. (ఇక చదవండి)

"ఏమండీ... మీకు సిలెండర్ మార్చడం ముఖ్యమా నా శరీరం, నేను ముఖ్యమా? చివరకు పాడెమీద నా ఫొటో పెట్టి దహనం చెయ్యాలి." ఏడుస్తూ అన్నది వెంకట్రావుతో.

"నో.. నో.. సుందూ, నాకు నువ్వే ముఖ్యం. వెధవ సిలెండర్... వెయ్యి రూపాయలు పెడితే రెండొస్తాయి. కానీ నీలాంటి భార్య నాకు దొరకదు" వణుకుతూ అన్నాడు వెంకట్రావు.

వాస్తుభూషణం మరింత మండి పడ్డాడు.

"వెంకట్రావు గారూ, మీరు వాడి బుట్టలో పడుతున్నారు. బహు పరాక్, తిరుపతి వెంకన్నకే వాస్తు చెప్పిన వాడిని నేను. పుష్కరిణి అంగుళం మేర లోతు తవ్వించాలన్న నా సూచన వారు పాటించ బట్టి వెంకన్న భక్తులు పెరిగారు. పోర్టికో ఎట్టి పరిస్థితులలోనూ పడగొట్టించి తీరాలి. లేకపోతే ఏదో ఒకరోజు కూలి మీ మీద పడి మీ తొడలు విరగడం ఖాయం. అపుడు మీరు ఎప్పుడైనా బయటకు వెళ్ళాలనుకుంటే సుందరిగారు సతీసుమతిలా మిమ్మల్ని తట్టలోనో, బుట్టలోనో కూర్చోబెట్టుకుని మోసుకు వెళ్ళాల్సి వస్తుంది తస్మాత్ జాగ్రత్త." ఆవేశంగా అన్నాడు.

"అమ్మో... ఆయన్ని మొయ్యడం నా వల్ల కాదు." కేక పెట్టింది సుందరి

"ఒసి నీ ముండ మొయ్యా.. ఆయన చెప్పేది నా తొడలు విరిగిన తరువాత మాట! వెధవ పోర్టికో పోతే పోయింది. నీ కంత శ్రమ రానివ్వను..." ఆక్రోశించాడు వెంకట్రావు.

"వెంకట్రావు గారూ.. నా మాట వినండి. వీడి మాటలు వింటుంటే వీడసలు వాస్తు పండితుడేనా అని నాకు అనుమానంగా ఉంది. పిలవని పేరంటంలా వచ్చాడు. వీడి పేరెన్నడూ నేను వినలేదు. వీడసలు..... " కోపంగా




అంటున్నాడు వాస్తు భూషణం.

"నోర్ముయ్..... వీడు వాడు అంటే మర్యాద దక్కదు. నీ ధోరణి చూస్తుంటే అసలు నువ్వు వాస్తు విద్వాంసుడివేనా అని పసివాడు కూడా సందేహిస్తాడు. వా అంటే ప్రజలు అని, అస్తు అంటే హితం అని వాస్తు అంటే ప్రజల హితం కోరేది అని నీకు తెలుసా అని?" అరిచాడు వా.వి.చా.

వెంకట్రావు మళ్ళీ ఆశ్చర్యపోయాడు. వాస్తంటే మరో అర్థం వినపడిందే అనుకున్నాడు.

"అప్రాచ్యుడా... జుట్టు పెంచుకోగానే వాస్తు పండితుడివి కాలేవు." అరిచాడు వాస్తు భూషణం.

"మూర్ఖుడా... గడ్డం పెంచగానే వాస్తు నిపుణుడివి కాలేవు." అదే స్థాయిలో అరిచాడు వా.వి.చా.

"నీ బిరుదులన్నీ బూటకం."

"నీ బిరుదులన్నీ నాటకం."

"నా మాట వినకపోతే వెంకట్రావు గారు కుష్టు వ్యాధితో కుచించుకుపోతారు."

"నా మాట వినకపోతే సుందరిగారు క్షయవ్యాధితో క్షయించిపోతారు."

"నా మాట కాదంటే వెంకట్రావు గారు కళ్ళులేని కబోది అవుతారు."

"నా మాట వినకపోతే సుందరిగారు బిడ్డలు లేని గొడ్రాలవుతారు."

"నా మాట వినకపోతే వెంకట్రావు గారు కాళ్ళు విరిగి కుంటి వాడౌతారు."

సుందరి, వెంకట్రావు దడదడలాడుతూ ఇద్దరి వంకా మాటమాటకు చూడసాగారు. వాస్తు పండితులిద్దరూ అదేం చూడకుండా వాగ్యుద్ధం కొనసాగించారు.

"నువ్వు పరమ మూర్ఖుడివి."

"నువ్వు పరమ ధూర్తుడివి."

"నువ్వు నీచుడివి."

"నువ్వు నికృష్టుడివి."

"నువ్వు లుచ్చావు."

"నువ్వు బద్మాష్‌వి."

"అబద్ధాల వల్ల నీ నోరు పడిపోతుంది."

"నీ మోసాల వల్ల నీ నాలుక తెగుతుంది."

"వళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు. నాకు కోపం వస్తే నీ పేగులు తీస్తా."

"నాకు మండిందంటే నీ గుండె చీల్చి రక్తం జుర్రుకుంటా."

"నేను తెగించానంటే నీ మెదడు బయటకు లాగి నేతిలో వేయించుకు తింటా."

"నేను తెగిస్తే నీ తలను ఒక్క వేటులో నరికి ఈ యింటి గుమ్మానికి గుమ్మడికాయలా వేలాడ దీస్తా."

"రేయ్" పెద్దగా అరిచి జేబులోని రివాల్వర్ తీసి గురి పెట్టాడు వాస్తు భూషణం.

"ఏంది బే" గర్జించి వీపు వెనుక దాచుకున్నా ఏకే 47 బయటకుతీశాడు వా.వి.చా.

వారి వాలకం ఆగ్రహావేశాలు చూసి దంపతులిద్దరూ వణికిపోయారు. ఇరువురి కళ్లలో నీళ్ళు వరదలై పొంగింది. అమాంతం ఇద్దరూ చెరొకరి పాదాలను చుట్టేసుకున్నారు.

"అన్నా.. అన్నా.. మీకు మీ పాదాలకు శతకోటి నమస్కారాలు. మా ఇంటి వాస్తు బాగాలేదని మీరు చెప్పిన మాటలు ఇపుడే నిజమయ్యేట్లున్నాయి. మీరిద్దరు ఇక్కడ ఏమైనా అఘాయిత్యాలు చేస్తే మేము వెళ్ళి జైయిల్లో కూర్చోవాలి." భోరుమన్నాడు వెంకట్రావు.

"అవునన్నా.. మీ ఇద్దరి మాటలు వింటాం. ఇల్లంతా కూల్చి పారేస్తాం. మీరిద్దరూ ఒకరినొకరు కాల్చుకోవద్దు. మాపరువు మంట



గలపద్దు. చెల్లెలాంటి దాన్ని. నామాట విని బయటకు వెళ్ళండి" కన్నీళ్ళతో పాదాలను తడిపింది సుందరి.

"మీరు వాస్తు ఫలితాలు చెబుతున్నారో లేక శాపనార్థాలు పెడుతున్నారో మా కర్థం కావడం లేదు. మీరు చెప్పినవన్నీ జరిగితే మాకు ఆత్మహత్యే శరణ్యం. ఆ బ్రతుకులు మేము బ్రతకలేము దయచేసి మమ్మల్ని వదిలిపెట్టండి" పెద్దగా ఏడ్చాడు వెంకట్రావు.

వాస్తు భూషణం, వా.వి.చా. ఒక నిముషం ఆలోచించారు.

అవును అదీ నిజమే. పదరా బయటకు పద. నీ అంతు చూస్తా అన్నాడు వాస్తు భూషణం.

"పద.. నీ ఎముకలు ఏరి మెడలో వేసుకుంటా." బయటకు నడిచాడు వా.వి.చా.

ఇద్దరూ బయటకు వెళ్ళారు.

"హమ్మయ్య.." ఊపిరి పీల్చుకున్నారు దంపతులు.

* * * *

ఒక మారు మూల ప్రాంతంలో ఇరానీ హోటల్.

"అసలు నువ్వెవరివయ్యా? అనవసరంగా మధ్యలో దూరి నా క్లైంట్ దగ్గరి కొచ్చి నా ప్లానంతా పాడుచేశావు. ఏదో కాస్త భయపెట్టి వాళ్ళ దగ్గర కనీసం లక్షైనా గుంజుదామనుకున్నాను." విసుగ్గా అన్నాడు వాస్తు భూషణం.

"క్షమించండి సార్... ఐదో క్లాసు పది సార్లు చదివినా పాస్ కాలేక పోయాను. వయసులో సోమరి పోతులా తిరిగాను. ఎక్కడా పనిదొరక్క ఈ నగరం వచ్చాను. దిక్కుల పేర్లు, మూలల పేర్లు, గ్రహాలపేర్లు తెలుసుకున్నాను. ఏ క్వాలిఫికేషనూ అవసరం లేని పని ఇదొక్కటే కనిపించింది. నాలుగిళ్ళు తిరిగి ఏవో ఒక వంకలు చెప్పి డబ్బులు గుంజుకుంటూ ఈ మధ్యే కారు కొన్నాను. దీనికంటే ఉత్తమమైందిలేదని అర్థమై ఇదే కంటిన్యూ చేస్తున్నాను. మీ గురించి తెలియక ఇంటర్ ఫియరయ్యాను." అపాలజికల్‌గా అన్నాడు వా.వి.చా.




"నువ్వు చెప్పింది నిజమే. సంపాదనకు దీనిని మించిన మార్గం లేదు. పది విషయాలు చెపితే రెండన్నా నిజం కాకపోవు. నమ్మినవాడు మళ్ళీ పిలుస్తాడు. లేకపోతే కొత్తవాళ్ళు మనకు ఎప్పుడూ దొరుకుతూనే ఉంటారు. కానీ దేనికైనా అనుభవం కావాలి. నాలాంటి వాడి దగ్గర జూనియర్‌గా కొన్నాళ్ళు పని చెయ్యాలి. ఇంతకూ నీకు అసలు వాస్తు గురించి ఏం తెలుసు?"

"మీకెంత తెలుసో నాకూ అంతే తెలుసు." బదులిచ్చాడు వా.వి.చా.

"అంటే నాకు ఏమీ తెలియదనేగా అర్థం?"

"అని నేననలేదే"

"మరి నీ ఉద్దేశ్యం?"

"మీకు తెలిస్తే నాకు తెలిసినట్లే మీకు తెలియదంటే నాకూ తెలియదనే."

"సర్లే.. నీతో గోల ఎందుకు గానీ కొన్నాళ్ళు నువ్వు నాకు అసిస్టెంటుగా ఉండు. చిన్న స్వామిగా నిన్ను లోకానికి పరిచయం చేస్తా. వేషం బాగానే ఉంది. అదలాగే ఉండనీ."

"నాది నిజమైన జుట్టు కాదండీ. విగ్గు."

"నాదీ నిజమైన గడ్డం కాదులే. పెట్టుడిదే."

"ఒకరి కింద అసిస్టెంటుగా ఉండటం నాకిష్టం లేదండీ? ఇండిపెండెంట్ లైఫ్ నాకిష్టం."

"అలా అయితే ఒక పని చెయ్యి. మనం జాయింట్‌గా వ్యాపారం చేద్దాం. ఎవరైనా పార్టీకి నేను ఏదైనా వాస్తు సలహా చెబితే నువ్వు వెంటనే ఆధారాలతో సహా దాన్ని సమర్థించాలి. అలాగే నువ్వు ఎవరికైనా ఏదైనా సలహా ఇస్తే దాన్ని అన్ని ఆధారాలతో నేను సమర్థించి ఆ సలహాకు ముల్లోకాలలోనూ తిరుగులేదని నేను చెబుతాను. లాభాలు ఇద్దరం చెరి సగం పంచుకుందాం. ఏమంటావు?"

"ఇది చాలా బాగుంది. వీలైనన్ని పత్రికలకు లంచాలిచ్చి మనం కాలమ్స్ రాస్తుండాలి. నా దగ్గర మెరికల్లాంటి ఇద్దరు కుర్రాళ్ళున్నారు. వారి చేత రకరకాల పేర్లతో ప్రశ్నలు రాయించి సమాధానాలు రాసి పత్రికల్లో వేయిద్దాం."

"ఈ సలహా బాగుంది అలాగే వాస్తు భూషణం గారి సలహాలు పాటించి కోటీశ్వరుడి నయ్యాను, మాకు ఇలా కలిసొచ్చింది అంటూ రకరకాల ఫోటోలతో ఉత్తరాలు కూడా వేయిద్దాం. అవన్నీ ఏ మహారాష్ట్రవో, పంజాబ్‌వో మాత్రమే అయి ఉండాలి సుమా."

"అవసరమైతే నెలకు రెండు మూడు లక్షలైనా ఖర్చు పెడదాం. అదంతా జనం దగ్గర గుంజేదే గదా."

"ఇవాల్టి నుండీ మన పార్ట్‌నర్ షిప్ ఈ చాయ్‌తో ఆరంభం."

ఛీర్స్ అనుకున్నారిద్దరూ

ఇంతలో ఇద్దరు వ్యక్తులు వారి దగ్గరికి వచ్చారు. వారి చేతుల్లోని 'హారాల్లాంటి' వస్తువును చూసి వాస్తు భూషణం, వా.వి.చా. బిర్ర బిగుసుకు పోయారు.

-(ఇంకావుంది)

ఏప్రిల్ 20 షకీల్ బదాయూనీ వర్ధంతి సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



చిత్రం : గంగాజమునా
రచన : షకీల్ బదాయూనీ
సంగీతం : నౌషాద్
గానం : మహమ్మద్ రఫీ, బృందం
అభినయం : దిలీప్ కుమార్, వైజయంతి మాల, బృందం.

## 'నైన్ లడ్ జయ్ హైఁ'

లాగా గోరీ గుజరియా సే నేహా హమార్
హొయ్ గవా సారా చౌపట్ మోరా రోజ్‌గార్
ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ
నైన్ లడ్ జయ్ హైఁ, నైన్ లడ్ జయ్ హైఁతో మన్‌వా మా కసక్ హొయ్‌బే కరీ
ప్రేమ్‌కా చుటి హై పటాకా తో ధమక్ హొయ్‌బే కరీ ॥నైన్ లడ్ జయ్ హైఁ॥
రూప్ కో మన్ మా బసైబా తో బురా కా హొయ్ హై
రూప్‌కో మన్ మా బసైబా తో బురా కా హొయ్ హై
తోహు సే ప్రీత్ లగైబా తోహు సే ప్రీత్ లగైబా తో బురా కా హొయ్ హై
ప్రేమ్‌కీ నగరీ మా కుఛ్ హమ్‌రా భీ హక్ హొయ్‌బే కరీ
ప్రేమ్‌కీ నగరీ మా కుఛ్ హమ్‌రా భీ హక్ హొయ్‌బే కరీ ॥నైన్ లడ్ జయ్ హైఁ॥
హొయ్... హొయ్ గవా మన్ మా మోరే తిర్ ఛీ నజర్ కా హల్లహ
హొయ్ గవా మన్ మా మోరే తిర్‌ఛీ నజర్‌కా హల్లా
గోరీ కో దేఖే బినా(2) నిందియా న ఆవై హమ్‌కా
ఫాఁసీ లగీ హై తో కరజ్‌వా మా ఖటక్ హొయ్‌బే కరీ
ఫాఁసీ లగీ హై తో కరజ్‌వా మా ఖటక్ హొయ్‌బే కరీ ॥నైన్ లడ్ జయ్ హైఁ॥
ఆంఖ్ మిల్ జయ్ హై సజనియా సే తో నాచన్ లగీ హై
ఆంఖ్ మిల్ జయ్ హై సజనియా సే తో నాచన్ లగీ హై
ప్యార్‌కీ మీఠీ గజల్ (2) మన్‌వా భీ గావన్ లగీ హై
ఝూంజ్ బజీ హై తో కమరియా మా లటక్ హొయ్‌బే కరీ
ఝూంజ్ బజీ హై తో కమరియా మా లటక్ హొయ్‌బే కరీ ॥నైన్ లడ్ జయ్‌హైఁ॥
నైనా జబ్ లడి హై తో బైయ్యా మన్ మేఁ కసక్ హొమ్‌బే కరీ (3)
అరె... మన్ లే గయీ దేఖో బనియా రామా కైసా జాదూ డాల్‌కే
మన్ లే గయీ దేఖో బనియా రామా కైసా జాదూ డాల్‌కే
ఓ కైసా జాదూ డాల్‌కే రే కైసా టోనా మార్‌కే ॥మన్ లే గయీ॥

షకీల్ బదాయూనీ అందించిన సినీ సాహిత్యం ఎంత వైవిధ్య భరితమైనదో హిందీ సినీ సంగీత ప్రియులకు తెలిసినదే. ఒక్క 'గంగా జమ్‌నా' తీసుకుంటే 'ఇన్సాఫ కీ డగర్ పే' వంటి దేశభక్తిపూరిత ప్రబోధగీతం, 'నైన్ లడ్ జయ్ హైఁ' వంటి హుషారైన జానపద గీతం, 'దో హంసోం కా జోడా' వంటి విషాదభరిత విరహగీతం, 'ఢూంఢో ఢూండో రే సాజ్‌నా' వంటి అల్లరి ప్రేమ గీతం వ్రాసి తన రేంజ్ ఏమిటో చూపించారు. 1960నుంచి 1962దాకా వరుసగా ఫిలింఫేర్ అవార్డులు గెలుచుకుని తన సత్తా నిరూపించుకున్నారు. 'చౌదవీఁ కా చాంద్',ఘరానా, బీస్ సాల్ బాద్' చిత్రాలకు ఆయనకు ఈ మూడు అవార్డులు లభించాయి.



షకీల్‌ను పరిచయం చేసినది నౌషాద్. ఆ తరువాత నౌషాద్ సంగీతం అందించిన అధిక శాతం చిత్రాలకు షకీల్ పాటలు వ్రాశారు. వారి కాంబినేషన్‌లో 'ఆన్', 'ఆద్మీ' ,'బైజు బావ్‌రా, 'మొఘల్ -ఎ-ఆజమ్', 'మదర్ ఇండియా', 'మేలా', 'రామ్ ఔర్ శ్యామ్', 'గంగా జమునా', 'లీడర్', 'దిల్ దియా దర్ద్ లియా',' కోహినూర్ ', 'దులారీ', 'మేరే మెహబూబ్' వంటి చిత్రాల్లో ఆణిముత్యాల్లాంటి పాటలు వచ్చాయి.

'గంగా జమునా' చిత్రం గంగా, జమునా అనే ఇద్దరు సోదరులు కథ. ఈ చిత్రాన్ని దిలీప్‌కుమార్ నిర్మించారు. తనపై జరిగిన అన్యాయాలకు వ్యతిరేకంగా గంగా బందిపోటుగా మారితే, జమునా పోలీసు అధికారి అవుతాడు. చట్టానికి ఇరువైపులా జరిగే ఈ సంఘర్షణ తరువాత ఎన్నో చిత్రాలకు ప్రేరణ అయింది. ఈ చిత్రంలో నౌషాద్ సంగీతంలో ప్రఖ్యాత సంగీత దర్శకుడు, గాయకుడు హేమంత్ కుమార్ 'ఇన్సాఫ్ కీ డగర్ పే' పాట పాడటం ఓ విశేషం.

'నైన్ లడ్ జయ్ హై'పాట భోజ్‌పురి మాండలికంలో వ్రాసినది. చిత్రం అధిక భాగం ఇదే మాండలికంలో ఉండటం అప్పట్లో సాహసమే. చిత్రానికి తగ్గట్టు పాటలు ఉండటం షకీల్ ప్రతిభకు ఓ నిదర్శనం.

గోరీ అంటే తెల్లని అమ్మాయి. తెలుగులో ఎర్రని పిల్ల అంటాం కదా. అలాంటిదే ఇది. గుజరియా అంటే వయ్యారి. నేహా అంటే 'స్నేహ'కు వికృతి . నేస్తం, ప్రేమ అనే అర్థాలలో వాడతారు. 'చోరీ చోరీ' చిత్రంలోని 'రసిక్ బల్‌మా' పాటలో 'నేహ లగాకే హారీ'(ప్రేమించి ఓడిపోయాను) అనే లైన్ ఇక్కడ గుర్తు చేసుకోవచ్చు. సారా అంటే అంతా. చౌపట్ అంటే దివాలా తీయటం, మూలపడటం. రోజ్‌గార్ అంటే ఉద్యోగం, రోజువారీ పని. 'హమార్'(హమారా), 'హొయ్‌గవా'(హో గయా), 'మోరా'(మేరా) - ఇవన్నీ భోజ్‌పురి మాండలికంలోని మాటలు. నైన్ అంటే నయనాలు, కనులు.'లడ్ జయ్ హై' (లడ్ జాయేఁ ) అంటే కలుసుకోవటమే కానీ మాములుగా కలుసుకోవటం కాదు, చురుగ్గా కలుసుకోవటం. 'నైన్ లడ్ జయ్ హై' అనటంలో అంతర్లీనంగా అలజడి ఉంది. దాని భావం 'చూపులు చిక్కుబడటం' అని చెప్పుకోవచ్చు. మన్‌వా (మన్) అంటే మనసు. కసక్ అంటే తీయని బాధ, మెలిక. హొయ్‌బే కరీ'అంటే 'హువా కర్‌తా హై' లేదా 'హోతా హై అని. అంటే 'అవుతుంది' అని. 'చుటిహై' అంటే అంటుకోవటం. పటాకా అంటే టపాసు. ధమక్ అంటే పెద్ద శబ్దం.

**ఎర్రని ఒయారిపై నాకు వలపు పుట్టింది**
**నా రోజువారీ పనంతా మూలపడింది**
**ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ**
**సూపులు సిక్కుపడితే మనసులో ఓ మెలిక పడుతుంది**
**ప్రేమ టపాసే అంటుకుంటే బలేగా పేలుతుంది**

ఈ పాటకు ముందు సన్నివేశంలో నాయిక నాయకుడి తలపుల్లో ఉందని చూపించినా ఈ పాట నాయకుడు నాయికనుద్దేశించి మొదలు పెట్టడు. సాయంత్రం వేళల్లో కష్టజీవులు అలసట తీర్చుకోవడానికి ఒకచోట చేరుకున్నప్పుడు పాడుకునే సందర్భంలోనే ఈ పాట వస్తుంది. అందమైన చినదానిపై ప్రేమ పుడితే ఆమె తలపుల్లో అన్నీ మరచిపోతాడు అబ్బాయి. ఏ పనీ చేసుకోలేడు. అధిక శాతం ప్రేమగీతాలు నేపథ్యంలో అబ్బాయిగారికి పనేమీ (అతని దృష్టిలో) ఉండదు కాబట్టి అతను పని మానేసి కూచున్నా కవులు, శ్రోతలు పట్టించుకోరు. కానీ జనపదులకు రెక్కాడనిదే డొక్కాడదు. కాబట్టి ఈ జానపదగీతంలో వారి పని గురించి ప్రస్తావించి దాని ప్రాముఖ్యతను చెప్పకనే చెప్పారు షకీల్. అమ్మాయితో చూపు చిక్కుపడితే గుండెలో మెలిక పడుతుంది. 'గుండె గొంతులో కొట్టాడుతాది' అన్నట్టు చెప్పలేక, చెప్పకుండా ఉండలేక తెలియని బాధ ఏదో కలుగుతుంది. గుండెలో ప్రేమ రాజుకోగానే పెద్ద పేలుడు జరిగినట్టు గుండె వేగంగా కొట్టుకుంటుంది. జనపదులకు తమ భావాలు తమకు తెలిసిన విధంగానే చెప్పటం అలవాటు కాబట్టి గుండె శబ్దాన్ని టపాసుల శబ్దంతో పోల్చటం సహజంగా అనిపిస్తుంది.

రూప్ అంటే అందమైన రూపం. బసైబా (బసావ్ఁ) అంటే నిలుపుకోవటం. బురా అంటే చెడు, తప్పు. 'తోహు సే' (తుమ్హీ సే) అంటే నీతోనే అని. ప్రీత్ అంటే ప్రేమ. 'ప్రేమ్ కీ నగరీ' అంటే ప్రేమనగరు. హక్ అంటే హక్కు.

**అందాన్ని మదిలో దాచుకుంటే తప్పేముంది**
**నీ పైనే ప్రేమ పెట్టుకుంటే తప్పేముంది**
**ప్రేమ నగరులో నాక్కూడా చోటు ఉండే ఉంటుంది.**

'ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ ఎ జాయ్ ఫరెవర్' అన్నారు. తెలుగులో 'అందమె ఆనందం' అన్నారు. అందాన్ని ఆరాధిస్తే తప్పులేదని చెప్పిన ఈ మాటల సారమే ఇక్కడ సులువైన మాటల్లో చెప్పారు. 'నీ అందాన్ని మదిలో దాచుకుంటాను. నీ మీదే ప్రేమ పెంచుకుంటాను. ఇందులో తప్పేముంది? ప్రేమనగరుపై అందరికీ హక్కుంటుంది. నా హక్కు ఎవరూ కాదనలేరు' అని ధైర్యంగా అంటున్నాడతను.

'తిర్‌ఛీ నజర్' అంటే వాలుచూపు. హల్లా అంటే గొడవ. 'దేఖే బినా' అంటే చూడకుండా. నిందియా (నీంద్) అంటే నిదుర. ఆవై (ఆయే), హమ్‌కా (హమేఁ) అనేవి మాండలికంలోని మాటలు. ఫాసీ అంటే ఉరి, ఉచ్చు. కరజ్‌వా (కలెజా ) అంటే గుండె. ఖటక్‌నా అంటే గుచ్చుకోవటం.

**వాలుచూపు రేపింది నా మదిలో గొడవ**
**ఆ పిల్లను సూడకుంటే నాకురాదు నిదుర**
**ఉచ్చుబిగుసుకుంటే గుండెలో ఏదో గుచ్చుకుంటుంది**

వాలు చూపులలో ఓ విధమైన అంగీకారం ఉంటుంది. అది చూస్తే నిజమో కాదో ఓ పట్టాన తెలియదు. దానితో మదిలో గొడవ మొదలవుతుంది. అమ్మాయిని చూడకుండా అబ్బాయికి ఏమీ తోచదు. ఇక్కడ కొంచెం ఘాటుగా ప్రేమ ఉచ్చు బిగుసుకుంటే గుండెలో బాధ కలుగుతుందని చెప్పారు.

సజనియా(సజనీ) అంటే ప్రియురాలు. 'నాచన్ లగీ హై' (నాచ్‌నే లగీ హై) అంటే నాట్యం చేస్తోంది అని. 'మీఠీ గజల్' అంటే తీయని గేయం. 'గావన్ లగీహై' (గానే లగీ హై) అంటే పాడుతోంది. ఝూంజ్ అంటే బిందెలు. కమరియా (కమర్) అంటే నడుము. లటక్ అంటే కదలిక.

**చినదానితో కనులు కలవగానే ఆడుతోంది సూడు**
**మనసు కూడా తీయని పదం పాడుతోంది సూడు**
**అందెల సవ్వడికి నడుము కదిలింది సూడు'**

చినదానితో కనులు కలవగానే అబ్బాయి మనసు ఆడుతుంది. అతను పాడినట్టుగానే అతని మనసు కూడా తీయని పదాలు పాడుతుంది. ఆమె అందెల సవ్వడికి అతని నడుము కదిలింది. మొత్తానికి అతని మనసూ ఆడుతోంది, అతనూ ఆడుతున్నాడు. అతనూ పాడుతున్నాడు, అతని మనసూ పాడుతోంది.

బనియా అంటే పరదేశి. జాదు అంటే మాయ. టోనా అంటే మంత్రం.

**సూపులు సిక్కుపడితే బాబూ మదిలో మెలిక పడుతుంది**
**మది దోచింది పరదేశి సూడు ఏదో మాయ సేసి**
**ఏదో మాయ సేసి, ఏదో మంత్రమేసి'**

నాయికను చూడగానే నాయకుడికి తాను మనసు పారేసుకున్నానని ఇప్పుడు అర్థమయింది. ఆమె ఏదో మాయ చేసి, మంత్రమేసి తన మది దోచిందని అంటున్నాడు. ఇక్కడ అమ్మాయిని పరదేశి అని అన్నారు. ఆమె నిజానికి పరదేశి కాకపోయినా అతని మనసుకు పరదేశియే. మొదట్లో 'మన్ మా కసక్ హొయ్ బే కరీ' అని ఇక్కడ 'మన్ మేఁ కసక్ హొయ్‌బే కరీ' అనటంతో ఈ రెండు విధాలుగానూ వారి భాష ఉంటుందని కూడా తెలుస్తుంది.

రఫీ పాడిన పాటల్లో ఈ పాటకు ప్రత్యేక స్థానముంది. జానపద రీతిలో హుషారుగా , అక్కడక్కడా తనదైన టచ్‌తో పాడారు. ముఖ్యంగా రెండవ చరణంలో 'హల్లా' అనే పదాన్ని మొదట 'హల్లహ' అనటంలో 'హ' శబ్దంలోని హాయిని అద్భుతంగా పలికించారు. ఈ పాటలో ఇంకో విశేషం ఏమిటంటే మూడో చరణం అయ్యేవరకూ కోరస్ ఉండదు. నాయకుడి పాటంతా విని అతనితో ఏకీభవిస్తున్నట్టు చివర్లో కోరస్ గాయకులు పాడతారు. అతని మీద నాయిక ఏదో మాయ చేసిందని వారికి అర్థమయింది.

'నైన్ లడ్ జయ్ హై' 'తిర్ ఛీ నజర్' 'ఆంఖ్ మిల్ జయ్ హై' అంటూ కనుల భాషను వివిధ రకాలుగా చెబుతూ అద్భుతమైన జానపద గీతాన్ని అందించారు షకీల్ బదాయూనీ.

గానం : హేమంత్ కుమార్, బృందం

## 'ఇన్సాఫ్ కీ డగర్ పే'

**ఇన్సాఫ్ కీ డగర్ పే బచ్చోం దిఖావో చల్‌కే**
**యే దేశ్ హైం తుమ్హారా, నేతా తుమ్హీ హో కల్ కే ॥ఇన్సాఫ్॥**
**దునియా కే రంజ్ సహ్‌నా ఔర్ కుఛ్ న ముంహ్ సే కెహనా ॥2॥**
**సచ్చాయియోం కే బల్ పే ఆగే కో బఢ్‌తే రహ్‌నా ॥2॥**
**రఖ్‌దోగే ఏక్ దిన్ తుమ్ సంసార్ కో బదల్ కే ॥2॥ ॥ఇన్సాఫ్॥**
**అప్‌నే హో యా పరాయే సబ్‌కే లియే హో న్యాయ్ ॥2॥**
**దేఖో కదమ్ తుమ్హారా హర్‌గిజ్ న డగ్ మగాయే ॥2॥**
**రస్తే బడే కఠిన్ హైం, చల్‌నా సంభల్ సంభల్‌కే ॥2॥ ॥ఇన్సాఫ్॥**
**ఇన్సానియత్ కే సర్ పే ఇజ్జత్ కా తాజ్ రఖ్‌నా ॥2॥**
**తన్ మన్ కీ భేంట్ దేకర్ భారత్ కీ లాజ్ రఖ్‌నా ॥2॥**
**జీవన్ నయా మిలేగా అంతిమ్ చితా మేం జల్‌కే ॥2॥ ॥ఇన్సాఫ్॥**

నాయకుడి తమ్ముడు చిన్నప్పుడు స్కూలులో ఉండగా మాష్టారు వారికి ఎలా నడుచుకోవాలో చెప్పేపాట 'ఇన్సాఫ్ కీ డగర్ పే'. నేటికి ఈ పాటలోని విషయాలు పిల్లలకే కాదు, పెద్దలకూ చెప్పాల్సినవే.

ఇన్సాఫ్ అంటే న్యాయం. డగర్ అంటే బాట. బచ్చే అంటే పిల్లలు. నేతా అంటే నేతలు.

**న్యాయపు బాటలో నడిచి చూపండి పిల్లలూ**
**మీదే ఈ దేశము, మీరే రేపటి నేతలు**

న్యాయంగా వర్తిస్తూ పిల్లలు పెరిగితే దేశం బాగుంటుందనే ఆశతో మాష్టారు పాడుతున్నారు. రేపు దేశాన్ని నడిపించే నేతలు వారే కాబట్టి దేశం ధర్మపథాన నడుస్తుంది.

'దునియా కే రంజ్' అంటే లోకం పోకడలు. 'సచ్చాయియాం' అంటే నిజాయితీ. 'ఆగే కో బఢ్‌తే రహ్‌నా' అంటే ముందుకు పదండి అని. సంసార్ అంటే ప్రపంచం. బదల్‌నా అంటే మార్చటం.

**లోకం పోకడ సైపండి మాటాడకుండా**
**అడుగు ముందుకేయండి నిజాయితీగా**
**ఒకరోజు మీరు ఈ ప్రపంచాన్నే మార్చేస్తారు.**

లోకం తీరు చూసి నిరాశ చెందకుండా నిజాయితీగా ముందుకు సాగితే ఒకరోజు వారే ప్రపంచాన్ని మార్చేస్తారు. కానీ ఇప్పటికీ అవినీతి, బంధుప్రీతి, ధనకాంక్ష ఉన్నాయంటే లోకం తీరు ప్రతి తరాన్నీ మార్చేస్తోందని అనిపిస్తుంది.

అప్‌నే అంటే తనవారు. పరాయే అంటే పరులు. కదమ్ అంటే అడుగులు. హర్‌గిజ్ అంటే ఎట్టి పరిస్థితుల్లోనూ అని. డగ్‌మగానా అంటే తడబడటం. రస్తే అంటే దారులు. సంభల్‌కే జాగ్రత్తగా అని.

**తన, పర భేదం లేక అందరికీ న్యాయం చేయాలి**
**మీ అడుగులు ఎప్పటికీ తడబడకుండా ఉండాలి**
**ఒడిదుడుకుల దారి ఇది, బహుజాగ్రత్తగా నడవాలి**

అందరినీ సమదృష్టితో చూసి తనవారు,పరులు అనే తేడా చూపకుండా అందరికీ న్యాయం చేయాలి. ఎటువంటి ప్రలోభాలకు లొంగకుండా ముందుకు సాగాలి. ధర్మపథంలో ఎన్నో అడ్డంకులు వస్తాయి. చాలా జాగ్రత్తగా వాటిని దాటుకుంటూ నడవాలి.

ఇన్‌సానియత్ అంటే మానవత్వం. ఇజ్జత్ అంటే గౌరవం. తాజ్ అంటే కిరీటం. భేంట్ అంటే కానుక, అర్పణ. లాజ్ అంటే పరువు. అంతిమ్ అంటే చివరిది. చితా అంటే చితి. జల్‌నా అంటే కాలటం.

'మానవత్వానికి గౌరవం ఇవ్వాలి, పట్టం కట్టాలి. భారతదేశం కోసం తనువూ మనసూ అర్పించటానికి సిద్ధం కావాలి. దేశాన్ని రక్షించటానికి ప్రాణాలు అర్పించాలి. ఎన్నో త్యాగాలు చేయాలి. అప్పుడు మరణించినా భారతీయుల హృదయాల్లో జీవించే ఉంటారు. 'చివరి చితి' అనటంలో



ఎన్నో మంటల్లోంచి నడవాలనే హెచ్చరిక ఉంది.

**దేశంలో ఎన్నికలు జరుగుతున్న ఈ తరుణంలో మనం నిజాయితీపరులను, బంధుప్రీతి లేనివారిని, మానవత్వం గల వారిని ఎన్నుకోవాలి. దేశం పురోగమించటానికి మనవంతు కృషి చేయాలి. మనం కూడా ధర్మపథంలో నడవాలి. భావిభారతపౌరులకు ధర్మం విలువ తెలుపాలి. నేతలు కూడా సొంతలాభం మానుకుని ప్రజాసంక్షేమానికి పాటుపడాలి. ప్రజలు కూడా మనకెందుకులే అనుకోకుండా దేశప్రగతికి తమవంతు కృషిచేయాలి. అందుకోసం ఈ పాటను అర్థంచేసుకుని ఆస్వాదించడంతో ఆగకుండా ఆచరణలో కూడా ప్రతిఫలింపచేసుకోవడం సముచితం, సమయోచితం కూడా!!**

(పైన వివరించినవే కాక ఈపాటకు సంబంధించి మరో రెండు ప్రత్యేకతలున్నాయి. తరువాతి రోజుల్లో నాట్య తారగా ప్రసిద్ధి చెందిన అరుణా ఇరాని ఈ పాటలో బాల తారగా కనిపించటం మొదటిదయితే, ఈ పాట ఇంటర్‌లూడ్స్‌లో వినిపించే ఆలాపనలు, వయొలిన్ బిట్స్ -మన తెలుగు దర్శకుడు తిలక్ తీసిన 'ఉయ్యాల-జంపాల' చిత్రంలో 'అందాలరాముడు ఇందీవర శ్యాముడు' పాటకు ఇంటర్‌లూడ్స్‌గా సంగీత దర్శకుడు పెండ్యాల వాడుకోవడం రెండవది.)

**- పి.వి.సత్యనారాయణ రాజు**

రచన: చంద్రబోస్ **(1)** రచన: సునీత, టిప్పు

ఆ: బంతి కావాలా? బాలు కావాలా?
మెంతికూరలాంటి పిల్ల చెంతకొచ్చిచేరుకుంటే
బంతెందుకు? బాలెందుకు?
ఏదేదో అడగరాదూ.....ఇవ్వనన్నానా
అ: ర్యాలీ రావులపాడు రేలంగి సంతలోన ॥2॥
నిప్పకోడి తెచ్చినానె ...నిప్పకోడి తెచ్చినానె
పెట్టియ్యవే పిల్లా పెట్టియ్యవే
పెట్టియ్యవే ఇగురు పెట్టియ్యవే
ఆ: ఓరోరి బుల్లోడా వయ్యారి బుల్లోడా
వగలమారి బుల్లోడా వాల్తేరు బుల్లోడా
అంతగాను అడుగుతుంటే పెట్టీయ్యనా
అటక మీద పాత ట్రంకు పెట్టీయ్యనా
ట్రంకు పెట్టీయనా...
అ: కర్నూలు టౌనులోన కంసాలి కొట్టులోన ॥2॥
పట్టగొలుసు తెచ్చినానె.... పట్ట గొలుసు తెచ్చినానె
కాలియ్యవే పిల్లా కాలియ్యవే
కాలియ్యవే ...నీ కుడి కాలియ్యవే
ఆ: ఓరోరి బుల్లోడా ఒయ్యారి బుల్లోడా ....
వగలమారి బుల్లోడా వాల్తేరు బుల్లోడా
యింటికెళ్లినాక ఫోను కాలివ్వనా
యింటికెళ్లినాక ఫోను కాలివ్వనా...ఫోను కాలివ్వనా
అ: మంత్రిగారి కోటాలోన మన ఇద్దరి పేరుమీన ॥2॥
రైలు టిక్కెటు తెచ్చినానె ........రైలు టికెటు తెచ్చినానె
చుట్టియ్యవే ....పిల్లా చుట్టియ్యవే
చుట్టియ్యవే..బిస్తరు చుట్టియ్యవే
ఆ: ఓరోరి బుల్లోడా...వయ్యారి బుల్లోడా...
వగలమారి బుల్లోడా వాల్తేరు బుల్లోడా
పట్టుపట్టి అడుగుతుంటే చుట్టివ్వనా
అంటు పెట్టుకుంటే గంట చుట్టివ్వనా...
గంట చుట్టివ్వనా
అడిగింది అందుకోక అందేది అడగలేక ॥2॥
నీరుగారి పోయినావు-నీరుగారిపోయినావు
చారెయ్యనా పిలగా చారెయ్యనా
చారెయ్యనా ఉలవ చారెయ్యనా
అ: ఓసోసి బుల్లె మ్మ వయ్యారి బుల్లెమ్మా
నంగనాచి బుల్లెమ్మ నాంచారి బుల్లెమ్మ
చిలిపి చిందులాటలోన చారెయ్యవే
ఏక్, దో, తీన్, చారెయ్యవే ..చారు...కాచెయ్యవే
అ: షామీరూ పేటలోన షావుకారు షాపులోన ॥2॥
నోటు బుక్కు తెచ్చినానె, నోటుబుక్కు తెచ్చినానె
రాసియ్యవే ..పిల్లా రాసియ్యవే
రాసియ్యవే ...అందం రాసియ్యవే
ఆ: ఓరోరి బుల్లోడా వయ్యారి బుల్లోడా...
వగలమారి బుల్లోడా వైజాగు బుల్లోడా
పొత్తుకోరి చేరుకుంటే రాసియ్యనా
నెత్తిమీద మంచినూనె రాసియ్యనా నూనె రాసియ్యనా
మాటల పోటీలోన మీది మీది ఆటలోన ॥2॥
పిల్లతోటి ఓడినావు పిల్లతోటి ఓడినావు
తీసెయ్యరో పిలగా తీసెయ్యరో
తీసెయ్యరో మీసం తీసెయ్యరో
అ: ఓసోసి బుల్లెమ్మ..వయ్యారి బుల్లెమ్మ
రవ్వలాంటి బుల్లెమ్మ రాంగ్‌రూటు బుల్లెమ్మ
మీసకట్టు ముద్దులాటకడ్డం అంటూ
చెప్పలేక చెప్పినావే తీసెయ్‌మంటూ......
మీసం తీసెయ్‌మంటూ..

రచన: సిరివెన్నెల **(2)** గానం : చిత్ర, టిప్పు

అ: అరెరెరెరె ఎట్టాగో వున్నాది ఓలమ్మి..ఏటేటో అవుతోంది చిన్నమ్మీ
ఎట్టాగో వున్నాది ఓలమ్మి..ఏటేటో అవుతోంది చిన్నమ్మీ
ఆ: అరెరెరెరె అట్టాగే వుంటాది ఓరబ్బీ..ఏటేటో అవుతాది చిన్నబ్బీ
అట్టాగే వుంటాది ఓరబ్బీ..ఏటేటో అవుతాది చిన్నబ్బీ
అ: ఎండల్లో చలెక్కుతోంది గుండెల్లో కలుక్కుమంది
నువ్వట్టా నరాలు మెలేసి నడుస్తు వస్తుంటే
ఆ: సిగ్గంతా చెడేట్టువుంది చిక్కుల్లో పడేట్టువుంది
చూపుల్తో అటొచ్చి ఇటొచ్చి అతుక్కుపోతుంటే
అ: కొంపలు ముంచకు దుంప తెగ
ఆ: కోకకు పెంచకు కొత్త సెగ
అ: గమ్మత్తుగ మత్తెక్కించే వేళ...
నువ్వు హీటెక్కిపోతుంటే ఓలమ్మీ.....
పైటెక్కడుంటుందే చిన్నమ్మీ ॥నువ్వు హీటెక్కి॥
ఆ: అరెరెరెరె....అట్టాగే వుంటాది ఓరబ్బీ ఏటేటో అవుతాది చిన్నబ్బీ
కళ్లల్లో అదేమి కైపో నడకల్లో అదేమి ఊపో
నిలువెల్లా తెగించి తెగించి ఎగబడి పోతుంటే
అ: ఒంపుల్లో అదేమి నునుపో సొంపుల్లో అదేమి మెరుపో
వాటంగా వయస్సు వలేసి తికతిక పెడుతుంటే
ఆ: తూలకు తూలకు తిమ్మిరిగా
అ: తుళ్లకు తుళ్లకు తుంటరిగా
ఆ: ఒళ్లంతా గల్లంతై పోయేలా
అ: జడవూపి...నడు(వూపి నిగనిగల నిధులు చూపి
నువ్వు వీరంగం వేస్తుంటే ఓలమ్మీ ఊరంత ఊగిందే చిన్నమ్మీ.
వీరంగం వేస్తుంటే ఓలమ్మీ ఊరంత ఊగిందే చిన్నమ్మీ ॥అరెరెరెరె..ఎట్టాగో॥

రచన: చంద్రబోస్ **(3)** గానం : శ్రేయాఘోషల్, టిప్పు

అ: ఇంత దూరమొచ్చాక సిగ్గెందుకూ
ఈడు రగులుకున్నాక అగ్గెందుకూ ॥ఇంత॥
ఆ: అంతదాక వచ్చాక అడ్డెందుకూ
లోతులోన మునిగాక ఒడ్డెందుకు
అ: కరుసు పెట్టనపుడు సొమ్మెందుకూ
ఆ: సరస మాడనప్పుడు సొగసెందుకూ...
అ: గుడుగుడు గుడుగుడుగుడు గుంచం
అడుగుడు అడుగుడు గుడు లంచం
ఆ: గుడుగుడు గుడుగుడుగుడు గుంచం
చెడుగుడు చెడుగుడు గుడు ఛమ్ ఛమ్...
అ: కంటిలోని నలుసు తీయమన్నావు
నలుసుతీసి చెంప నలపమన్నావు
ఆ: చెంప గిల్లి ఆగలేను అన్నావు
పెదవి పండు ముద్దు పిండుకున్నావు
అ: పెదవి నుండి మెడలోకి చేరుకున్నాక
మెడలోని గొలుసుతోటి ఆడుకున్నాకా
ఆ: గుండెలో జారుకుని గుట్టునే గుంజుకుని
అంతలో పుంజుకుని అదునుచూసి అదుపుదాటితే
అ: గుడుగుడు గుడుగుడుగుడు గుంచం
జరుగుడు జరుగుడు గుడు కొంచం
ఆ: గుడుగుడు గుడుగుడుగుడు గుంచం
విరుగుడు విరుగుడు గుడు మంచం ॥ఇంత॥
అ: కాలిలోని ముల్లు తియ్యమన్నావు
ముల్లుతీసి మువ్వ ముట్టమన్నావు
ఆ: మువ్వముట్టి ముందుకెళ్లి పోయావు
చీర అంచు పట్టి పైకి పాకావు
అ: చీరలోని మూరలోన చిక్కుకున్నాక
దారి తెన్ను ఏదినాకు చిక్కుకున్నాక
ఆ: చెంగులే దులుపుకుని నిన్ను చేపట్టుకుని
చీరలా చుట్టుకుని చివరి వరకు కథలు నడిపితే..
అ: గుడుగుడు గుడుగుడుగుడు గుంచం
పెరుగుడు పెరుగుడు గుడు పైత్యం
ఆ: గుడుగుడు గుడుగుడుగుడు గుంచం
తరికిట తరికిట కిట తఝమ్... ॥ఇంత॥

**రచన: చంద్రబోస్** (4) **గానం : యం.యం. కీరవాణి,సునీత**

అ: చీకటితో వెలుగే చెప్పెను నేనున్నానని
ఓటమితో గెలుపే చెప్పెను నేనున్నానని
నేనున్నానని నీకేంకాదనీ నిన్నటి రాతనీ మార్చేస్తాననీ
తగిలే రాళ్లని పునాది చేసి ఎదగాలనీ
తరిమే వాళ్లని హితులుగ తలచి ముందుకెళ్లాలనీ....
కన్నుల నీటిని కలల సాగుకై వాడుకోవాలనీ
కాల్చే నిప్పని ప్రమిదగ మలచి కాంతి పంచాలనీ
గుండెతో ధైర్యం చెప్పెను చూపుతో మార్గం చెప్పెను
అడుగుతో గమ్యం చెప్పెను నేనున్నాననీ........
నేనున్నాననీ నీకేంకాదనీ, నిన్నటిరాతనీ మార్చేస్తాననీ
అ: ఎవ్వరు లేని ఒంటరి జీవికి తోడు దొరికిందనీ
ఆ: అందరూవున్నా అప్పుడు నువ్వే చేరువయ్యావనీ
అ: జన్మకు ఎరుగని అనురాగాన్ని పంచుతున్నాననీ
ఆ: జన్మలు చాలని అనుబంధాన్ని పెంచుతున్నాననీ
అ: శ్వాసతో శ్వాసే చెప్పెను మనసుతో మనసే చెప్పెను
ఆ: ప్రశ్నతో బదులే చెప్పెను నేనున్నాననీ
అ: నేనున్నాననీ...నీకేంకాదని, నిన్నటిరాతనీ మార్చేస్తాననీ,,,,
ఆ: చీకటితో వెలుగే చెప్పెను నేనున్నానని
అ: ఓటమితో గెలుపే చెప్పెను నేనున్నానని
ఇ: నేనున్నాననీ నీకేం కాదనీ...నిన్నటి రాతనీ మార్చేస్తాననీ....

**రచన: సిరివెన్నెల** (5) **గానం : చిత్ర**

వేణుమాధవా....వేణుమాధవా....
ఏ శ్వాసలో చేరితే గాలి గాంధర్వమౌతున్నదో
ఏ శ్వాసలో చేరితే గాలి గాంధర్వమౌతున్నదో
ఏ మోవిపై వాలితే మౌనమే మంత్రమౌతున్నదో
ఆ శ్వాసలో నే లీనమై ఆ మోవిపై నే మౌనమై
నినుచేరనీ మాధవా ॥ఏ శ్వాసలో॥
మునులకు తెలియని జపములు జరిపినదా - మురళీసఖీ
వెనుకటి బ్రతుకున చేసిన పుణ్యమిదా
తనువును నిలువున తొలిచిన గాయములే - తన జన్మకీ
తరగని వరముల సిరులని తలచినదా
కృష్ణా నిన్నుచేరిందీ...అష్టాక్షరిగ మారిందీ
ఎలా ఇంత పెన్నిధీ వెదురు తాను పొందింది
వేణుమాధవా నీ సన్నిధీ..... ॥ఏ శ్వాసలో॥
చల్లని నీ చిరునవ్వులు కనపడక - కనుపాపకీ
నలువైపుల నడిరాతిరి ఎదురవదా
అల్లన నీ అడుగులసడి వినపడక -హృదయానికీ
అలజడితో అణువణువూ తడబడదా
ఆ(..........................................................
నువ్వే నడుపు పాదమిది నువ్వేమీటు నాదమిది
నివాళిగా నామది నివేదించు నిమిషమిది ..
వేణుమాధవా నీ సన్నిధీ...

| | |
|---|---|
| గాగ్గరి గరి సరి | గగగపాప్ప గగగదాస్స |
| గాగ్గ రీరి సరి | గగగ సాస్స దసరి సరిస |
| గపద సాస్స | రిగరి సరిస |
| దప గరి సరీ | దసరీ |
| గ గ ద ప దా | గదప సగరీ |
| గ ప ద స దా | పగప దసరీ |
| ధా పా గా రీ గా | సరిగ పగరీ |
| | సద |
| దపద సాస్స | ప ద ప స ద స |
| దపద సాస్స | ప ద ప స ద స |
| దపద రీర్రి | పదప రిసరి |
| దపద రీర్రి | పదప రిసరి |
| దసరి గరి సరీ | పద సరి గరి సద |
| గరి స... రీదా... రి..... | పదస గదప రిదస |
| గారి సరిగా రిస దప | సరిగ పద సరిగా |

ఆ..ఆ...ఆ....
రాధికా హృదయ రాగాంజలీ
నీ పాదముల వ్రాలు కుసుమాంజలీ
ఈ గీతాంజలీ...

**రచన: చంద్రబోస్** (6) **గానం : శ్రేయాఘోషల్, ఆర్నబ్ చక్రవర్తి**

అ: నూజివీడు కెళ్లినా న్యూజిలాండు కెళ్లినా
ముద్దుకున్న టేస్టు మారిపోవునా
ఆ: ఆరుబైట కూడినా పడకటింట కూడినా ఆరు ఒకటి ఏడుకాక పోవునా
అ: ప్యారు చేసినా లవ్వు చేసినా ప్యారుకాక లవ్వుకాక కాదలే చేసినా
ప్రేమల్లో పిచ్చ మారునా కుర్రవయస్సుల్లో కచ్చతీరునా ॥2॥
అ: ఎడమకన్ను కొట్టినా...కుడికన్ను కొట్టినా ... కళ్లలోని కోరికే మారునా
అ: విస్తరేసి పెట్టినా పళ్లెమేసి పెట్టినా వంటలోని ఘాటు మారిపోవునా...
వూరే మారినా ..ఊపు మారునా
ఆ: వస్త్రం మారినా ...వరస మారునా....
అ: సెల్లుమారు ఇల్లుమారు పిల్లదాని ఒళ్లుమారు గజ్జెల్లో ఘల్లు మారునా...
ఆ: నా....
అ: జంటప్రేమల్లో జిల్లు మారునా
ఆ: నా...నా....
అ: గజ్జెల్లో ఘల్లు మారునా..జంట ప్రేమల్లో జిల్లు మారునా.. ॥నూజి॥
అ: తేనెతోటి తుడిచినా నేతితోటి తుడిచినా కోకపిల్ల ఆకలే తీరునా
ఆ: కీచులాటలాడినా కిస్సులాటలాడినా రాతిరేళ యాతనే - తీరునా
అందం యిచ్చినా ఆశ తీరునా
అ: భాగం పంచినా బాధ తీరునా
ఆ: లక్కుతీరు కిక్కుతీరు పెక్కుసార్లు తిక్కతీరు
ఆటల్లో అలుపుతీరునా గోటిగాయాల్లో సలుపుతీరునా ॥నూజి॥

**రచన: సిరివెన్నెల** (7) **గానం : శ్రేయాఘోషల్, కె.కె.**

ఆ: వేసంకాలం వెన్నెల్లాగా వానల్లో వాగుల్లాగ వయసు ఎవరికోసం
తోం ధిరి..తోం ధిరి...తోంధిరి ధిరి ధిరి ధిరి ధిరి తోంధిరి
శీతాకాలం ఎండల్లాగ సంక్రాంతి పండగలాగ సొగసు ఎవరికోసం
తోంధిరి తోంధిరి...తోంధిరి ధిరి ధిరి ధిరి ధిరి తోంధిరి
ఓరోరి అందగాడా నన్నేలు మన్మథుడా...
నీకోసం నీకోసం నీకో...సం ॥2॥
అ: నీ సిగ్గుల వాకిట్లో నా ముద్దుల ముగ్గేసి
నే పండుగ చేసి సందడివేళ ఆకూ వక్కా సున్నం
నీ కోసం నీ కోసం నీకో... సం ॥2॥
ఆ: గుండె చాటుగా ఉండనందిక ఇన్నినాళ్లు దాచుకున్న కోరికా
ఉన్నపాటుగా ఆడపుట్టుకా కట్టుబాటు దాటలేదుగా
అ: కన్నె వేడుకా విన్నవించగా అందుబాటులోనె ఉన్నానుగా
తీగచాటుగా, మూగపాటగా ఆగిపోకే రాగమాలికా
ఆ: నిలువెల్ల నీ జతలోన చిగురించు లతనైరానా
అ: కొనగోటి కొంటెతనాన నిను మీటనా చెలివీణా
ఆ: అమ్మమ్మో అబ్బబ్బో ఆ ముచ్చట తీరంగా నీ మెళ్లో హారంగా
నా రేకులు విచ్చేసోకులు తెచ్చి అందిస్తున్నా
మొత్తం నీకోసం నీకోసం నీకో....సం ॥2॥
అ: సిగ్గుపోరికా నెగ్గలేవుగా ఏడుమల్లెలెత్తు సుకుమారమా
సాయమీయకా మోయలేవుగా లేత సోయగాల భారమా
ఆ: కౌగిలింతగా స్వాగతించగా కోరుకున్న కొంగు బంగారమా
తాళి బొట్టుగా కాలిమెట్టెగా చేరుకోవ ప్రేమ తీరమా
అ: మునిపంటి ముద్దరకానా చిగురంటి పెదవులపైనా
ఆ: మురిపాల మువ్వను కానా దొరగారి నవ్వులలోన
అ: నిద్దర్లో పొద్దుల్లో నీ వద్దకు నేనొచ్చి ఆ హద్దులు దాటించి
నువ్వొద్దనలేని పద్ధతిలోన ముద్దులెన్నో తెచ్చా
నీ కోసం నీ కోసం నీకో....సం ॥2॥ ॥వేసం॥

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




## తారాగణం

నాగార్జున, శ్రియ,
ఆర్తి అగర్వాల్, సుధ,
శివపార్వతి, డాలీ,
నిహారిక, ముఖేష్‌రుషి,
తనికెళ్ళ భరణి,
బ్రహ్మానందం, సునీల్,
ధర్మవరపు సుబ్రహ్మణ్యం,
శివారెడ్డి, అల్లరి రవి,
హేమసుందర్,
నాయుడు గోపి,
సుబ్బరాజు, అనంత్,
హనుమంతు,
నూతన్‌కుమార్, జెన్నీ,
మాస్టర్ ఆనందవర్ధన్,
బేబీ అభినయ,
బేబీ శ్రీవిభ

## సాంకేతిక నిపుణులు

కథ
భూపతిరాజా
కథా విస్తరణ, మాటలు
పరుచూరి బ్రదర్స్
పాటలు
సిరివెన్నెల సీతారామశాస్త్రి,
చంద్రబోస్
సంగీతం
యం.యం.కీరవాణి
ఫోటోగ్రఫీ
శివకుమార్
ఎడిటింగ్
మార్తాండ్ కె.వెంకటేష్
ఆర్ట్
శ్రీనివాసరాజు
ఫైట్స్
విజయ్
నృత్యాలు
లారెన్స్
రాజుసుందరం
అశోక్‌రాజా
మేకప్
చంద్ర
కాస్ట్యూమ్స్
శేఖర్
స్టిల్స్
శ్రీనివాస్
పి.ఆర్.ఓ.
ఎల్.వేణుగోపాల్
పబ్లిసిటీ
కృష్ణ డిజిటల్స్
ప్రొడక్షన్ మేనేజర్స్
గోరు శ్రీనివాస్, కుమార్
ప్రొడక్షన్స్ ఎగ్జిక్యూటివ్స్
బి.శాయినాథ్,
ఎం.వి.బుచ్చిరాజు
అసిస్టెంట్ డైరెక్టర్స్
అశోక్, ఆనంద్
అసోసియేట్ డైరెక్టర్స్
డి.శ్రీనివాస్
వి.ధర్మక్షేత్ర
కో-డైరెక్టర్స్
వి.నాగేశ్వరరావు
సురేష్‌కోట
నిర్వహణ
కె.చెంచురెడ్డి
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్
అక్కినేని వెంకటరత్నం
నిర్మాత
డి.శివప్రసాదరెడ్డి
స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
వి.యన్.ఆదిత్య


డి.శివప్రసాద్‌రెడ్డి


వి.యన్.ఆదిత్య


యం.యం.కీరవాణి


సీతారామశాస్త్రి


చంద్రబోస్



# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## చిరంజీవి చిత్తూరు నాగయ్య

# పాల్ ముని ఆఫ్ ఇండియా

తెలుగువారి తెరవేల్పు పద్మశ్రీ ఉప్పలదడియం నాగయ్య శతజయంతి సంవత్సరమిది. మూడు దశాబ్దాల పాటు తెలుగు వెండితెరకు బంగారు వెలుగులు, విలువలు తెచ్చిన మహానటుడు,గాయకుడు, దర్శకుడు,సంగీత దర్శకుడు, రచయిత, నిర్మాత ఆయన. భారతీయ చలన చిత్ర నటులలో ప్రథమ పంక్తిలో నిలిచిన కళాకారుడు. ప్రపంచ నటనా ప్రమాణాలను అధిగమించి శిఖరాయమానుడైన ఇటాలియన్ మహానటుడు పాల్ మునీ, జర్మన్ నటి గ్రేటాగార్బోల స్థాయికెదిగిన నాగయ్యగారికి 'పాల్ మునీ ఆఫ్ ఇండియా' అనే బిరుదు అన్వర్థనామమై మిగిలింది.

ప్రస్తుతం ఓట్లాటల్లో కొట్టు మిట్టాడుతున్న ప్రభుత్వానికి, పార్టీలకు నాగయ్య శతజయంతి జరిపే విజ్ఞత, యోగ్యత లేకపోయినా ప్రజాపరంగా జరుగుతున్న ఈ ఉత్సవానికి రసహృదయులే అప్పులూ, బంధువులు, కార్యకర్తలు!

తెలుగు సినిమా తొలి కథానాయకుడు, సకలకళావల్లభుడు, సంగీత కళాకోవిదుడు, మహానటుడు, రచయిత, గాయకుడు, నిర్మాత,దర్శకుడు, సాటిలేని 'తనపోతన మనవేమన' అలనాటి తెలుగువారి తెరవేల్పు పద్మశ్రీ చిత్తూరు వి. నాగయ్య.

ఆయన పుట్టింది 1904లో. ఆంధ్ర నాటక రంగస్థలం మీద, తెలుగు తెరమీద ఆయన వెలిగింది గత శతాబ్దంలో - 'షష్టివత్సర కీర్తి మాన్' అని ఆయనను అభినందించారు మాజీ రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్. 'నటయోగి నాదయోగి' అయిన నాగయ్యగారితో మహాగాయని శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి హీరోయిన్‌గా నటించారు 'మీరా' చిత్రంలో. ఆయన పట్ల దక్షిణ హిందూస్థానంలో భగవంతుడనే భావం ప్రబలివుండేది. ఆయన తెలుగు చిత్రాలకు అంతరాష్ట్రీయంగా అద్వితీయమైన చెలామణీ వుండేది.

ఆయన నటనా ప్రభావంతో ముమ్మిడివరం బాలయోగి అవతరించాడు. బెంగుళూరులో శ్రీనివాసఅయ్యంగార్ యావదాస్తినీ బృందావనంగా మార్చి నాగయ్యగారికి అంకితం చేశారు. భారత ప్రభుత్వం మొట్టమొదటసారి ప్రకటించిన పద్మశ్రీలలో తెలుగువాడు నాగయ్యగారు. మద్రాసులోని 'వాణీ మహల్' నాగయ్యగారి సృష్టి. అది శ్రీ త్యాగబ్రహ్మ గాన సభగా ఆయన ప్రారంభించిన సంస్థ.

నటన అంటే ప్రవర్తన అనీ restraint -అంటే సంయమనం - అనీ ఆయన ప్రతిపాదన. అలాగే త్యాగయ్యగారిది మనోధర్మ సంగీతమని ఆయన సిద్ధాంతీకరించారు. అలాగే ప్రవర్తించారు, పాడారు.

1935-55 మధ్యదశకాలలో నాగయ్య మన ఏకైక హీరో ! గిరి, రామానుజాచారి వగైరాలు నారాయణరావుతో సహా ఎందరున్నా 'హీరో' అంటే నాగయ్యగారే! ఆయనలాగ నవ్వడానికి, నడవడానికి,లైనెయ్యడానికి, లవ్ చేయడానికి, భగ్నప్రేమికుడుగా కృంగిపోవడానికి, ప్రేమలో నిమగ్నుడై పాటలు పాడుకోవడానికి.... అన్నిటికీ మించి మహాభక్తుడై ఈశ్వరవాదిగా కదలడానికి, మెదలడానికి నాటి యువతకు నాగయ్యగారే గురి, గురుపీఠం. పాటలు పాడడంలో ఆయన గాత్ర ధర్మాన్ని అనుసరించి 'మిమిక్రీ' పాటలు పాడడం ఆనాటి సభాకార్యక్రమాలకు ప్రధాన ఆకర్షణగావుండేది.

పోతన చిత్రంలో ఆయన పాడిన 'నన్ను విడచి కదలకురా', 'పావనగుణ రామాహరే' వినిపించని సభాస్థలిగాని,పెళ్ళిపందిరిగాని వుండేది కాదు. గాయకుడుగా, సంగీత దర్శకుడుగా నాగయ్యగారి సమ్మోహనశక్తి అటువంటిది. ఇక 'హాయిసఖీ' వంటి ప్రణయగీతాలు, 'అదిగదిగో గగన సీమ' వంటి భావగీతాలు,'రావేరావే బంగరు పాపా' వంటి సంసార గీతాలు,'గృహమే కదా స్వర్గసీమ' వంటి ఆర్ద్ర మధురగీతాలు , 'కల్లుమానండోయ్' వంటి ప్రబోధగీతాలు, 'బాలా బాలా నీకు పసుపు కుంకుమ జన్మహక్కు కాదా బాలా' వంటి సంస్కరణాత్మక గీతాలు పాడి, తన బాణీలో జనం చేత పాడించుకున్న 'మ్యూజిక్ స్టార్' నాగయ్యగారు.

ఇతర సంగీత దర్శకుల బాణీలలో పాడినా నాగయ్యగారి ముద్ర ప్రస్ఫుటంగా కాన వచ్చేది. 'సంఘం' (ఏ.వి.యమ్)'తాయ్ ఉళ్లమ్' (మోడరన్ థియేటర్స్) ఆర్. సుదర్శనం, సుసర్ల దక్షిణామూర్తి స్వర కల్పనలలో ఆయన పాడిన గీతాలు ప్రత్యేకత కలిగి వుంటాయి. 'జాలిగుండెయేలేదా', 'జాతిభేదం నమసిపోదా' (మా గోపీ, సంఘం)పాటలు రింగుమంటూ వినిపించే ఆయన ఆర్ద్రహృదయధ్వనికి ప్రతిధ్వనులు.

నవరస నటనా ధురీణుడైన నాగయ్య భక్తిరసంలో ప్రజా బాహుళ్యాన్ని ముంచి తేల్చి వారి పాలిట అవతార పురుషుడుగా ఎదిగిపోయారు. భక్తి రసగంగలో ప్రేక్షకులు ఓలలాడి భౌతిక వాదానికి, ఐహిక జీవనానికి దూరం పాటించిన సందర్భాలు ఎన్నో! ఆయన నటించిన త్యాగయ్య చూస్తున్న సినిమాహాళ్ళలో కన్నీరు కాలువలు కట్టేదని ప్రతీతి. పోతన, త్యాగయ్య, గోరాకుంభార్, రామదాసు పాత్రలలో భక్తినీ, వేమనలో శృంగార వైరాగ్యాలనీ, బీదలపాట్లు, సంఘం, మా గోపీ, నవజీవనం, గృహలక్ష్మి, నాయిల్లు వగైరా చిత్రాలలో మమతనీ, మానవత్వాన్ని ప్రతిబింబించే సామాజిక స్పృహతో కూడిన పాత్రలనీ ఆయన అత్యంత సమర్థంగా పోషించారు. అలాగే రొమాంటిక్ హీరోగా దేవత, స్వర్గసీమ, భాగ్యలక్ష్మి వగైరా చిత్రాలు మరపురాని కళాఖండాలు.

నాగయ్యగారు నటుడుగా అందుకున్న అనితర సాధ్యమైన ప్రమాణాలకు 'ఫిల్మిండియా' పత్రికా సంపాదకుడు, జ్ఞాని, తత్వవేత్త, విమర్శకుడు శ్రీబాబూరావుపటేల్ ముగ్ధుడై 1945లో బొంబాయ్ మరాఠా మందిర్‌లో అఖండ సన్మానం చేసి ఆయనకు 'పాల్ మునీ ఆఫ్ ఇండియా' అనే బిరుదును ఇచ్చి గౌరవించారు. అలనాటి సభలో పృథ్వీరాజ్‌కపూర్ నాగయ్య నటనకు జోహార్లు అర్పించి ఆయన సమకాలికుడనైనందుకు గర్వపడుతున్నానన్నారు. మహామహుల ప్రశంసలందుకున్న మహితాత్ముడు నాగయ్య. ఆయన కారణజన్ముడు.

కర్ణాటక సంగీత ప్రపంచంలో తారలుగా ప్రకాశించిన ఎం.కె. త్యాగరాజు భాగవతర్(సినీహీరో కూడా), మధురై మణిఅయ్యర్, జి.యన్. బాలసుబ్రహ్మణ్యం(సినీనటుడు కూడా), అరియక్కుడి రామానుజ అయ్యంగార్, డి.కె. పట్టమ్మాళ్ వంటి ప్రముఖులు నాగయ్యగారి గానం విని పరవశించి పరమ మిత్రులై పోయారు. పి.యు. చిన్నప్ప భాగవతర్ గానపద్ధతి ప్రబలంగా వున్న తమిళ చిత్ర సంగీత రంగంలో నాగయ్య ప్రభావంతో పెద్దమార్పు వచ్చింది. భావప్రధానమైన సజీవ పాత్రలకు సరిపోయే మనోధర్మ సంగీత మరుద్వీచికలు తమిళ సినీ రంగంలో హాయిగా వీచడానికి నాగయ్యగారే కారకులు. ఆ ప్రభావంతో జి.యన్.బి., డి.కె.జయరామన్, వసంతకుమారి వంటివారు కొత్తరీతిలో గీతికల గానానికి గళాలు విప్పారంటే అతిశయోక్తి కాదు.

నాగయ్యగారి అభిమానులుగా మారిన సంగీత ప్రవీణులెందరో తరువాత సంగీత దర్శకులైనారు. రామనాథన్, సి.ఆర్.సుబ్బరామన్, ఓగిరాల రామచంద్రరావు, అద్దేపల్లి రామారావు, గాలి పెంచల నరసింహారావు ప్రభృతులను వీరిలో ప్రముఖులుగా పేర్కొనవచ్చు. గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్య, బాలాంత్రపు రజనీకాంతారావు, చిత్తూరు సుబ్రమణ్య పిళ్ళెగార్ల స్వరకల్పనారీతులు నాగయ్యగారికి అభిమాన పాత్రమైనవి. 'స్వర్గసీమ' వగైరా చిత్రాలలో 'ఓహో హో పావురమా' వంటి పాటలు అందుకు సాక్ష్యమిస్తాయి. సాహిత్య సంగీత రచనలో సవ్యసాచిగా 'రజని' చేసిన బాణీల ప్రభావం ఆ చిత్రాల సంగీతంలో కానవస్తుంది.

మద్రాసునగరంలో తెలుగువారికి నాగయ్య నీడ చలివేంద్రంలా చల్లగా వుండేది. రేణుకా పిక్చర్స్ స్థాపించి చిత్ర నిర్మాణంతో పాటు దానధర్మాలకు, ఉచిత భోజనశాల నిర్వహణకు చేతికి ఎముక లేకుండా ఖర్చు చేసేవారు నాగయ్య! తిన్నవారెవరూ తిరిగి ఆయన మొహం చూడకుండా సహజమానవ నీతిని నిలబెట్టారు. నెం.11, వ్యాసరావువీధిలో నాగయ్యగారు చిరకాలం నివసించారు. యోగాశ్రమం ఏర్పాటు చేయాలని వడపళనిలో ఒక తోటకొని అదీ అమ్మివేశారు. తిరువైయారులో శ్రీత్యాగరాజ స్వామివారి సమాధి వద్ద ఏర్పడిన ఆలయానికి, నిత్యపూజలకు ఆర్థికంగా విరాళమిచ్చిన కొద్దిమంది తెలుగువారిలో నాగయ్య ఒకరు. తమిళ సినీ కళాకారులెందరి పేర్లో అక్కడ దాతల జాబితాలో కనిపిస్తాయి. ఒక్క నాగయ్యగారిని చూసి తెలుగు వారు ధన్యత చెందుతారు.

భుక్త రహిత తారక రాజయోగ మార్గంలో నాగయ్యగారు కొంతకాలం యోగసాధనకూడా చేశారు. శారీరక, మానసిక రుగ్మతలను, బాధలను ఆయన ఈ యోగ సాధనలో జయించారు. యోగి పుంగవులు శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారి శిష్యులుగా ఆయన ఆధ్యాత్మిక జీవనం గడిపారు. జీవితపు చరమదశలో రంగస్థలం మీద తన అభిమాన పాత్ర భక్తరామదాసు సినిమాగా తీయాలనే స్థిర సంకల్పంతో కొన్ని సంవత్సరాల పాటు దానిని నిర్మించి రామదాసు వలెనే మరిన్ని ఆర్థిక చిక్కులలో పడి అలమటించారు. ఆ చిత్రం చివరికి విడుదలై ఆయనకు కీర్తి కిరీటాన్ని సమర్పించింది. అందులో కబీర్‌గా గుమ్మడి చేసిన నటనకు నాగయ్యగారు పులకించి పోయేవారు. మహమ్మద్ రఫీ నుంచి ఎందరెందరో నాగయ్యగారి కోసం ఆ సినిమాలో ప్రతిఫలం కోరకుండా తమ విధిని నిర్వహించడం చలన చిత్ర చరిత్రలోనే అపూర్వం.

పోతన,వేమన, త్యాగయ్యవంటి పాత్రలు తప్ప తనకంటూ ఏమీ లేని నాగయ్య మనందరికీ వున్న తరగని నిధి. కళానిధి.

ఈ శతవసంత యశశ్శరీరుడికి,మధుర శారీరుడికి ఇదే నా భక్త్యంజలి.

**- వేటూరి సుందరరామమూర్తి**




# అభినయంలో ఆకట్టుకునే పాటగాడు

# మికాసింగ్

ప్రముఖ పంజాబీ పాప్ గాయకుడు, ఇటీవల వివాదాస్పదుడైన దలేర్ మెహిందీ సోదరుడిగా కంటే - తనని తానుగా గుర్తిస్తేనే ఎక్కువ ఆనందిస్తాడు మికాసింగ్. అన్న అడుగు జాడల్లో నడుస్తూ అనేక స్టేజ్ ప్రోగ్రామ్స్ ఇచ్చినా - తొలి ఆల్బమ్‌ను విడుదల చేసినప్పటి నుండి మికాసింగ్‌కి పంజాబీ పాప్ సింగర్స్‌లో ఓ ప్రత్యేకమైన గుర్తింపు వచ్చింది. పద్నాలుగు సంవత్సరాల వయసునుండీ స్టేజ్ పెర్ఫార్మెన్స్ ఇస్తున్నా తొలి ఆల్బమ్ 'సావన్ మే లగ్ గయే ఆగ్' విడుదల చేయడానికి ఎంతో శ్రమపడ్డాడు మికాసింగ్. అతని రెండవ ఆల్బమ్ 'ఇష్క్ బ్రాండీ'. ఈ రెండు ఆల్బమ్స్‌ను బిఎంజి క్రెసెండో సంస్థే విడుదల చేసింది.

## సంగీత నేపథ్యం

మికాసింగ్‌కు సంగీతం వారసత్వంగా వచ్చింది. అతని తండ్రి అజ్మీర్‌సింగ్ చందన్ శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకున్నారు. తల్లి జానపద గీతాలాపనలో దిట్ట. తల్లిదండ్రుల సంగీత నైపుణ్య నేపథ్యమే మికా మంచి గాయకుడు కావడానికి కారణమైంది. వారసత్వంగా అబ్బిన కళని నిర్లక్ష్యం చేయకుండా ఒంట బట్టించుకుని 'పూర్తి సమయవృత్తి'గా మార్చుకున్నాడతను. "సంగీతాన్ని నేనే కాదు మా ఐదుగురు అన్నలు నేర్చుకున్నారు. మా సోదరులందరికీ అమ్మా నాన్నే స్ఫూర్తి. దలేర్‌కీ కూడా అంతే. అందుకనే మేమందరం సంగీత ప్రపంచానికే పరిమితమై పోయాం'' అని చెబుతున్నాడు మికాసింగ్.

సంగీత స్వరాలతో ఇల్లు మారుమ్రోగుతుండటంతో ఎనిమిది సంవత్సరాల వయసులో తబలా నేర్చుకున్నాడు, పన్నెండు సంవత్సరాలకి హార్మోనియం... పద్నాలుగేళ్ళకి గిటార్... ఇప్పుడు తన పాటలకి తనే స్వరాలను సమకూర్చుకునే నైపుణ్యం పొందాడు మికా. "1991 నుండి 1998 వరకూ మా అన్నయ్య దలేర్ మెహిందీ బృందంతోనే నేను దేశ విదేశాలలోని ప్రదర్శనల్లో పాల్గొన్నాను. అయితే అన్నయ్య ఛాయలో వుంటే నాకు వ్యక్తిగతమైన గుర్తింపు రాదని భావించి 1998లో ఒంటరిగా - 'సావన్ మే లగ్గయే ఆగ్'ను విడుదల చేశాను. అప్పటి వరకూ అన్నతో వుండి - బయటికి వచ్చేసరికీ మా ఇద్దరి మధ్య స్పర్థలు తలెత్తాయని చాలామంది అనుకున్నారు. నిజానికి అటువంటిదేమిలేదు. ప్రజల దగ్గరకి చేరువ కావాలని నాకుగా నేను తీసుకున్న నిర్ణయం అది. మా మరో అన్నయ్య హర్జీత్ మెహందీ కూడా తర్వాత వేరే బృందాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఇలా ఎవరికి వారం స్వతంత్రంగా



### మికాసింగ్ స్వవిషయాలు

| | |
|---|---|
| పూర్తి పేరు | : అమ్రిక్ సింగ్ మికా |
| తల్లిదండ్రులు | : బల్‌బీర్‌కౌర్, అజ్మీర్‌సింగ్ చందన్ |
| పుట్టినతేదీ | : జూన్ 10, (బెంగాల్‌లోని దుర్గాపూర్‌లో) |
| సోదరులు | : 5గురు (అమర్‌జీత్, దలేర్, హర్‌జీత్, జోగీందర్, షంషేర్‌సింగ్ - మికా ఆరవవాడు) |
| మొదటి ఆల్బమ్ | : సావన్ మే లగ్ గయే ఆగ్ |
| విడుదల చేసిన సంస్థ | : బిఎంజి క్రెసెండో ప్రై.లి. |
| నైపుణ్యం | : గిటార్, కీబోర్డ్, తబలా, తన పాటలకి తనే సంగీతం సమకూర్చుకోవటం |

### ఇష్టాలు

| | |
|---|---|
| సంగీత దర్శకుడు | : ఆర్.డి.బర్మన్ |
| సినిమా | : షోలే |
| ప్రతి నాయకుడు | : అమ్జద్‌ఖాన్ |
| కథానాయిక | : ఐశ్వర్యారాయ్ |
| డాన్సర్ | : మైఖేల్‌జాక్సన్ |
| కాలక్షేపం | : కార్లు, రెస్లింగ్ |
| హిందీ హీరోలు | : ధర్మేంద్ర, అమితాబ్, ఫిరోజ్‌ఖాన్, కబీర్‌బేడీ |

పేరు తెచ్చుకుని - ఎప్పుడో ఒకప్పుడు అందరం కల్సి ఓ ఉమ్మడి ఆల్బమ్ తేవాలన్నది నా కోరిక. అది ఎప్పుడు నెరవేరుతుందో చూడాలి" అని అంటున్నాడు మికాసింగ్.

దలేర్ మెహందీకి వచ్చినంత కీర్తి (అపకీర్తి కూడా) ఎవరికీ రాలేదని చెబుతూ "ఇవాళ అన్నయ్య మా అందరికంటే ఉన్నతస్థాయిలో వున్నారు. అందుకు ఈర్ష్య పడటం లేదు. ఇప్పటికీ అన్నయ్య సలహాలు, సంప్రదింపులు నేను తీసుకుంటాను" అని చెప్పారు.

తన తొలి ఆల్బమ్ 'సావన్ మే లగ్ గయే ఆగ్', మలి ఆల్బమ్ 'ఇష్క్ బ్రాండీ' సక్సెస్‌లకి కారణం చెబుతూ "స్టేజ్‌షోలు ఓ రకంగా నా ఆల్బమ్స్ సక్సెస్‌కి కారణం అని చెప్పాలి. నా పాటలు ఆల్బమ్స్‌గా రాకముందే నేను వాటిని వేదికల మీద అభినయించే వాడిని. అందువల్ల అవి బాగా పాపులర్ అయ్యాయి. ఆ తర్వాత క్యాసెట్స్‌గా వచ్చేసరికీ అందరూ కొన్నారు. ఇలా ప్రజల సమక్షంలో పాటల్ని పాడి అభినయించటం వల్ల వారి స్పందన కూడా ఏ స్థాయిలో వుందో అర్థమైపోతుంది. దానికి తగ్గ మార్పులు చేర్పులు కూడా చేసుకోవచ్చు..." అంటూ అసలు కిటుకు చెప్పాడు మికాసింగ్.

డాన్సర్‌గా మైఖేల్ జాన్సన్‌ను, మ్యూజిక్ డైరెక్టర్‌గా ఆర్.డి.బర్మన్‌ని ఇష్టపడే మికా - తన



పాటల్ని తానే పాడి ఆడీ ప్రేక్షకుల్ని ఆకట్టుకోవటంలో ఆనందం వుందంటున్నాడు. నిజమైన పాప్‌కి తన పాటలే నిదర్శనం అని చెబుతూ "పాప్ అంటే నా దృష్టిలో ప్రేక్షకుల్ని డాన్స్ చేయించడమే. సంగీతం గురించి పెద్దగా తెలియని వ్యక్తి, గొప్ప గాత్రం లేని మనిషి, అద్భుతమైన సాహిత్య బలం లేకపోయినా - తన పాటతో, ప్రేక్షకుల్ని ఆడించాడంటే - అతనికంటే గొప్ప పాప్ సింగర్ ఇంకెవరు? జాక్సన్, మార్టిన్‌ల బాణీలకు జనం ఎందుకు డాన్స్ చేస్తున్నారు? రిక్కీ మార్టిన్ పాటల్ని మనలో ఎంతమంది అర్థం చేసుకోగలరు? అయినా మనం ఆ పాటల్ని అభిమానిస్తున్నాం - డాన్సులు చేస్తున్నాం - నా పాటల్లోనూ అలా డాన్స్ చేయించే సంగీతం వుంది" అని చెబుతున్నాడు.

ఇటీవలే మికాసింగ్ మూడవ ఆల్బమ్ 'దునాలీ - రైఫిల్' టిప్స్ ఇండస్ట్రీస్ ద్వారా విడుదలైంది. ఇందులో ఆరు పంజాబీ, నాలుగు హిందీ - మొత్తం పది పాటలున్నాయి. ఆరేళ్ళలో మూడే ఆల్బమ్స్ విడుదల చేయటం గురించి చెబుతూ "ఒక పాట పాడి - గొప్ప గుర్తింపు పొంది అంతర్థానం అవ్వాలని నేను అనుకోవటం లేదు. సంగీత ప్రియుల హృదయాలలో సుస్థిర స్థానం పొందాలన్నది నా కోరిక. అది మంచి గీతాలు అందివ్వటం ద్వారానే సాధ్యం. అందుకే కావలసినంత వ్యవధి తీసుకుని ఆల్బమ్స్ విడుదల చేస్తున్నా" అని అంటున్నాడు.

**- వి.అరుణ సత్యవతి**

# సరిగపదమని

**కూర్పు : టి.నవీన్, హైదరాబాద్**

**17**



**అడ్డం:-**

1. '.............పూవులో మూగకళ్ళ ఊసులో' (4)
3. '............ బిగువటరా బైరొర' భానుమతి పాట (4)
5. పిల్లలూ దేవుడూ చల్లనివారే .....కపట మెరుగని కరుణామయులే (2)
7. 'మల్లె...... వానా జల్లుల్లోనా తడిసిన ఆనందాన' వినోదం చిత్రంలోని గీతం (2)
8. '......నా పెళ్ళియంట' సావిత్రి అభినయించిన గీతం (2)
9. ....... ......... చీకటిలో మల్లెతోట వెనకలా మాపటేల కలుసుకో ' ఎల్.ఆర్.ఈశ్వరి పాట (3)
11. తెల్ల ..... కట్టుకున్న దెవరి కోసము మల్లెపూలు పెట్టుకున్న దెవరికోసము (2)
12. 'గోదారి.....పైన చిన్నారి చిలక వుంది చిలకమ్మ మనసులోన చిగురంత మొలక వుంది' (2)
13. 'ఓ రామ .......మెంతో రుచిరా' ఇద్దరుమిత్రులులో రమణారెడ్డి అభినయించిన గీతం (3)
15. 'జగమే మాయ బ్రతుకే మాయ' అనే పాటగల చిత్రంపేరులోని చివరి అక్షరాలు(2)
16.......నల్లని రాళ్లలో ఏకన్నులు దాగేనో ....బండల మాటున ఏ గుండెలు మోగెనో (1)
20.'లాలూదర్వాజా కాడా ......బోనాలు తెస్తానని తేకపోతివి ' విజయశాంతి అభినయించిన గీతం(3)
21. 'ఛాంగురే ........రాజా ఛాంగుఛాంగురే .......రాజా' జిక్కి పాడిన పాట (3)
23. 'మావయ్య అన్న...... మాయింట్లో ముద్దులకు పొద్దుపొడుపు' బాలకృష్ణ అభినయించిన గీతం(3)

**నిలువు:-**

1. '.......మీద కోపం నీ ముకానికే అందం నా బుంగ మూతి చందం నీ ముందరికాళ్ళ బంధం (2)
2.'....... ........ రైలు....... వేళకంటూ రాదులెండీ' కులశేఖర్ రచించిన గీతం (2)
3. 'కడవెత్తుకొచ్చింది కన్నె...... అది కనబడితే చాలు నాగుండె గుల్ల' ఆత్రేయ గీతం (2)
4. 'చెట్టులెక్కగలవా ఓ....... పుట్టలెక్కగలవా' చెంచులక్ష్మి చిత్రంలోని గీతం (4)
5. '.......మాయే మదిలో నామదిలో'(4)
6. చేతిలో చెయ్యేసి చెప్ప బావా చేసుకున్న.....లు చెరిగి పోవనీ మరచిపోనని' (2)
9. '...... వదలరా నిద్దుర .....వదలరా ' శ్రీకృష్ణ పాండవీయం లోని గీతం (2)
10. 'పగల రాణివి నీవే .......కాదను నేనే(3)
11. 'నిన్నాకుట్టేసినాది మొన్నాకుట్టేసినాది గండు......' (2)
14. 'మావూరు మదరాసు ........ రాందాసు' పద్మనాభం అభినయించి పాడిన గీతం (3)
17. 'కనులు తెరిచినా కనులు మూసినా ..... అగవేలా' దేవిశ్రీప్రసాద్ స్వరపరిచినగీతం (3)
18. కలికి చిలకల కొలికి మాకు మేనత్త కలవారి ........ కనకమాలక్ష్మి (3)
19. 'మముగన్న మాయమ్మ అలివేలు...... విభునికి మా మనవి వినిపించవమ్మ (2)
22. 'అహ ఏమి ......తినరా మైమరచి' వంకాయను వర్ణించే పాట (2)

పంపినవారి పేరు :.......................................................................

వయసు :........... వృత్తి:.......................................................

చిరునామా :.............................................................................

..................................................................................................

.......................................................ఫోన్:.............................

**పజిల్, కూపన్ 30-04-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తో సహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : కాదలిక్క నేరమిల్లై | ప్రేమించిచూడు |
| రచన | : కణ్ణదాసన్ | సి.నారాయణరెడ్డి |
| సంగీతం | : విశ్వనాథన్ - రామ్మూర్తి | మాస్టర్ వేణు |
| గానం | : కె.జె.ఏసుదాసు, సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి | బసవేశ్వర్, సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి |
| అభినయం | : రవిచంద్రన్, రాజశ్రీ, ముత్తురామన్, కాంచన | నాగేశ్వరరావు, రాజశ్రీ జగ్గయ్య, కాంచన |

'కాదలిక్క నేరమిల్లై' తమిళ చిత్రం విజయం సాధించడానికి ఆ చిత్రంలోని పాటలూ కారణాలే. పాటల రచయితగా కణ్ణదాసన్‌కూ సంగీత దర్శకులుగా విశ్వనాథన్ రామమూర్తి జంటకు ఎంతో పేరు తెచ్చిపెట్టిన చిత్రాలలో 'కాదలిక్క నేరమిల్లై' కూడా ఒకటి.

చిత్రంలోని ప్రేమజంటల ప్రేమ ముదిరి పాకాన పడడాన్ని సూచించడానికి దర్శకులు శ్రీధర్ పాటల సన్నివేశాలను ఎన్నుకొన్నారు. ప్రేమలో మునిగి తేలుతున్న ఆ జంటల మనసులను తెలిపేందుకు శ్రీధర్ ఎన్నుకొన్న పాట 'నెంజత్తై అళ్ళి కొంజం తా తా తా!'

తమిళ చిత్రంలోని ఈ పాటలో -కె.జె.ఏసుదాస్, సుశీల , ఎల్. ఆర్. ఈశ్వరి గళాలు వినిపిస్తాయి. అప్పుడప్పుడే మలయాళ చిత్రాలలో గాయకుడుగా నిలదొక్కుకొంటున్న ఏసుదాస్‌కు ఈ పాట మరింత గుర్తింపు తెచ్చింది. అయితే ఆ వెంటనే ఏసుదాస్‌కు తమిళ చిత్రాలలో పాడే అవకాశాలు అంతగా రాలేదు. మళ్లీ విశ్వనాథన్ 1974 తర్వాత ఏసుదాస్‌తో తమిళ చిత్ర గీతాలు పాడించడంతో - కొన్నేళ్ల పాటు ఏసుదాస్ తమిళ చిత్ర సంగీత ప్రపంచంలో తమ స్థానాన్ని పదిలం చేసుకున్నారు. మాట పట్టింపు ఏదో వచ్చి విశ్వనాథన్ ఆ తర్వాత ఏసుదాస్ చేత పాడించలేదని తమిళ చిత్ర ప్రముఖులు అంటూ ఉంటారు.

ఇక్కడ 'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలోని పాటను పరిశీలిద్దామా!

ఆమె : ఆ ఆ ఆ.....
నెంజత్తై అళ్ళి కొంజం తా తా తా
నీరోట్టం పోలె ఇంగే వా వా వా
నినైక్కుం పోళుదే ఇనైక్కుం కనియే
శిరిక్కుం శిలైయేవా ॥నెంజత్తై॥
అతను: ఎండ్రెండ్రుం సొందమిల్లైయో
ఎన్ నెంజం ఉన్నదిల్లైయో
ఒండ్రెండ్రు వంద దల్లవో
ఇన్నొండ్రు ఎంగు వరుమో
ఉడలిల్ నీయుం ఉయిరిల్ నానుం
పడరుం కొడియల్లవో... ఓ హోయ్.... హో హో హో.... ॥నెంజత్తై॥
ఆమె : ఆ హో హో హో.....లాలా లలా లలలా...
వాయెండ్రు శొల్లుం మున్నమే
సమ్మదం అంగు వరుమే
తాయెండ్రు కేట్కుం మున్నమే
తేనిదళ్ కొంజ వరుమే
మణక్కుం పూవిల్ సెళిక్కుం తేనై
శువైక్క తడైయుం ఉండో ఓహోయ్...ఓ ఓ.... ॥నెంజత్తై॥



**తమిళగీతంలోని ప్రేమజంటల ముచ్చటలు ఇవి:**

ఆమె : మనసును తీసి కాస్త ఇవ్వు ఇవ్వు ఇవ్వు
పారే నీటిలా (సెలయేరులా) ఇక్కడికి రా రా రా
తలచుకోగానే తియ్యగా ఉండే ఫలమా(పండా)
నవ్వే శిల్పమా రా ॥మనసును॥
అతను: ఎప్పటికీ సొంతమే కదా... నా మనసు నీదేకదా
ఒకటంటూ (ఒకటనుకొని) వచ్చిందికదా
ఇంకొకటి ఎక్కడ వస్తుందో
తనువులో నీవు ప్రాణంలో నేనూ
అల్లుకొన్న తీగలం కదా.... ॥మనసును॥
ఆమె : రమ్మంటూ చెప్పడానికి ముందే
(అంగీకారం) సమ్మతం అక్కడ వస్తుంది
ఇమ్మంటూ అడిగేముందే
తేనె పెదవి మురిపెమూడ వస్తుంది
తావులు చిమ్మే పువ్వులో స్రవించే తేనెను
రుచి చూడడానికి ఆటంకం ఉంటుందా.. ॥మనసును॥

తమిళంలో 'అళ్ళి' అనే పదానికి 'సేకరించి','పోగుచేసి' అని అర్థాలున్నాయి. ఈ పాటలో 'నెంజత్తై అళ్ళి' అంటే 'మనసును తీసి' అని చెప్పుకోవాలి. మనసును తీసి కాస్త ఇచ్చి, సెలయేరులాగా సాగిరావాలని ఆ ప్రేయసీ ప్రియులు పాడుకుంటున్నారు. వాళ్ళు పరస్పరం - మధుర ఫలాలు. నవ్వే శిల్పాలు.

తమది శాశ్వతమైన బంధమనే నాయకుడు తన మనసు నాయికకు అంకితమంటాడు. కణ్ణదాసన్ 'ఒండ్రెండ్రు వంద దల్లవో ఇన్నొండ్రు ఎంగు వరుమో' అని రాయడంలో కొంత తికమక ఉంది. తాము ఇద్దరూ వేర్వేరు కాదనీ ఒకటేననీ చెప్పే నాయకుడు 'ఇంకొకటి ఎక్కడ వస్తుందో' అనడం తమ ప్రేమ ఫలానికి సంబంధించినదని గ్రహించాలి. ఆ ప్రేమికుల తనువులో ప్రాణాలు తీగల్లా పెనవేసుకున్నాయట.

ఆ జంట ప్రేమ ఎంతగా ముదిరిందంటే రమ్మని చెప్పడానికీ ఇమ్మని అడగడానికి ముందే మురిపాలు అంగీకారాలు సిద్ధంగా ఉంటాయట. అందువల్ల ప్రేమ రసాస్వాదనకు ఆటంకం లేదట.

తమిళగీతంలోని ఈ మైకం 'ప్రేమించిచూడు' చిత్రంలోని 'అందాలె తొంగి చూసె' పాటలోనూ కనిపిస్తుంది. తమిళగీతం బాణీనే తెలుగుపాట

అనుసరించినా తెలుగుపాట వాణి వేరు. తెలుగు పాటకూ, తమిళగీతానికి సాహిత్యపరంగా పోలికలు లేవనే చెప్పాలి. ఇన్నేళ్ల తర్వాత కూడా కొత్తదనంతో పరిమళించడం ఈ తెలుగు పాట ప్రత్యేకత .

తెలుగుపాటలో వినిపించే పురుష కంఠం బసవేశ్వర్‌ది. (బసవేశ్వర్- ప్రసిద్ధ పండితులు 'శివశ్రీ' బండారు తమ్మయ్యగారి కుమారులు. చాలా సంవత్సరాలు 'ఆంధ్ర పత్రిక'లో పనిచేశారు. ఘంటసాల సంగీత దర్శకత్వంలో రూపొందించిన చివరిపాటను బసవేశ్వర్ పాడడం విశేషం)

తమిళ గీతం చివర పల్లవిని ఏసుదాస్, సుశీల పాడినా, తెలుగుపాట చివరమాత్రం పల్లవిని సుశీల ఒక్కరే పాడారు. తమిళగీతంలో చివర పల్లవిని పెంచినప్పుడు 'తా', 'వా' అనే మాటలు రెండేసిసార్లే వినిపించినా తెలుగు పాటలో మాత్రం 'హా', 'రా' అనే మాటలు మూడుసార్లు వినిపిస్తాయి.

'మత్తుగ నవ్వి' అనేచోట సుశీల గళంలో వినిపించే మాధుర్యం- ఆమె ప్రత్యేకత.

సిద్ధంగా ఉన్న సంగీతానికి తగ్గట్టు పాటలు రాయడమంటే మాటలు కాదు. అందులోనూ మరొకభాషలోని సినిమా పాటలో వినిపించిన అభిప్రాయాలను అనుసరించకుండా పాట రాయటం మరింత కష్టం. 'అందాలు తొంగి చూసి ఆనందం ఈల వేసిన' ఈ పాట స్వతంత్రమైనది. ఈ తెలుగు పాటను ఇంత సొగసుగా, నాజూకుగా రాసిన వారు డా॥ సి. నారాయణ రెడ్డి.

ప్రేమించి చూడు చిత్రంలోని పాట ఇది:

**ఆమె :** ఆహా హా...<br>
అందాలె తొంగి చూసె హా హా హా<br>
ఆనందం ఈలవేసే రా రా రా<br>
సొగసు విరిసె వయసు మెరిసె ఎగిసిపోదామా...॥అందాలె॥

**అతను:** నా చెంత సిగ్గులెందుకో<br>
నీ చేత నన్నే అందుకో<br>
లోలోని పొంగు చూసుకో<br>
నీలోనె నన్ను దాచుకో<br>
కనులు నీవి కలలు నావి<br>
కాదేమో సరిచూసుకో హొయ్ హొయ్ ॥అందాలె॥

**ఆమె :** హా హా హా....లా లాల లాల లా......

**ఆమె :** గుండెల్లో చూపు దించకు<br>
కళ్లల్లో కైపు పెంచకు<br>
నన్నింక కవ్వించకు<br>
నాజూకు తీగ వంచకు<br>
మత్తుగ నవ్వి మెత్తగ దువ్వి<br>
మనసు ఉడికించకు హొయ్... ॥అందాలె॥

- పి.ఎస్.గోపాలకృష్ణ





పిల్లల కోసం ప్రత్యేకం...

జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు లేతదనం మళ్లీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

చిత్ర పరిచయం 3

సమన్వయం
మంజీర

### జరిగిన కథ

జాన్ డూలిటిల్ చిన్నప్పుడు జంతువులభాష అర్థం చేసుకునేవాడు. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాడు. భార్య, కూతుళ్లు ఫామ్‌హౌస్‌కు వెళ్లిన ఓ రోజు హఠాత్తుగా ఆ శక్తి తిరిగివచ్చింది. దానితో ఖంగారువడ్డాడు. ఎవరికీ చెప్పలేదు. ఫామ్‌హౌస్‌కి చేరి రాత్రి నిద్రకు ఉపక్రమిస్తూంటే ఓ గుడ్లగూబ వచ్చి రెక్కలో గుచ్చుకున్న ముల్లముక్క తీసి పారేయమని కోరింది. తీసేశాడు. - (ఇక చదవండి)

పశుపక్ష్యాదుల భాష తెలియడం వల్లనే కదా తను గుడ్లగూబకు సాయం చేయగలిగాను అని జాన్ అనుకుంటూండగానే అతని భార్య నైటీ వేసుకుని బాల్కనీలోకి ప్రవేశించింది. సిటీ వాతావరణానికి దూరంగా ప్రకృతిమాత ఒడిలో ఉన్న ఫామ్‌హౌస్ వాతావరణం ఆమెను ఉత్తేజపరుస్తోంది. బాల్కనీలో నిలబడి అడవి అందాలను ఆస్వాదిస్తున్న భర్త దరిచేరింది. అతను గుడ్లగూబను చూస్తూండడం గమనించి "బాప్‌రే, గుడ్లగూబ" అంది.

నిద్రలోనుండి మేల్కొనవాడిలా జాన్ ఉలిక్కిపడి, "వెధవ గుడ్లగూబ, అరుపులూ గోలా. రా డియర్, లోపలికి పోయి పడుక్కుందాం." అన్నాడు, గుడ్లగూబ గురించి ఎక్కువగా మాట్లాడితే తన విషయాలన్నీ ఎక్కడ బయటపడతాయెానన్న భయం కొద్దీ.




కానీ ప్రస్తుతం ఆమె వేరే మూడ్‌లో ఉంది. ఆమె కంటికి లోకమంతా పచ్చగా, హాయిగా, ఆహ్లాదంగా అనిపిస్తోంది.

"ఛ, ఛ. అలా అంటావేమిటి? గుడ్లగూబ ఎంతో అందంగా ఉంది." అంది. 'బ్యూటిఫుల్ ఔల్' అని దానికో కితాబు ఇచ్చేసింది కూడా.

"అబ్బెబ్బే, అవన్నీ చాలా ప్రమాదకరమైనవి తెలుసా? రా లోపలకి పోదాం." అంటూ జాన్ ఆమెను తొందరపెట్టాడు. ఇంకాస్సేపు ఆగితే ఏ గద్దో వచ్చి పళ్లమధ్య ఇరుక్కున్న చేపముల్లు తీయమంటుందేమో!

"ప్రమాదం కాదూ, ఏమీ కాదు. హాయిగా ఇక్కడ కాస్సేపు వుందాం." అంటూ గారాలు కుడుస్తున్న భార్యను బలవంతంగా నెట్టుకుంటూ బెడ్‌రూమ్‌లోకి తీసుకొచ్చి బాల్కనీ తలుపు మూసేసి హమ్మయ్య అనుకున్నాడు.

అనుకున్నాడే కానీ మనసింకా కుదుటబడలేదు. ఏ మూలనుంచైనా ఎలకో, పిల్లో వచ్చి హలో అంటూ మూడ్ చెడగొడుతుందేమో తలుపులు బిడాయిస్తే మంచిదనుకున్నాడు.



"నేను వెళ్లి పిల్లలు పడుకున్నారో లేదో చూసి వస్తా" అని బయటకు వెళ్లబోయాడు.

"పడుక్కుని ఉంటారు లెద్దురూ, మీ చాదస్తం మీరూను" అని భార్య సుతారంగా విసుక్కుంటున్నా "నీకెందుకు, అయిదంటే అయిదు నిమిషాల్లో వచ్చేస్తా" అంటూ గుమ్మం దగ్గరకు పరిగెత్తాడు.

"త్వరగా వచ్చేస్తారుగా" అంది భార్య గోముగా.

"ఇదిగో" అంటూ జాన్ ఒక్క గెంతులో బయటకు వచ్చి చేసిన మొదటిపని కిచెన్‌లోకి వెళ్లి గడగడా నీళ్లు తాగడం. ఈ జంతువుల గోలతో అతని బుర్ర తిరిగిపోతోంది. మనసు కాస్త కుదుటబడాలంటే కాస్త సేదదీరాలి. కానీ ఇవన్నీ తెలియని భార్య తన ఆలోచనల్లో తనుంది. ఆమెకివన్నీ చెప్పడం ఎలా? నమ్మించడం ఎలా?

"పిలిచిన బిగువేలరా..
పరువాలేలక పరుగులేలరా..
పాలుతాగే వేళ నీళ్లేలరా.."

ఎవడ్రా తనను వెక్కిరిస్తూ పాడుతున్నది అని జాన్ తలతిప్పి చూశాడు. బోనులో గినీ పిగ్ తనని ఉడికిస్తూ డాన్సు కూడా చేస్తోంది. 'నోర్ముయ్' అనబోయేంతలో కిచెన్‌లో ఓ ముంగిస మాట చెవిన పడింది -



'ఆ చేపముక్క ఇలా పడేద్దూ, పుణ్యం ఉంటుంది." అని. సహచరిని రిక్వెస్టు చేస్తోంది కాబోలు.

'ఎవడ్రా నా గూట్లోంచి సబ్బుముక్క కొట్టుకొచ్చింది?" అంటూ నిద్రలేచి వచ్చిన కాకి కిటికీలో వాలి కాకిగోల చేస్తోంది.

ఇలా లోకంలో ఉన్న జంతుజాలమంతా తన కిచెన్‌లో సభ తీర్చి గోలగోల చేస్తూంటే జాన్‌కి మతిపోయినంత పనయింది. ఈ శబ్దాలు ఇంతకుముందు అతను విన్నవే. కానీ అర్థం కాకపోవడం ఇన్నాళ్లూ అవి బాధపెట్టలేదు. కానీ ఇప్పుడవి స్పష్టంగా అర్థమవుతున్నాయి. పదిమంది కలిసి ఒక్కసారిగా మాట్లాడితే ఎంత చికాకు పుడుతుందో అంత చికాకు వేసింది. మధ్యాహ్నం గార్డెన్ రెస్టారెంటులో ఇలాగ వినబడితేనే ఇక్కడకు పారిపోయి వచ్చాడు. ఇక్కడా ఇదే గోల! పారిపోక తప్పదు. వడివడిగా కారు వద్దకు నడిచాడు.

"జీవులన్నీ మట్టిలో పుట్టి మట్టిలో కలుస్తాయన్న సన్నాసి ఎవడ్రా, నా జీవితమంతా చెత్తలోనే గడుస్తోంది. చెత్తలో పుట్టుట, చెత్తలో గిట్టుట అనమను. ఒప్పుకుంటాను." అని ఫిలాసఫీస్తోంది చెత్తడబ్బాలో చెత్తను పళ్లతో కొరికిచూస్తున్న ఓ ముళ్లపంది.

"ఆ పంది దంతవేదాంతం వింటూ నా తోక తొక్కేశావు కదా మహనుభావా, నక్కతోక తొక్కితే ఏమైనా ఫలితం ఉంటుంది కానీ నా తోక తొక్కితే ఏముంది?" అని విసుక్కొంది కాళ్ల దగ్గరున్న గండుపిల్లి.

"చచ్చిచెడి తెచ్చుకున్న సబ్బుముక్క! నోటిదాకా వచ్చింది ఒంటిదాకా రాకుండా పోయింది. రెక్కలకష్టం అనుభవించడానికైనా పెట్టిపుట్టాలి." అంటూ వగస్తోంది వెతికి వేసారిన కాకి.



ఎగ్జిబిషన్‌లో భూతచక్రం ఎక్కినవాడిలా జాన్ బుర్ర గిరగిరా తిరిగింది. నడక పరుగువేగాన్ని అందుకుంది.

ఇతనికి తమ మాటలు అర్థమవుతాయని సడన్‌గా ఉప్పందిన ముంగిస కిచెన్‌లోంచి బయటకు గంతులేసుకుంటూ వచ్చింది. "ఇదిగో డాక్టర్, మా మాటలు నీ కర్థమవుతాయటగా! సిటీ కెళుతున్నావులా వుంది. రొయ్యలు పట్రా. చప్పుచప్పులు కాదు, కాస్త చూసి పట్టుకురా.' అని పురమాయించింది.

'పోయిన సబ్బు ఎలాగూ పోయింది కానీ బజార్లో కొత్తరకం సెంటు సబ్బు వచ్చిందట...''కాకి కూడా..

"ఛస్, వెధవగోల. పొండి, పొండి..నా జోలికి వచ్చారంటే చూస్కోండి.." అని తిట్టుకుంటూ జాన్ కారెక్కి స్టార్టు చేయబోయాడు. తనకు పిచ్చెక్కిపోయిందన్న నిర్ధారణకు వచ్చేశాడు. పరుగున డాక్టరు దగ్గరికి వెళ్లి అర్జంటుగా తలకాయ స్కాన్ చేయించుకోవాలన్న తహతహతో 'సిరికిం జెప్పడు..' స్టయిల్లో అతను బయల్దేరినా సిరి ఊరుకోలేదు కదా!



రెడీగా వుండు ఇదిగో వస్తున్నానని చెప్పి మాయమయిపోయిన మొగుడితీరుకు విస్తుపోతున్న ఆమె కారుశబ్దం విని బయటకు పరిగెట్టుకు వచ్చింది. "ఇదేమిటి..? ఎక్కడికి ప్రయాణం.?? అదీ ఇప్పుడా..???" అంటూ తెల్లబోతూ ప్రశ్నించింది.



జాన్ తబ్బిబ్బయ్యాడు. తడబడుతూ, "అర్జంటుగా సిటీ కెళ్లాలి..డాక్టరుగార్ని కలవాలి...అహ..కాదు, కాదు,...నేనే డాక్టర్నిగా..పేషంటుని కలవాలి...అంటే..కలవాలి అంటే వెళ్లి వెతుక్కోవడం కాదు...పేషంటు ఫోన్ చేసాడన్నమాట..ఇదిగో సెల్...సెల్‌లో ఫోన్ చేశాడన్నమాట..డాక్టర్ని కదా..పేషంటు ఫోన్ చేసినప్పుడు వెళ్లకపోతే పాపం.."

మారుమాట్లాడే అవకాశం భార్య కీయకుండా రయ్యిన కారు పోనిచ్చాడు. వెళ్తూ వెళ్తూ "సిటీకి వెళ్లాక ఫోన్ చేస్తాలే, ఖంగారు పడక" అంటూ అరిచాడు.



రణపట్టువేళ సడన్‌గా తనను వదిలి పారిపోతున్న మొగుణ్ని దులిపి పారేద్దామనుకుని వచ్చిన సతీమణి కారు లేపిన దుమ్ము దులుపుకుంటూ వెనక్కు మరలవలసివచ్చింది.

***

రాత్రి ఒంటిగంటవేళ. జాన్ కారు సిటీలిమిట్స్‌లోకి ప్రవేశించింది. సెల్ తీసి తన ఫ్రెండు డాక్టర్ శామ్‌కి ఫోన్ కొట్టాడు. అతని ప్రార్థనలు ఫలించి అవతలివాడు ఫోనెత్తాడు. "హలో శామ్, నేను డాక్టరు జాన్ డూలిటిల్‌ని. హౌ ఆర్యూ?" అన్నాడు.

"ఓ.. జాన్" అన్నాడు శామ్ ఆవులిస్తూ.

"హౌ నైస్ టాకింగ్ టూ యూ, ఏం చేస్తున్నావ్ బ్రదర్?" జాన్ అడిగాడు సంభాషణకు తెరదీస్తూ.

"రాత్రి ఒంటిగంటకు అందరూ ఏం చేస్తుంటారో అదే చేస్తున్నాను." అని జవాబు వచ్చింది కాస్త కసిగా.

"ఓ సారీ బాస్, అప్పుడే ఒంటిగంటయ్యిందా, డ్రైవ్ చేస్తూంటే టైము తెలియలేదు. ఇప్పుడే సిటీలోకి వచ్చాను. ఫోన్ చేసి చూద్దాం కలుస్తావేమో కలిసి మందు కొట్టడమో, లేదా క్యాట్ స్కాన్ తీయించుకోవడమో ఏదో ఒకటి చెయ్యొచ్చని.."

శామ్‌కు నిద్రమత్తు ఒక్కసారిగా దిగిపోయింది. మందు కొట్టడానికి, స్కాన్‌కి సంబంధం ఏమిటో తెలియక తికమకపడుతూనే, "ఈ వేళప్పుడు స్కానా..? పొద్దున్నదాకా ఆగలేవా..?"అన్నాడు.

తనెంత వింతగా ప్రవర్తిస్తున్నదీ జాన్‌కి ఒక్కసారిగా స్ఫురించి సిగ్గుపడ్డాడు. 'ఫర్వాలేదులే, పొద్దున చూసుకుందాం' అనబోతూ కారు కిటికీలోంచి బయటకు చూశాడు. పక్కన ఆగివున్న కారులో ఉన్న కుక్కపిల్ల 'ఐ లవ్ యూ' అంది. జాన్ ఉలిక్కిపడ్డాడు. శామ్ ఏమనుకున్నా ఫర్వాలేదన్న అభిప్రాయానికి వచ్చాడు. "సారీ బాస్, అర్జంటు వ్యవహారం. మీ క్లినిక్‌కు



వచ్చేస్తున్నా" అన్నాడు.



క్లినిక్ వద్ద దిగబోతూండగా ఇంత హడావుడి అవసరమా అనిపించింది జాన్‌కి. అంతలోనే బయట ఎలకలు పోట్లాడుకోవడం చెవిన పడింది. మనుష్యుల టైపులోనే అవి బండబూతులు తిట్టుకోవడం చూసి ఆశ్చర్యపోయి నిలబడిపోయాడు. దాంతో ఓ ఎలక్కి మండిపోయింది.

"ఏమిటయ్యా, అలా మిర్రి మిర్రి చూస్తున్నావ్?" అంది.

"నన్నా!?" అడిగాడు జాన్ అటూ ఇటూ కలయచూస్తూ.

"నిన్ను కాకపోతే..నీ తాతననుకున్నావా?"

జాన్‌కి ఒళ్లు మండిపోయింది. "అబ్బే ఏమీ లేదు, ఇక్కడ ఓ రెండు జిడ్డోడుతున్న ఎలుకలు కాట్లకుక్కల్లా పోట్లాడుకుంటూంటే ఇవి కుక్కలా, ఎలుకలా? అని ఆశ్చర్యపడుతూ చూస్తున్నా!" అన్నాడు వెటకారంగా.

"ఏంట్రా వాగుతున్నావ్, ఏం వేళాకోళంగా ఉందా? దగ్గరకి రా కరిచి చూపిస్తాను." అంటూ కయ్యానికి కాలుదువ్వుతూ మీసం దువ్వింది మూషికరాజసం.

"కరుస్తావా? అదిగో ఆ బల్బు వెలుగుతోంది చూశావా, దాన్ని పట్టుకొచ్చి నీకు పెట్టేస్తాను. ఎలుకమార్కు బల్బు అంటూ జనాలంతా కొనుక్కు పట్టుకుపోతారు. చిట్టెలుకలు చిట్టెలుకల్లా పడివుండాలి గానీ పందికొక్కుల్లా ప్రగల్భాలు పలక్కూడదు. నేను మనిషిని తెలుసా? నీ కంటె తెగబారెడున్న మనిషిని. ఒళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు" అంటూ వాటిని తిట్టిపోసి ఇటు తిరిగి చూసేసరికి కళ్లు నులుముకుంటున్న శామ్ కనబడ్డాడు.

తను మెలకువగా ఉన్నాడో, కలగంటున్నాడో శామ్‌కి తెలియలేదు. ఇటు చూస్తే జాన్ అరుస్తున్నాడు. అటుచూస్తే కిచకిచమంటున్న ఎలుకలు తప్ప ఎవరూ లేరు.

శామ్ కన్‌ఫ్యూజన్ చూసి కలవరపడుతూనే "నా మాట మన్నించి అర్ధరాత్రి వేళైనా క్లినిక్ తెరచినందుకు థాంక్స్.." అంటూ షేక్‌హాండ్ ఇచ్చాడు జాన్.



* * *

జాన్ బ్రెయిన్ స్కానింగ్ పూర్తయింది. "అంతా మామూలుగానే ఉందే" అన్నాడు శామ్.

"మామూలుగా ఉంటే అదృష్టవంతుణ్నన్నమాటే!" అన్నాడు జాన్.

"మరి జంతువుల మాటలెందుకు వినబడుతున్నట్టు!?" అన్నాడు శామ్ సాలోచనగా.

"అదే నాకూ తెలియటం లేదు. ఎక్కడో ఏదో తిరకాసుంది. నాకు అర్థమయినప్పుడు నీకు చెబుతానులే" అన్నాడు జాన్.

"అంటే..ఈ మధ్య నీకేమైనా డిప్రెషన్ కలిగించే సంఘటన ఏదైనా ఉందా?"

"అంత పెద్ద ఇదేమీ లేదులే. ఈ మధ్య ఓ కుక్క నా కారుకింద పడింది..."

"ఓ..అలా చెప్పు. నీ వల్ల నిష్కారణంగా కుక్క చచ్చిపోయిందన్న బాధతో, అపరాధభావనతో.."

"ఆగాగు..అదేమీ చావలేదు. పైగా వెళుతూ, వెళుతూ నన్ను శుంఠా అని తిట్టి మరీపోయింది."

"చాల్లే, నిన్ను శుంఠ అని వుండదు. కాస్త మొరిగి పోయి వుంటుంది."

"అంతేలే, అంతేలే.. అంతా నా భ్రమ అయివుంటుంది." అని ఊరుకున్నాడు జాన్.

* * *

తెల్లారింది. క్లినిక్‌లోంచి బయటకు వచ్చి భార్యకు ఫోన్ చేశాడు జాన్. రాత్రి తన వింతప్రవర్తన వల్ల కంగారుపడుతున్న భార్యకు అంతా బాగానే ఉందన్న హామీ ఇస్తూండగానే ఎవరో ఆశ్చర్యపడడం వినబడింది - "అరె,.. శుంఠగాడు!" అని.

తలెత్తి చూసిన జాన్‌కు ఆ రాత్రి తన కారుకింద పడి చావబోయిన కుక్క కనబడింది. చూడగానే ఎవరో పరిచితుడిని చూసిన ఫీలింగు కలిగింది. పాపం దాన్ని ఊరకుక్కల గోడౌన్‌కు తరలిస్తున్నారు. అయ్యో అనిపించింది. 'తీసుకెళ్లి కాల్చేస్తారో ఏమో రక్షిస్తే మంచిది కదా' అనుకున్నాడు.



ఆ వాన్ వెనక్కాలే కుక్కల గోడౌన్‌కు వెళ్లి వాళ్లతో మాట్లాడి దాన్ని బయటకు తీసుకొచ్చాడు. ఆ కుక్క, తనను పెంచుకోవడానికే జాన్ బయటకు తీసుకొచ్చాడని అనుకుంది పాపం.

"మీ పిల్లల గురించి నన్ను తీసుకెళుతున్నావు కదూ, వెరీగుడ్! నాకూ పిల్లలంటే ఇష్టం... పిల్లులంటే కాదనుకో." అని పేవ్‌మెంటుపై జాన్‌తో బాటు నడుచుకువస్తూ సొద చెప్పుకుపోతోంది.

"కాస్త నీ సొది ఆపు. మా పిల్లలకోసం కాదు, మరోటి కాదు. నీ మీద జాలి కొద్దీ బయటకు తీసుకొచ్చాను. నిన్ను పెంచుకునే ఉద్దేశ్యం నాకేమాత్రమూ లేదు. అది తెలుసుకో." అని చీదరించుకున్నాడు జాన్.

"అరే నా మాటలు నీ కర్థమవుతున్నాయే!" అంటూ తెల్లబోయింది కుక్కపిల్ల.

"నా బాధ అదే! నా మాటలు నీకెలా అర్థమవుతున్నాయాని. అసలు కుక్కలు మాట్లాడడ మేమిటి వింత కాకపోతే!"

"కుక్కలు మాట్లాడవా? మరి మొరగడం అంటే ఏమిటనుకుంటున్నావ్ బాబూ! చూస్తూంటే నువ్వో వింతమనిషిలా ఉన్నావ్. మీ ఇంటికి రావడం నాకు మంచిదే నంటావా!?" అంటూ సందేహపడింది కుక్కపిల్ల.

"మంచిదో కాదో నువ్వు వర్రీ కానక్కర్లేదు. నిన్నిక్కడే వదిలేస్తున్నాను. టాటా, గుడ్‌బై." అంటూ కారెక్కాడు జాన్.



కానీ ఆ కుక్క, వేషాలు నేర్చిన కుక్క. సడన్‌గా రోడ్డుమీద వాలిపోయి, నాలుగు దగ్గులు దగ్గి 'ఓహ్, అయిపోయింది, నా పనయిపోయింది. కళ్లు మూతలు పడుతున్నాయి. అంతా చీకటే' అంటూ తల వాల్చేసింది.

* * *

కాస్సేపటితర్వాత చూస్తే జాన్ పశువుల డాక్టరు దగ్గర ఉన్నాడు. అక్కడ అనేకమంది తమ పెంపుడు కుక్కల్ని తీసుకువచ్చి ఉన్నారు. రకరకాల కేసులు. ఒకావిడ కూచో కూచో అంటూ తన కుక్కకు గట్టిగా అరిచి చెబుతోంది. 'మా కుక్కకు చెవుడు' అని పక్కవాళ్లకు సంజాయిషీ ఇస్తోంది.

'నాకు చెవుడూ, గివుడూ ఏమీలేదు. చెవుడు నటించకపోతే ప్రతిక్షణం ఏదో ఒకటి ఆర్డరు వేస్తూనే ఉంటుందావిడ.' అని కుక్క అంటున్న మాటలు జాన్ చెవిన పడ్డాయి.

ఇంకో ఆయన జులాయిగా తిరిగే తన కుక్కకు పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయిద్దామని లాక్కుపోతున్నాడు. "నన్ను వదిలిపెట్టండి బాబోయ్, నేను మరో ఆడదాని వంక కన్నెత్తి చూడను. ఒట్టు" అని వెయ్యితప్పు కుంటోంది. మొత్తుకుంటోందే గానీ ఆ దారిన వెళ్తున్న ఆడకుక్కను చూసి ఒట్టును తీసి గట్టున పెట్టి "ఏం పిల్లదానా, ఈ మధ్య కనబట్టం లేదు." అని పలకరించి చూసింది.



చివరకి జాన్ వంతు వచ్చింది. కుక్కపిల్లను చూస్తూ "ఏమిటి ప్రాబ్లెమ్?" అని అడిగాడు కుక్కల డాక్టరు.

"పల్మనరీ ప్రాబ్లెమ్ అనుకుంటా. ఊపిరితిత్తులలో నీరు చేరివుంటుంది." అన్నాడు జాన్.

"ఓహ్, మీరు డాక్టరనుకుంటా"

"యా.."

"డాక్టర్లను గుర్తుపట్టడం చాలా ఈజీ. సరిగ్గా చూడకుండానే డయాగ్నైజ్ చేయడంలో డాక్టర్ల తర్వాతనే ఎవరైనా." అన్నాడు పశువుల డాక్టరు వెటకారంగా.

కుక్కను బల్లమీద పడుక్కోబెట్టి తన గొప్ప చెప్పుకోబోయాడు - 'మామూలు డాక్టర్ల కంటె మా వృత్తి చాలా కష్టం. పేషంట్లు తమ బాధ చెప్పుకోలేవుకదా పశువుల డాక్టర్లు వైద్యం ఎలా చేయగలరని అంటారు. కానీ నా విషయంలో నా పేషంట్లు అనేదేమిటో నాకు అక్షరక్షరం అర్థమవుతుంది."

"వాడి తలకాయ. నా వెనకకాళ్లు ఎత్తి పెట్టకురా, అసహ్యంగా ఉంది అని ఇందాకట్నుంచి చెబుతున్నా. వినిచావటం లేదు. నువ్వయినా చెప్పు." అని కుక్క జాన్‌కి చెప్పింది. జాన్ కుయ్‌కయ్ మనలేదు. కుక్కతో మాట్లాడుతున్నది గమనిస్తే ఈ డాక్టరు తనను పిచ్చాసుపత్రికి పంపిస్తాడన్న భయం అతనిది.



ఈలోగా కుక్కకు జ్వరం ఉందేమో చూడడానికి డాక్టరు థర్మామీటరు తీసి వెనుకనుంచి పెట్టబోయాడు. కుక్క కంగారుపడింది. జాన్‌ను బతిమాలుకుంది. "నాకు రోగం, గీగం ఏమీలేదు. ఇందాకా స్పృహ తప్పిపోయినట్టు చేసిందంతా యాక్టింగే! నన్ను వదిలిపెట్టమని చెప్పు ప్లీజ్!" అని.

ఈ లోగా జరగాల్సింది జరిగిపోయింది. థర్మామీటరు కుక్క శరీరంలోకి ప్రవేశించింది. "తీసేయమను. అది లోపలికి వెళ్లిపోతోంది." అని మొత్తుకుంది కుక్క. పోనీ తీసేద్దామని జాన్ చేయి అటు పోనిచ్చాడు. డాక్టరు ఖబడ్దార్ అన్నాడు. 'అది ముట్టుకోద్దు. కుక్క ఎందుకు మూలుగుతోందో నాకు తెలియాలి." అని స్టెత్ తీసుకుని పరీక్ష చేయబోయాడు.



'ఎందుకు మూలగడమేమిటి, వాడి బొంద. థర్మామీటరు అప్పుడే గుటకాయస్వాహా అయిపోయింది. వెర్రిముండావాడు వాడికి తెలిసి చావటం లేదు." అని గుర్రుమంది కుక్క.

పశువుల డాక్టరు కోప్పడతాడని భయపడుతూనే జాన్ "డాక్టర్, జస్ట్ నా ఊహ మాత్రమే ననుకోండి. థర్మామీటరు లోపలికి స్లిప్ అయిందేమో చూడండి.." అన్నాడు.

'నువ్వు నాకు చెప్పేపాటి వాడివా' అన్నట్లు అతనికేసి చూస్తూ డాక్టరు వెళ్లి చూశాడు. ఉత్తరక్షణం వెర్రిమొహం వేసి 'థర్మామీటరు జారిపోయింది' అని ఒప్పుకున్నాడు. 'దాన్ని బయటకు తీయాలంటే మూడు మార్గాలున్నాయి. మొదటిది మాన్యువల్... చేత్తో బయటకు తీయడం..."



కుక్కకు భయం పట్టుకుంది, ఏదో జరిగిపోతోందని. "ఏవంటాడు వాడు?" అని జాన్‌ను వాకబు చేసింది. తను కుక్కతో సంభాషిస్తున్నట్లు డాక్టరుకు తెలియకుండా నోటికి చేయి అడ్డుపెట్టుకుని 'మూడు మార్గాలున్నాయిట. మొదటిది చేత్తో.."

"..తీశేయ్."

"ఏవిటి? చేత్తోనా..? నేనా..?"

"అబ్బ నువ్వు కాదు. చేత్తో తీయడం ప్రపోజల్ తీసిపారేయమంటున్నాను... పాస్...నెక్స్ట్ ఆప్షన్..?"

ఈలోగా డాక్టరు జాన్‌కి చెప్పాడు - "రెండోది విరోచనాల మందివ్వడం..మూడోది..సర్జరీ." కుక్కపిల్ల రెండో ప్రతిపాదనకు ఓటేసింది.



ఆ అభ్యర్థనను జాన్ తన సూచనగా డాక్టరుకు అందించాడు. కానీ డాక్టరుగారు ఎవరిమాటా వినేట్టు లేదు. మాన్యువల్ పద్ధతే మంచిదనుకున్నాడు. కుక్క మొర్రో మంటున్నా వినకుండా అదే చేశాడు.

కాస్సేపటికి జాన్ పశువుల ఆస్పత్రినుండి బయటపడ్డాడు. అతని వెనక్కాలే వింత వింత నడకలతో కుక్కపిల్ల!

(సశేషం)

**చిత్ర విశేషాలు :**

జాన్ డూలిటిల్ భార్య 'లీసా' గా నటించిన క్రిస్టన్ విల్సన్ 1969లో మసాచుసెట్స్‌లో జన్మించింది. డ్యాన్సర్‌గా శిక్షణ పొంది 4 సంవత్సరాల పాటు బోస్టన్ బాలే లో ప్రదర్శనలిచ్చింది. మ్యూజికల్ థియేటర్‌లో బి.ఎఫ్.ఏ. డిగ్రీ పొందింది. న్యూయార్క్ తరలివచ్చి 'ప్రోటో టైప్ ఎక్స్ 29 ఎ'(1992) అనే చిత్రంతో సినీ రంగ ప్రవేశం చేసి చిన్న చిన్న పాత్రలు చాలా వేసింది. 15 సినిమాలు, చాలా టెలివిజన్ షోలలో నటించిన క్రిస్టన్ 'టైసన్'(1995), 'బుల్లెట్‌ప్రూఫ్'(1996)లతో బాగా గుర్తింపు తెచ్చుకుంది. డా॥ డూలిటిల్(1998) తో పాటు దాని కొనసాగింపు అయిన డా॥ డూలిటిల్ - 2(2001) లో కూడా నటించింది.

తరువాత కన్ఫెషన్స్ ఆఫ్ ఎ డేంజరస్ మైండ్ (2002), వాకింగ్ టాల్(2004) ఆమె ఇటీవలి చిత్రాలు. మార్టెన్ ఎస్టల్స్ అనే స్పెషల్ ఎఫెక్ట్స్ మేకప్‌మెన్‌ను పెళ్లి చేసుకుంది. 'డంజన్స్ అండ్ డ్రాగన్స్'(2000) అనే సినిమాలో ఇద్దరూ కలిసి నటించారు కూడా. వారికి ఇద్దరు పిల్లలు.

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 3



- ఇంద్రగంటి జానకీబాల

## చక్కని పాటా చిక్కని నటనా
# జి.వరలక్ష్మి

**త**న పాట తనే పాడుకుంటూ రంగప్రవేశం చేసిన వారిలో జి.వరలక్ష్మి ఒకరు. ఆమె గొంతు చక్కగా, సన్నగా శ్రుతిబద్ధంగా వుంటుంది. కానీ జి.వరలక్ష్మి నటిగా నిలబడినంత కాలంలో ఒకవంతు కూడా గాయనిగా నిలతొక్కుకోలేకపోయారు. కారణాలు వెదకడం కష్టంగానీ మంచి నటిగా తెలుగు సినిమాల్లో స్థానం సంపాదించుకున్నారని చెప్పక తప్పదు.

'బారిష్టర్ పార్వతీశం' (1940), 'దక్షయజ్ఞం'(1941), 'భక్తప్రహ్లాద'(1942) చిత్రాల ద్వారా ఆమె తన నటననీ, పాటనీ నిరూపించు కోవడానికి పునాది పడింది. ఆమె పధ్నాలుగేళ్ళ పిల్లగా నటన ప్రారంభించి మొదటగా పాడిన పాట "పోయిరా ప్రియుడా లండన్" (బారిష్టర్ పార్వతీశం), అప్పట్లో ఆ పాట ఎంతో జనాదరణ పొందింది. ఆమెకు ద్రోహి (1948) చిత్రం మంచి గుర్తింపును తెచ్చిపెట్టింది. ఆమె నటనకు ప్రశంసలొచ్చాయా చిత్రంలో. ఇందులో 'మనో వాంఛలు' అనే పాట చక్కగా వుంటుంది. 'పూవు చేరీ పలుమారు' ఘంటసాలతో యుగళగీతమూ బాగుంటుంది.

సి.ఆర్. సుబ్బురామన్ సంగీత దర్శకత్వంలో 'స్వప్నసుందరి' సినిమాలో 'నీసరి నీవేనే' గొప్పగా వుంటుంది. అది బాగా ఆదరణ పొందింది. అందులోనే'మరలిరావో...' కూడా వుంది.

'పెళ్ళిచేసి చూడు' చిత్రంలో ఆమెకామే పాటలు పాడుకునే విధంగా పాటలన్నీ రిహార్సలయి పోయాయి. అప్పుడు జి.వరలక్ష్మి, ఎన్.టి. రామారావు కలిసి ఆంధ్రదేశమంతా రాయలసీమ కరువునిధి కోసం నాటకాలు వేస్తూ తిరిగారు. ఆ సంధర్భంలో విజయా వారు పాటలన్నీ పి.లీల చేత పాడించి రికార్డ్ చేయించేశారు. అయితే జి.వరలక్ష్మిని అందులో హీరోయిన్‌గా ఎంపిక చేసి వుండటం వల్ల ఆమె మీద లీల పాటలు చిత్రీకరించారు (ఒక్కటి మినహా). ఈ చిత్రంలో పాటలన్నీ ఆమె పాడినంత సహజంగా నటించి, పాత్రపోషణ చేశారు. 'పెళ్ళిచేసిచూడు' సినిమాతో జి.వరలక్ష్మికి మంచి పేరొచ్చింది.

ఇలాంటి సంఘటనే మరోటి కూడా వుంది. 'మానవతి' సినిమాలో ఎస్.వరలక్ష్మి నటించాలని, ఆమెచేత పాటలు 'ఓ శారదా' అనే పాట పాడించి రికార్డు కూడా చేశారు. కారణాంతరాల వల్ల అందులో ఎన్.వరలక్ష్మికి బదులుగా జి.వరలక్ష్మిని తీసుకున్నారు. అప్పుడు ఈవెం మీద ఎన్.వరలక్ష్మి పాడిన పాటను చిత్రీకరించారు. ఇది నిజంగా చాలా అపురూప ఘట్టం.



'పెళ్ళిచేసి చూడు' చిత్రంలో....



ఎస్.వరలక్ష్మి ఆమెకి ఆమే పాడుకుని నటించారుగానీ, ఇతరులకు పాడలేదు.

ఆ తర్వాత 'జ్యోతి' చిత్రంలో 'దేశమును ప్రేమించుమన్నా' అనే పాట పాడారు. క్రమంగా జి.వరలక్ష్మి పాట పాడేందుకు వెనక్కి తగ్గి నటనకే పరిమితమైపోయారు. 'దొరికితే దొంగలు' ఆమె పూర్తిగా నటించిన చిత్రం. అందులో పాటలు అంతంత మాత్రమే . 'అంతేకావాలి' చిత్రంలో సి.ఎస్.ఆర్. కూతురుగా నటించారు. దానికి పెండ్యాల సంగీతం, అందులో సి.ఎస్.ఆర్., జి.వరలక్ష్మి ఒక రాగాలాపన స్వతంత్రంగా ఎంత గొప్పగా పాడారో పెండ్యాల తరచూ శ్లాఘిస్తూ వుండేవారని వి.ఏ.కే. అంటారు.

జి.వరలక్ష్మికి మంచి సంగీత జ్ఞానం, గళం వున్నప్పటికీ దాన్ని ఎక్కువకాలం పరిరక్షించుకోలేకపోయారనే చెప్పాలి.

పెద్దతరహా పాత్రలలో కులగోత్రాలు, ఇద్దరు మిత్రులు, మాంగల్యబలం (చాలా చిన్న పాత్ర), సుమంగళి, లేతమనసులు ఇలా ఎన్నోరకాల పాత్రలు పోషించి అందరి మన్ననలు పొందారు జి.వరలక్ష్మి. ఆమెకంటూ ఒక విధానం, నటనలో ఏర్పరచుకున్న నటి జి.వరలక్ష్మి. పాటలు కొన్ని వున్నప్పటికీ అవి ఇప్పుడు బహుళ ప్రచారంలో లేవు. దొరకడమూ కష్టమే.

**చిత్రం: బారిస్టర్ పార్వతీశం (1940)**
**దర్శకత్వం :ఆర్.ఎస్.ప్రకాష్**
**ఈ పాట రచన**
**సంగీత దర్శకత్వం : కొప్పరపు సుబ్బారావు**
**గానం - అభినయం : జి.వరలక్ష్మి**

ప్రేమయే జగతీ...
ప్రేమయే జగతీ
ప్రేమలు లేని
జీవి జీవితమేలా
ప్రేమా జీవన సురుచిరలీల
ప్రేమ యువత జపమాల
ప్రేమయే జగతీ...
అతి మధుర మధుర ప్రేమ
తరుగని ప్రేమ విరుగని ప్రేమా
అనుభవించగ రాదా ప్రియుడ
కృష్ణుడవైతే రాధను నేనై
వేయుదును నా సుమమాల
చంద్రుడవైతే తారను నేనై
చేయుదునా తెరచాటు
చేరుదమా యొకమాటు
ప్రేమయే జగతీ...

నవ మన్మథుడవు నీవే అయితే
నేనే ఆ రతి గానా
విడువ నీతో వేళావేళా
వేడుక చేయగ రానా
ఆనందమురా సురుచిరమురా
హాయిరా ఈ ప్రేమ జాలమేల ప్రేమవేళ
జాగు సేయగనేల
ప్రేమయే జగతీ...



**చిత్రం : స్వప్నసుందరి(1950)**
**రచన: సముద్రాల రాఘవాచార్య**
**సంగీతం : సి.ఆర్. సుబ్బరామన్**
**గానం : జి.వరలక్ష్మి**



నీసరి నీవేనే జనానా
లేనెర జాణవులే ॥నీ సరి॥
మొగముతీరు కనుగొన - నగు
మొగము తీరు కనుగొన చురుకైనా మొన
కనరాని సొగసు మనసున ॥నీ సరి॥
వలరాజు కరానా కులికీ ఓ ములికీ
నిలిపెదవు జగానా వలపూ లే వలపూ
అనురాగాలు చిలికెదవే ॥నీ సరి॥
నెరనీటుతనాలా ప్రియుడూ ప్రియతముడూ
నిను కొలుచుక తానా తానై దొరకునులే
మది నీ మేలు మరువనులే ॥నీ సరి॥

# బాణీ ముత్యాలు

సేకరణ : పి.గిరి,హైదరాబాద్



వేటూరి

నిప్పును పూవనుకుంటే తుమ్మెద తప్పు
నెమలికన్ను మనసు చూడలేదని చెప్పు

**చిత్రం : నేను**
**పాట పల్లవి : దేవతలా నిను చూస్తున్నా**



ఆరుద్ర

మురగపెట్టుకున్న పాలు విరుగునన్నాడోయ్
పంచుకున్న పాలు మంచి పెంచునన్నాడోయ్
పూచిక పుల్లయిన వెంట రాదన్నాడోయ్
పుణ్యమొక్కటే చివరకి మిగులునన్నాడోయ్

**చిత్రం : అందాల రాముడు**
**పాట పల్లవి : రాముడేమన్నాడోయ్**



చంద్రబోస్

తగిలే రాళ్లని పునాది చేసి ఎదగాలనీ
తరిమే వాళ్లని హితులుగ తలచి ముందుకెళ్లాలనీ....
కన్నుల నీటిని కలల సాగుకై వాడుకోవాలనీ
కాల్చే నిప్పుని ప్రమిదగ మలచి కాంతి పంచాలనీ

**చిత్రం : నేనున్నాను**
**పాట పల్లవి : చీకటితో వెలుగే చెప్పెను నేనున్నానని**

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**రమణ శాస్త్రి, సంగారెడ్డి.**

ప్ర. ఆడవారికి తలవంపులు తెచ్చే ఇష్టమయిన పని?

జ. మూడు ముళ్లు వేయించుకోవడం.

ప్ర. పవర్ కట్.. ?

జ. నాయకులకు ఎలక్షన్ ముందు -ఓటర్లకు ఎలక్షన్ తర్వాత.

ప్ర. మగాడికి మొద్దునిద్ర ఎప్పుడు పట్టుంది?

జ. స్త్రీల కోసం కేటాయించిన సీటులో కూర్చొని, బస్సెక్కుతున్న ఆడవాళ్ళని చూసినప్పుడు.

ప్ర. పోలీసులు దొంగల్ని ఎందుకు కొడ్తారు?

జ. దొరికిపోయినందుకు.

ప్ర. గూండాలకు, రౌడీలకు ప్రత్యేకించి పండగలంటూ ఉన్నాయా? ఉంటే అవిఏవి? ఎప్పడొస్తాయి?

జ. పాపం వాళ్ళకి ఐదేళ్లకొకసారే వస్తాయి. వాటినే ఎన్నికలంటారు.

## చిలిపి కవిత



మా అన్న లెఫ్టిస్ట్
మా తమ్ముడు రైటిస్ట్
మా నాన్న కమ్యూనిస్ట్
మా అమ్మ క్యాపిటలిస్ట్
మా ఆవిడ టెర్రరిస్ట్
నేను బద్ధకిస్ట్

**-మామిడి మహేంద్ర, పూణే**

## పేరు - రిపేరు



మల్లీశ్వరి - జగదేకసుందరి - సత్యం- మన్మథుడు -
పిల్ల నచ్చింది - జోడి - చాలా బాగుంది.
ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు - ఐతే - ఇక అంతా శుభమే పెళ్ళి జరిపించండి -
ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం.

**-కె.పి. ఆర్. శర్మ, మెయిన్ బజార్, కర్నూలు.**

సఖి - మల్లీశ్వరి - ఒట్టేసి చెబుతున్నా - నీకే మనసిచ్చాను - నీతో - నేను పెళ్లికి రెడీ

**-వరదా. సాయికుమార్, పర్లాకిమిడి, ఒరిస్సా.**



## ఈ రూటే వేరు



'కీలు' - తాళములు (Key లు)
'వెన్నెల' - మాసం ఎప్పుడు (When నెల)
'దేవి' - వారివి(They వి)
'లైలా' - అబద్ధపు న్యాయం (Lie law)
'వేలు' - దారులు. (Way లు)

**-ఎస్. శివనారాయణ, కొత్తపేట.**

## డబుల్ రోల్



రాణీ! ఉ 'దయ' మే వచ్చావు, నా మీద నీకెంత 'దయ'
నాకు 'శని' పట్టిందని నిరా'శని' స్పృహలు కలిగాయిరా.
'మన సు' బ్బారావు 'మనసు' బాగలేదంటగా.
వై'జాగు' వెళ్లటానికి 'జాగు' ఎందుకురా.
'ఉత్త'రాలు తెమ్మంటే 'ఉత్త' చేతుల్తో వచ్చారేంటి.
నా'చుర'ల్‌గానే ఆ అమ్మాయి 'చుర' కత్తిలాంటి పిల్ల.
నాకు న'మస్కా'రం పెట్టి 'మస్కా' కొట్టాలని ప్లాను వేస్తున్నారా..

-ఎస్. శివనారాయణ, కొత్తపేట

## చిలిపి లిపి



My Come = మైకం
low Come = లోకం
So Come = శోకం
Slow Come = శ్లోకం

-వరదా. సాయికుమార్, పర్లాకిమిడి, ఒరిస్సా

## షార్ట్‌కట్స్




భూసారపు మిత్ర విందా - భూమి
ఆదిభట్ల కార్తిక శంతన్ - ఆకాశం
గాడిచర్ల లిఖిత - గాలి
నీరజ రుమాండ్ల - నీరు
అల్లూరి జమదగ్ని - అగ్ని

- రెడ్డి. ఎమ్మె, ఒంగోలు.

## పేరడీ పెరేడ్



ప॥ మీ ఓట్లే నే కోరుకున్నా......
ఓ పదవినందుకే ఇమ్మన్నా ॥మీ ఓట్లే॥
చ॥ పార్టీ ఫండుకు డబ్బిచ్చినాను
సీటుకై పార్టీ మార్చేసినాను
పైరవి విరివిగ చేశానూ...
పైరవి విరివిగ చేశాను
మీ అండ ఉండునని తలచాను ॥మీ ఓట్లే॥
చ॥ రిగ్గింగ్ కోసమె ప్లానులు అన్ని
ప్లానుల లోన రిగ్గులు కొన్ని
జరిగే దోపిడి తప్పదనీ
అనుకోవడమే మీకు పనీ ॥మీ ఓట్లే॥
చ॥ నోట్లతో నెగ్గిన మా మంత్రులకు
సంపాదించుట తెలియనిదా...
ముడుపిచ్చినదే నిజమైతే...
స్విస్ ఖాతాలే ఋజువు కదా....
చ॥ మీ బతుకులు బీదగా ఉండనీ....
మీ కలలే కల్లగా మిగలనీ.....
కలకాలం ఇలాగే ఉండాలనీ
దీవిస్తున్నా నా ప్రజలనీ.....
పీడిస్తుంటా నా ప్రజలనీ....

'మురళీకృష్ణ' చిత్రంలో 'నీ సుఖమే నే కోరుకున్నా' పాటకు పేరడీగా

-పురాణపండ శ్రీకృష్ణ, అశోక్‌నగర్, కాకినాడ.

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన పురాణపండ శ్రీకృష్ణ, కాకినాడ గారికి సోహన్ మ్యూజిక్ వారు 'జై' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC





నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



గాయని శ్రీమతి యస్.జానకి సంగీత దర్శకురాలిగా నటించిన

# దొందు - దొందే !

(1981వ సంవత్సరం సెప్టెంబరు 26వ తేదీన, మద్రాసులోని 'కళాసాగర్' సంస్థ కామెడీ నైట్ నిర్వహించింది. ఆనాడు చాలామంది హాస్యనటులు వివిధ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఒక ప్రహసనంలో యస్.జానకి, రాధాకుమారి పాల్గొని అందర్నీ బాగా నవ్వించారు. సరదా కోసం సాగిన ఆ ప్రహసనం ఆలోచన, యస్.జానకిదే.)

ఘట్టం: సంగీత దర్శకురాలి (యస్.జానకి) ఇల్లు. ఆమె కూనిరాగాలు తీస్తూ, ట్యూన్లు కట్టేస్తూ వుంటుంది. రెండు చేతులతో ఇంటికి తాళం వేసినట్టు తాళం వేస్తూ, తలని అటు ఇటూ విసుర్తూ పాడేస్తూ వుంటుంది. అలా ఆమె తన్మయత్వంలో వుండగా, ఒక ఔత్సాహిక గాయని(రాధాకుమారి)టేప్ రికార్డరు పట్టుకుని ప్రవేశిస్తుంది.



రాధాకుమారి, యస్.జానకి

రాధా : మ్యూజిక్ డైరెక్టర్‌గారికి నమస్కారం. (మ్యూజిక్ డైరెక్టర్ తన్మయత్వంలో వుండి వినిపించుకోలేదు.)

రాధా : సంగీత దర్శకురాలి గారికి వందనం. (అయినా ఆవిడ వినిపించుకోలేదు. అపశ్రుతులతో ఆలాపన జోరుగా వుంది) (కాస్సేపు చూసి, తల తనవేపు తిప్పగా)

రాధా : సుప్రసిద్ధ సంగీత దర్శకురాలు, సినిమా సంగీతానికి పునాదిరాయిని వేసి, ఆ రాయి కరిగిపోయేలా గానం చెయ్యగల గానకళా శిరోమణి - స్వరమణిగారికి వందనాలు.

జానకి : (సంగీతం ఆపి, చూసి) వందనాలు. ఎవరూ మీరు ?

రాధా : నా పేరు నందివర్ధనం. వర్ధమాన గాయనిని. చదువు కుంటున్న రోజుల్లో, స్కూల్లో పాటలు పాడి బహుమతులు పొందాను. కప్పులొచ్చాయి.

జానకి : కాఫీ కప్పులా?

రాధా : కాదండీ, టీ కప్పులు (సర్దుకుని) ఓహ్‌సారీ, వెండికప్పులు. కిందని కర్ర దిమ్మ, పైన రెండో చెవులతో కప్పూ వుంటాయి చూడండి. అలాంటి వన్నమాట.

జానకి : నాకు అర్థం కావడంలేదు. తెచ్చి చూపించగలరా?

రాధా : చూపిస్తాను తర్వాత. అవీ పెద్ద పెద్దవండీ. లారీల్లో తీసుకురావాలి. లారీ అద్దెకి మాట్లాడి ఇప్పుడు తీసుకు రావడం కష్టం. రేపు తీసుకువస్తాను.

జానకి : రేపు నేను బిజీగా వుంటాను. పొద్దున్న కంపోజింగ్, టిఫిను, మధ్యాహ్నం భోజనం, నిద్ర,తర్వాత రికార్డింగు, సాయంకాలం పాతపాటలు వినడం. అంచేత ఎల్లుండొచ్చి, నా ప్రోగ్రాం కనుక్కుని, నేను బిజీ కాకపోతే, మీరు లారీలో కప్పులు తీసుకురండి. మీరు కూడా ఆ లారీలోనే రండి. మీరు విడిగా, కప్పులు విడిగా వస్తే నాకు తెలియక అవస్థ పడతాను.

రాధ : అలాగేనండీ.

జానకి : ఇంతకీ మీరొచ్చిన పని?

రాధా : అదేనండీ, నేను వర్ధమాన గాయకురాల్ని కదా, సినిమాల్లో పాడాలని ఉత్సాహం. మీరు కొత్త వాళ్లని ప్రోత్సహిస్తారని విన్నాను. అందుకని... నన్ను కూడా....

జానకి : నేను క్రొత్త వాళ్లనే ప్రోత్సహిస్తాను. నిజమే. అనుభవజ్ఞులయితే, నా లోపాలు, కనిపెడతారు. కొత్తవాళ్లు కనిపెట్టినా నాతో చెప్పలేరు కదా. అదీ ముఖ్యకారణం. అంతేగాని,కొత్తవాళ్ల మీద ప్రేమ వుండి కాదు.

రాధా : ఎలాగో ఒకలాగ.. నాకు అవకాశం కల్పిస్తే...

జానకి : తప్పకుండా కల్పిస్తాను. మీకు ఎవరి పాటలు ఇష్టం ? ఎలాంటి పాటలు పాడతారు?

రాధా : అందరి పాటలూ ఇష్టమేనండీ. అన్ని రకాల పాటలూ పాడగలను.

జానకి : సుశీలగారు పాడిన పాటలు పాడగలరా?

రాధా : జానకిగారివీ పాడగలను.

జానకి : లతా మంగేష్కర్ గారివి?

రాధా : ఆశాభోంస్లేవి కూడా పాడగలను.

జానకి : లతామంగేష్కర్ గారిది ఓ పాట పాడండి.

రాధా : ఏ సినిమాలోది పాడమంటారు? బర్సాత్, మయూర్‌పంఖ్, ఆవారా, ముఘల్ -ఏ-ఆజమ్.

జానకి : ఎందులోదైనా పాడండి.

రాధా : డ్యూయట్ పాడమంటారా? కోరస్ పాడమంటారా?

జానకి : డ్యూయెట్ పాడండి.

రాధా : డ్యూయెట్ అంటే, ముకేష్‌తో పాడినదా, రఫీతో పాడినదా? కిషోర్‌తో పాడినదా ?

జానకి : కిషోర్‌తో పాడినది పాడండి.

రాధా : విషాదమా? సంతోషమా? శృంగారమా?

జానకి : అబ్బబ్బ, మీరు ఈ ప్రశ్నలతో విసిగిస్తున్నారు పాడేలా లేరు.

రాధా : కాదండీ,మీ టేస్ట్ తెలుసుకోవాలిగదా. అందుకని అడిగాను.

జానకి : పోనీ, మీ కిష్టమైనదేదో అదే పాడండి.

రాధా : అలాకాదు. మీకు ఇష్టమైనదే పాడతాను.

జానకి : (తనలో) నాకు లతా మంగేష్కర్ పేరు తెలుసుగాని ఏఏ పాటలు పాడిందో తెలీదే!

రాధా : 'ఆవారా'లో పాట బాగా వచ్చు. అది పాడమంటారా?

జానకి : ఆవారా! అలాంటి సినిమా వచ్చిందా? నాకు గుర్తులేదే?

రాధా : వస్తుందండి.''ఆవారా హూఁ'' అని విన్నారా?

జానకి : అవును. అది పాడండయితే.

రాధా : అది లతామంగేష్కర్ పాడింది కాదండీ. ముకేష్ పాడింది.

జానకి : పోనీ ముకేష్‌ది పాడండి. ఆఁ పాట రాగం? తాళం?

రాధా : తెలీదండీ, పాడడంతెలుసుగాని, రాగాలు తాళాలూ తెలీవండీ?

జానకి : (తనలో) నాకంటే ఘనురాల్లా వుంది. (ఆమెతో) ముకేష్‌లాగ మగగొంతుతో పాడగలరా?

# సం'గీతా ' రహస్యాలు

## జానకి గాత్ర ప్రతిభ



'భైరవద్వీపం' సినిమాని చందమామ విజయాకంబైన్స్ వారే తమిళంలోనూ, హిందీలోనూ డబ్ చేశారు. హిందీ లో మూడు పాటలైనా పాడితే బాగుంటుందని, ఆశాభోంస్లేని అడిగారు. ఆమె ఏవో కండిషన్లు పెట్టి, నిర్మాతలు ''ఆఁ'' అన్నాక, ఆమె ''ఊ'' అన్నారు. మూడుపాటలూ (తెలుగు) కాసెట్ పంపమన్నారు. పంపాం. ఆమె విన్నారు. పాడతానన్నారు. ముందుగానే పాటలు ఆర్కెస్ట్రాతో సిద్ధమైపోతాయి గనక, ఆ శ్రుతిలోనే ఆశాభోంస్లే కూడా పాడాలి. ''పాడతాను ఇబ్బందిలేదు'' అన్నారు ఆమె. బొంబాయి నుంచి మద్రాసులో దిగారు. స్టార్‌హోటల్లోనూ దిగారు. విజయగార్డెన్స్‌లోనే రికార్డింగు, కార్లో వచ్చి అక్కడా దిగారు. ఆమె పాడవలసిన మూడు పాటలు - విరిసినది వసంతగానం, నరుడా ఓ నరుడా, అంబా శాంభవి భద్రరాజగమనా. ఆశాగారు వస్తూనే నిరాశపరిచారు- తనకి ఆ శ్రుతులు ఎక్కువగా వున్నాయని. సరేనని,



'నరుడా ఓ నరుడా' పాటను అభినయిస్తున్న బాలకృష్ణ, రంభ

కొల్లిరామకృష్ణ (రికార్డింగ్) జెనరేటర్‌తో రికార్డింగ్ విధానాన్ని తగ్గించి, (తక్కువ శ్రుతికి) రికార్డ్ చేసి, మళ్లీ దాన్ని అసలు శ్రుతికి పెంచారు. రెండు పాటలు ఆమె అలాగే పాడారు. మూడో పాట 'అంబా శాంభవి మాత్రం నా వల్లకాదు,



'అంబా శాంభవి' పాటను అభినయిస్తున్న కె.ఆర్.విజయ



పాడలేనన్నారు. పాట పైస్థాయికి వెళ్తుందనీ, తనకి అది సాధ్యం కాదనీ చెప్పేశారు. మూడు పాటలూ పాడతానని వచ్చిన ఆశాభోంస్లే రెండే పాడి వెళ్లిపోయారు. ఇంకేముంది? తెలుగు పాట పాడిన జానకిగారే శరణ్యం! ఆపాట శ్రుతి ఆమె శ్రుతి. అంచేత, అసలు గాయనే వచ్చి అవలీలగా జానకిలా, ఆ హిందీ పాటపాడి, మా అందరినీ ఆనందపరిచారు యస్. (SAVED FROM THE SITUATION) జానకి.

\- ఆర్కే

రాధా : రాదండీ, ఏదిపాడినా ఆడగొంతుతోనే పాడతాను.

జానకి : అయితే ఆడపాటే పాడండి. నాగయ్య గారిదో, ఘంటసాల గారిదో పాడితే నేను జడ్జ్ చెయ్యలేను.

రాధా : నాకు ఒకపాట ఇష్టమండీ. జానకి గారు పాడిన ''నీ లీల పాడెద దేవా''! అది పాడమంటారా?

జానకి : తప్పకుండా పాడండి. దాంతో పాటు ఒక వాద్యం వస్తుంది..ఆ వాద్యం..

రాధా : సన్నాయండీ.

జానకి : అది ఎవరు వాయిస్తారిప్పుడు?

రాధా : అక్కర్లేదండీ. నేనే పాడతాను.

జానకి : అయితే పాడండి.

రాధా : (ఒక్కక్షణం ఆగి) క్షమించండి సంగీత దర్శకురాలు గారూ! నా గొంతు

పొద్దుటనుంచీ సరిగా లేదు... అంచేత, నిన్ననే టేప్‌రికార్డ్ చేసి పట్టుకొచ్చాను. అది వినిపించమంటారా? పైగా, మీరు నంగీత దర్శకులు. మీ దగ్గర పాడాలంటే భయం. అందుకని రికార్డ్ చేసేశాను. వినిపిస్తాను.

జానకి : వినిపించండి.

(రాధాకుమారి టేప్ రికార్డర్ ఆన్ చేస్తుంది. అందులో సినిమాలో పాట, జానకి పాడినదే వినిపిస్తుంది కొంత విని)

జానకి : బాగుందే. అచ్చం జానకి పాడినట్టే పాడారు. వాద్యం కూడా మీరే వాయించారా?

రాధా : లేదండీ. ఆయన....ఆయనెవరో తెలీదండీ.

జానకి : తెలీయకుండా వాద్యం వాయించారా!

రాధా : తెలియాల్సిన అవసరం ఏముందండీ? మరి, నాకు అవకాశం ఎప్పుడిస్తారు?

జానకి : త్వరలోనే ఇస్తాను. అప్పుడు కూడా ఇలాగే టేప్ రికార్డర్‌లో పాడతారా? మీరుగానే పాడతారా?

రాధా : అక్కడ సరిగ్గానే పాడతానండీ.

జానకి : గొంతు బాగుండక పోతే?

రాధా : రికార్డింగ్‌లో నాకు బాగుంటుందండీ!

జానకి : ఆహాఁ.. (వ్యంగ్యంగా) బాగుంటుందా? ఏవమ్మా - ఆమాత్రం నాకు తెలియదనుకున్నావా? సినిమాలో జానకి పాడిన పాటే తెచ్చి నాకు వినిపించి, నీ గాత్రం అంటావా? ..జాగ్రత్త! ఇలా మభ్యపెట్టి అవకాశం లాక్కుందామనుకుంటున్నావు కాబోలు... ఆ మాత్రం గ్రహించలేనా?

రాధా : కనిపెట్టేశారే.. మీరు కనిపెట్టలేరనుకున్నాను. మీకసలు సంగీతం తెలీదనీ, అయినా నంగీత దర్శకురాలై పోయారని విని వచ్చాను. నాకసలు పాటరాదు. మీలాంటి నంగీత దర్శకురాలి దగ్గర నేను పాడితేనే సరిగ్గా వుంటుంది. ఈ మధ్య వచ్చిన ఒక సినిమాలోని మీ పాటలు చాలా బాగున్నాయని పత్రికల్లో రాశారు.

జానకి : అవునవును. అందరూ మెచ్చుకున్నారు. నాకు జాతీయబహుమతి కూడా వస్తుందిట.

రాధా : ఆ వరసలన్నీ మీ సొంతం కాదు. కాపీలు. ఆ పాటల్ని అలాగే కాపీ కొట్టుకుని, మీ నహాయకులకి ఇస్తారుట కదా. వాళ్లే అంతా చేసేస్తారుట. నిజమేనా?..

జానకి : సంగీతదర్శకుడికి సంగీతం తెలియాలని రూలు లేదు. సినిమాల్లో రచన చెయ్యాలంటే. ఎవరైనా చెయ్యవచ్చు. పండితులు అక్కర్లేదు. ఎవరైనా డైరెక్టర్ కావచ్చు. ప్రొడ్యూసర్ కావచ్చు.

రాధా : సంగీతం తెలియక పోయినా, శ్రుతులు రాగాలు తెలియక పోయనా, మీరు గొప్ప సంగీత దర్శకులు అనిపించుకున్నారు. నాకు అవకాశం ఇవ్వకపోతే పోనీండి. ఇంకా క్రొత్త వాళ్లకి ఇవ్వండి. వాళ్లు ఏమీ అనరు. సెలవు. (వెళ్లబోగా)

జానకి : ఆగండి.... ఆపాట..అదే ఆ టేపులో పాట..తీసినాకివ్వండి. ఏదైనా సినిమాలో ఆ ట్యూన్ వాడుకుంటాను.

రాధా : నేనివ్వను. నాకు అవకాశం ఇస్తానంటే ఇస్తాను.

జానకి : నన్ను మోసం చేసిన వాళ్లకి అవకాశం ఇవ్వను.

రాధా : పోనీండి, ఇంకో మ్యూజిక్ డైరెక్టర్‌ని వెతుక్కుంటాను.(వెళ్లింది. సంగీత దర్శకురాలు మళ్లీ మొదట్లో లాగా, తల ఎగరేనన్తా పాడుకుంటూ వుంటుంది) ■

# సం'గీతా ' రహస్యాలు

## జానకి జ్ఞాపకం

"సాహో! మహావీరుడా! మనోచోరుడా! మరో మారుడా" (రచన వేటూరి: సంగీతం : మాధవపెద్ది సురేష్) "శ్రీకృష్ణార్జున విజయం" లోని పాటని పాడ్డానికి వచ్చారు యస్. జానకి. అప్పటికే ఆర్కెస్ట్రా రికార్డింగ్ అంతా అయిపోయింది గనక, పాట వరస మాత్రం విన్నారు జానకి. తన చిన్న టేప్‌రికార్డర్‌లో పెట్టుకుని ప్రాక్టీస్ చేస్తూ-'ఈ వరస, అదే ఆరంభం, ఎక్కడో విన్నట్టుందే" అన్నారు. ఎవరం పట్టించుకోలేదు. మళ్లా అడిగారు. "నురేష్! పల్లవి ఎత్తుబడి ఎక్కడో విన్నట్టుందయ్యా-" అన్నారు. ఆయన చిరునవ్వు నవ్వేసి తన పనిలో పడిపోయాడు. జానకి, పాట పాడుతూ, ఆ వరసని జ్ఞాపకం తెచ్చుకోడానికి తంటాలు పడుతూ వుంటే- నేను ఇంక ఊరుకోలేక, "చంద్రలేఖ- జెమినీ వారిది గుర్తుంది గదమ్మా- అందులో "హోయె, తెరక్ సంశియో లగంలోహియో ముశిఖాహయీ - కెపన్నీ షుహూన్ లగసిలాభహూం - సిలాభహూం లగసియో - లగసియో" అని జిప్సీ వాళ్లు పాడేపాట.(సంగీతం: యస్. రాజేశ్వరరావు - చంద్రలేఖ - విడుదల 1948) గుర్తుందా?" అని వరస పాడి గుర్తుచేశాను. "సురేష్ నాలుగైదు వరసల్లో ఈ పాట చేస్తే - అందరికీ ఈ వరసే నచ్చింది. అదెక్కడిదో ఎవరికీ తెలీదు. అదే 'ఓకే' అయింది"! అని చెప్పాను. జానకి ఆ పాత పాటని గుర్తుకు తెచ్చుకుని - పాడి, "ఓసి, మీ దొంగతనం బంగార గానూ! బలే వట్టేరే.." అని " పొన్లెండి - రాజేశ్వరరావుగారిని స్మరించుకున్నాం" అన్నారు ఆనందంగా. ఆపాట ఎత్తుబడి మాత్రమే స్ఫూర్తి. తక్కినదంతా సురేష్ వరసే.



'శ్రీకృష్ణార్జున విజయం'లో బాలకృష్ణ




- ఆర్కే

# ఎస్.జానకి సినీ గీతాలు

**చిత్రం: మయూరి**

**రచన: వేటూరి     సంగీతం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం**

అందెలు పిలిచిన అలికిడిలో.....
అణువణువణువున అలజడులు
ఎద పద మొకటౌ లాహిరిలో
ఎద పద మొకటౌ లాహిరిలో
ఎన్నడు ఎరుగని ఉరవడులూ.....
ఇది నా ప్రియ నర్తన వేళ  తుదిలేనిది జీవన హేల
ఇది నా ప్రియ నర్తన వేళ  తుదిలేనిది జీవన హేల
ఇది నా ప్రియ నర్తన వేళ ....... ఆ.....
ఉత్తరాన ఒక ఉరుము ఉరిమినా
ఉలికి చిలిపి మెరుపొకటి మెరిసినా
ఒక కదలిక చిరుమెదలిక   గిలిగింతగ జనియించగా
ఒక కదలిక చిరుమెదలిక   గిలిగింతగ జనియించగా
నాలుగు దిక్కుల నడుమ
పుడమి నా వేదికగా నటన మాడనా
అనంత లయతో నిరంతగతితో
జతులు పాడనా...ఆడనా      ॥ఇది నా ప్రియ॥
మేఘవీణ చలిచినుకు చిలికినా
మేనులోన చిరు అలలు కదిలినా
ఒక లహరిక  మధు మదనిక  వలపంతగ జనియించగా
ఒక లహరిక  మధు మదనిక  వలపంతగ జనియించగా
సుగమనిగమ సుధ ఎడద పొంగగా
వరదలాగా ఉప్పొంగనా
వరాళి ఎదలో స్వరాల రొదలో
పదము పాడనా ఆడనా...
ఇది నా ప్రియ నర్తన వేళ  తుదిలేనిది జీవన హేల
ఇది నా ప్రియ నర్తన వేళ ....... ఆ.....

**చిత్రం: శ్రీవారికి ప్రేమలేఖ**

**రచన:వేటూరి     సంగీతం: రమేష్ నాయుడు**

శ్రీ మన్మహారాజ  మార్తాండతేజ  ప్రియానంద భోజా
మీ శ్రీ చరణాంభుజములకు
ప్రేమతో నమస్కరించి  మిము వరించి
మీ గురించి ఎన్నో కలలు కన్న కన్నె బంగారు
భయముతో భక్తితో అనురక్తితో  శాయంగల విన్నపములు
**వచనం: సంధ్యా రాగం చంద్ర హారతి పడుతున్న వేళ**
**మసక చీకటి మధ్యమావతి పాడుతున్న వేళ ఓ శుభ ముహూర్తాన**
తొలిసారి  మిమ్మల్ని చూసింది మొదలు
కదిలాయి మదిలోన ఎన్నెన్నో కథలు....ఎన్నెన్నో కథలు
జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలి పరమానంద రామ గోవిందా......జో...జో....
నిదురపోని కనుపాపలకు జోల పాడలేక
ఈలవేసి చంపుతున్న ఈడునాపలేక
ఇన్నాళ్లకు రాస్తున్న ఊహు:.........ప్రేమలేఖ      ॥తొలిసారి॥
ఏ తల్లి  కుమారులో తెలియదు కానీ
ఎంతటి సుకుమారులో  తెలుసు నాకు
ఎంతటి మగధీరులో తెలియలేదు గానీ
నా మనసును దోచిన చోరులు మీరు
వలచి వచ్చిన  వనితను చులకన చేయక, తప్పులుంటే మన్నించి
ఒప్పులుగా భావించి  చప్పున  బదులివ్వండి      ॥తొలిసారి॥
తలలోన తురుముకున్న తుంటరి మల్లే
తలపులలో ఎన్నెన్నో మంటలు రేపే    అబ్బా....అబ్బా.....
సూర్యుడు చుట్టూ  తిరిగే భూమికి మల్లే
నా ఊర్పుల నిట్టూర్పుకు జాబిలి వీడే    ఆ.....ఆ...
నీ జతనే  కోరుకుని  లతలాగా అల్లుకుని
నాకు మీరు మనసిస్తే- ఇచ్చినట్టు మాటిస్తే
ఇప్పుడే బదులివ్వండి
ఇప్పుడే...బదులివ్వండి      ॥తొలిసారి॥

**చిత్రం: పదహారేళ్ల వయసు**

**రచన: వేటూరి     సంగీతం: చక్రవర్తి**

సిరి మల్లెపూవ్వా...సిరిమల్లె పూవ్వా..సిరిమల్లెపూవ్వా
చిన్నారి చిలకమ్మా
నా వాడు  ఎవరే  నా తోడు ఎవరే
ఎన్నాళ్ల కొస్తాడే
సిరిమల్లె పూవ్వా- సిరిమల్లెపూవ్వా
చిన్నారి చిలకమ్మా
నావాడు ఎవరే నా తోడు ఎవరే
ఎన్నాళ్ల కొస్తాడే- సిరిమల్లెపూవ్వా...
తెల్లారబోతుంటే నా కల్లోకి వస్తాడే
కళ్లారా చూదామంటే  నా కళ్లు మూస్తాడే
ఆ  అందగాడు నా ఈడు జోడు  ఏడే
ఈ సందెకాడ  నా చందమామ రాడే
చుక్కల్లారా.... దిక్కులు దాటి...
వాడెన్నాళ్ల కొస్తాడో      ॥సిరిమల్లె॥
కొండల్లో కోనల్లో  కూయన్న  ఓ  కోయిలా
ఈ పూల వానల్లో ఝుమ్మన్న ఓ తుమ్మెదా
వయసంతా వలపై మనసే మై మరుపై
ఊగేనే.......
పగలంతా దిగులు రేయంతా వగలు రేగేనే
చుక్కల్లారా....దిక్కులు దాటి
వాడెన్నాళ్ల  కొస్తాడో....      ॥సిరిమల్లె॥

**చిత్రం : మంచుపల్లకి**

**రచన: వేటూరి     సంగీతం: రాజన్- నాగేంద్ర**

ఆ......ఆ.....
మేఘమా దేహమా మెరవకే ఈ క్షణం
మెరిసినా కురిసినా కరుగునే జీవనం..
మేఘమా దేహమా
మెరిసినా కురిసినా కరుగునే జీవనం..
మెరిసినా కురిసినా కరుగునే జీవనం..॥మేఘమా॥
మెరుపులతో పాటు ఉరుములుగా
దనిరిసా రిమ దనిస దనిపగా
మూగబోయే జీవ స్వరములుగా
వేకువ జామున వెన్నెల మరకలుగా
రేపటి వాకిట...ముగ్గులుగా
ఆ...
స్మృతిలో మిగిలే నవ్వులుగా
వేసవిలో మంచుపల్లకిగా      ॥మేఘమా॥
పెనుగాలికి పెళ్లి చూపు
పువు రాలిన వేళ కళ్యాణం
అందాక ఆరాటం
ఆశలతో పేరంటం
నాకొక పూమాల తేవాలి నువ్వు
అది ఎందుకో      ॥మేఘమా॥

# కన్నడ సినిమాతో జాతీయపురస్కారాన్ని పొందిన తెలుగు సంగీత దర్శకుడు

# ఎం.వి.రాజు

- మహాభాష్యం చిత్తరంజన్

సుప్రసిద్ధ సినీ సంగీత దర్శకులుగా వెలుగొందిన ఎం.వి.రాజుగారి పూర్తిపేరు మందపాటి వెంకట్రాజు. నల్లగొండ జిల్లాలోని హుజూర్‌నగర్‌లో డిసెంబరు 8, 1919నాడు జన్మించారు. ఈయన తండ్రి చిన్నపాటి వ్యవసాయదారుడు. ఉన్న కొద్దిపాటి భూమి కూడా తాకట్టులోపడి హరించుకుపోగా యుక్త వయసుకు వచ్చిన వెంకట్రాజుకు యిల్లు తప్ప ఏమీ మిగలలేదు. ఒక మిత్రుని సహకారంతో ఏలూరు వెళ్ళి వారాలు చేసుకుంటూ కొంతకాలం గడిపారు. అక్కడే 'గగ్గులు' అనే నామాంతరం గల నల్లాన్ కృష్ణమాచార్యులు అనే సంగీత విద్వాంసునితో ఆయనకు పరిచయం కలిగింది. అప్పటికే కృష్ణమాచార్యులు 'ఉష' (1939)అనే చిత్రంలో కృష్ణునిగా నటించారు. వెంకట్రాజుగారి కంఠం విని ఆయన తన వెంట మద్రాసు తీసుకుని వెళ్ళి 1940లో 'చండిక' అనే సినిమాలో రాజుగారి చేత ఒక పాట పాడించారు. తరువాత ఆయన స్వయంగా సంగీతం నేర్చారు. కాని పరిస్థితులు సహకరించకపోవడం వలన రాజుగారు ఖమ్మం జేరి సంగీత పాఠాలు చెప్పడం ప్రారంభించారు. కాని అక్కడ కూడా కుదరక హుజూర్‌నగర్‌కు మకాం మార్చి అక్కడ సంగీత కచేరీలు చేయడం ప్రారంభించారు. సూర్యాపేట, నల్లగొండ, హైదరాబాదు, జగ్గయ్యపేట, మెదక్ మొదలగు ప్రాంతాలలో సంగీత కచేరీలు చేశారు.

హైదరాబాదులో ఖైరతాబాద్‌లోని "దక్కన్ రేడియో"లో స్వరకర్తగా ఉద్యోగంలో చేరి కొంతకాలం పనిచేశారు. 1947లో నేను బాల గాయకుడుగా దక్కన్ రేడియోలో పాడడం ప్రారంభించాను. అదే సమయంలో వెంకట్రాజు గారితో పరిచయం ఏర్పడింది నాకు. నా గాత్రం విని ఆయన మెచ్చుకుని అప్పటి నుండి ఆయన రేడియోలో పనిచేసినంత కాలం నాచేత ఎన్నెన్నో మంచి పాటలను పాడించారు. 8,9 సంవత్సరాల వయసు గల నా గాత్రాన్ని పెద్ద కార్యక్రమాలలో స్త్రీలకు ప్లేబాక్ పాడించేవారు. అలా ఆయన నేను కలిసి కొన్ని యుగళగీతాలు కూడా పాడాము. అప్పుడే దక్కన్ రేడియోలో కొత్తగా ఏర్పాటు చేసిన డిస్క్ రికార్డింగ్ సిస్టమ్‌తో రాజుగారు నాతో కలిసి కొన్ని పాటలు పాడి రికార్డు చేయించారు. ఆయన రేడియోలో పనిచేసిన కాలంలో



చాలామంది గాయకులను ప్రోత్సహించి వారి అభివృద్ధికి ఎంతో దోహదం చేశారు. వారిలో నాతో పాటుగా మాస్టర్ విశ్వం ('బాలనాగమ్మ' చిత్రంలో బాలనటుడిగా నటించారు) యం.వి. యన్. ఆచార్య, యం.యల్.యన్. చారి మున్నగు వారున్నారు.

కందిబండ, గణపవరం గ్రామాలకు చెందిన దేశ్‌ముఖ్‌లు ఒక సినిమా నిర్మించ తలపెట్టి రాజుగారిని తీసుకుని మద్రాసు వెళ్ళారు.

అశ్వత్థామ సంగీత దర్శకుడు గాను, వెంకట్రాజు గాయకునిగాను 'ఆదర్శం' అనే సినిమాను 1952లో శుభోదయ పతాకం క్రింద హెచ్.వి.బాబు దర్శకత్వంలో తీశారు. అందులో జానకి, జగ్గయ్యా నాయికా నాయకులు. కాని ఆ సినిమా అంతగా ఆడలేదు. వెంకట్రాజుగారు మాత్రం మద్రాసులో ఉండి పోయారు. టి.చలపతిరావు గారి దగ్గర అసిస్టెంటుగా చేరారు. తరువాత క్రమంగా కన్నడ సినిమా రంగం

### చిత్రం : స్వర్ణగౌరి(1962)

సంగీతం : ఎం.వి.రాజు గానం :ఎస్.జానకి, ఎం.చిత్తరంజన్ రాగం :జై జైవంతి

ప॥ జయమీవే జగదీశ్వరి
కావ్యగాన కళాసాగరి
చ॥ పదములవెలసే లయతాళాలు
నీ కథలే మధుర గీతాలు
దరహాసాలే వరాలస్వరాలు
రాగము వేదము నీవెలే ॥జయమీవే॥
చ॥ నీచరణములే నమ్మినదాన
నీదాన దయార్థినిగాన
చిలుకగరాదే నీ జాలివాన
మాతా మంగళ దేవివే
జయమీవే జగదీశ్వరి
గమగమ/ దనిదని/ రిగరిగ/ మపమప/ దనిదని/
సమగప/ మాగప/ మాగప/ మాగమ/
జయమీవే జగదీశ్వరి
(తరువాత లేడీ వాయిస్ ఆలాపన పాడుతుంది)
జయమీవే జగదీశ్వ....
లేడీ వాయిస్: దనిపమ / గమదని/ పమగమ/ రిగరిస/నిసనిస/
దనిదని/ గమగమ/ రిగరిస/ నిసనిరి/ సరినిస/ రిరిరిగ/ గగమమ
మదపద/ మపగమ/ సాదప/ మాగమ/ రీసా/ దపమా/ గమరీ/ సాదప/ మాగమ/ రీ
జగదీశ్వరి
తర్వాత మళ్ళీ ఆలాపన ఆ తరువాత జయమీవే జగదీశ్వరి॥

వైపు ఆయన దృష్టి మళ్ళింది. చలపతిరావుగారి సిఫార్సుతో 1960లో వి.ఆర్.స్వామిగారు తీసిన 'భక్తకనకదాస' అనే కన్నడ సినిమాకు సంగీత దర్శకత్వం వహించారు. ఈ సినిమాకు ఆయనకు జాతీయ పురస్కారం లభించినది. మరి వెనుతిరగ వలసిన అవసరం కలగలేదు. కన్నడంలో రాజాసత్యవ్రత, ధర్మస్థళమహాత్య, నాగమోహిని వంటి సినిమాలకు సంగీతం సమకూర్చి ప్రఖ్యాతి గడించారు. అప్పుడాయనను తెలుగు సినిమా రంగం సాదరంగా ఆహ్వానించింది. "స్వర్ణగౌరి" సినిమాకు పనిచేశారు. శ్యాంప్రసాద్ పతాకం కింద వి.ఆర్. స్వామి దర్శకత్వంలో తయారైన చిత్రంలో కృష్ణకుమారి, కాంతారావు నాయికా నాయకులు. ఈ సినిమా తెలుగు, కన్నడంలో ఒకేసారి తీయడం జరిగింది. ఈ సినిమాలో నేను, జానకి గారితో పాడాను.

అటు సినిమాల్లోనే కాక ప్రయివేటు రికార్డులు కూడా యిచ్చారు రాజుగారు. కరుణశ్రీగారి పద్యాలను మృదుమధురంగా ఆలపించి హెచ్.యం.వి రికార్డుగా విడుదల చేశారు. నెహ్రూని కీర్తిస్తూ "భరత జననీ ప్రధానియే ఓహో" వర్ధమాన గాయకుల కోసం ఎన్నో చక్కని లలిత గీతాలకు బాణీలు కూర్చారు. "ఎంతమంచి చిన్నది", "కృష్ణాముజ్జగాలు" మెరుపులు పూవులు", భూధరమో సాగరమో", రాబోకు రాబోకురా" వంటి పాటలు ఆనాడు ఆంధ్ర దేశమంతటా మారుమ్రోగాయి. పిఠాపురం, స్వర్ణలత, ఎ.పి.కోమల, పి.బి. శ్రీనివాస్, మొదలగు వారిచేత ఆయన ఎక్కువగా పాడించారు. ఈ పాటలన్నీ ఆంధ్రదేశమంతటా ప్రాచుర్యం పొందాయి.

"స్వర్ణగౌరి" సినిమాలో మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి చేత "జయ జయ నారాయణ" అని పాడించటం రాజుగారి ప్రజ్ఞాపాటవాలకు ఒక చక్కని తార్కాణం. రాజుగారు తన చిన్ననాటి మిత్రులైన ఎం.వెంకట నరసింహాచార్యులు గారిని హార్మోనిస్టుగా ఈ చిత్రానికి వినియోగించు కున్నారు.

"స్వర్ణగౌరి"లో ఆచార్యుల వారి చాతుర్యాన్ని గమనించి, తరువాత "నాగరాజు" సినిమాకు తనకు సహాయ దర్శకులుగా బాధ్యత అప్పగిద్దామనుకున్నారు. ఈ సన్నాహాలు జరుగుతుండగా ఏప్రిల్ 17, 1963లో దురదృష్టవశాత్తూ వెంకట్రాజుగారు క్షయవ్యాధి గ్రస్తులై అకాల మృత్యువు పాలయ్యారు.

అంచెలంచెలుగా ఎదిగి ఆకాశం వరకూ వ్యాపించిన వెంకటరాజుగారి సంగీత సరస్వతి అజరామరమైంది. వారి పాటలు ఈనాటికీ సంగీతజ్ఞుల హృదయాల్లో మధురంగా నినదిస్తూనే ఉన్నాయి. ●

హాసం క్లబ్

# హాసం క్లబ్‌లు ప్రారంభం

హాస్య-సంగీత ప్రియులందరూ సకుటుంబంగా నెలకోసారి రెండుగంటలపాటు హాస్యకార్యక్రమాలతోనూ, పాటలతోనూ కాలక్షేపం చేయడానికి వీలుగా ఈ కొత్త సంవత్సరంలో ఉగాది నుండి 'హాసం క్లబ్'లు ఏర్పాటవుతున్నాయి. ఈ కార్యక్రమాలలో పాల్గొనడానికి మీరు 'హాసం' పాఠకులు కానవసరం లేదు. క్లబ్‌కు చందా కట్టనక్కరలేదు. హాయిగా వచ్చి జోకులు వినవచ్చు. మీరూ చెప్పవచ్చు. వివరాలివిగో -

| ఊరు | తేదీ | సమయం | స్థలం | వివరాలకు సంప్రదించవలసినవారు |
|---|---|---|---|---|
| రాజమండ్రి | 18-04-04<br>ఆదివారం | ఉదయం<br>10.35 -12.35 | 16-4-2, శ్రీరామనగర్,<br>పేపర్‌మిల్లు వద్ద, రాజమండ్రి-5, | శ్రీ ఎం.వి.అప్పారావు<br>☎ 95883- 2438085, 98852 15155 |
| వైజాగ్ | 18-04-04<br>ఆదివారం | సాయంత్రం<br>6.30 - 8.30 | విశాఖ జిల్లా కేంద్ర గ్రంథాలయం<br>మహారాణిపేట, విశాఖపట్టణం-2 | శ్రీ టి.ఎల్.ప్రసాద్ ☎ 98850 56449<br>శ్రీ మస్తాన్‌రెడ్డి ☎ 95891-2720219/2713554 |
| ఏలూరు | 18-04-04<br>ఆదివారం | సాయంత్రం<br>6.35 -8.35 | శ్రీ డి.రామకృష్ణారావు గారి ఇల్లు<br>డా॥ ప్రసాద్ ఆసుపత్రి వద్ద,<br>రామచంద్రరావు పేట, ఏలూరు | శ్రీ మోతే నారాయణరావు ☎ 958812-221989<br>శ్రీ డి.రామకృష్ణారావు ☎ 958812-222318 |
| హైదరాబాదు | 24-04-04<br>శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | 'హాసం' ఆఫీసు, శ్రీ బాలాజీ నిలయం,<br>రాజీవ్‌నగర్ బస్టాప్, ఎ.జి.కాలనీ దగ్గర్లో,<br>హైదరాబాదు-18 | శ్రీ గిరి ☎ 9540-55570215<br>శ్రీ ఎస్.వి.రామారావు ☎ 24160279 |
| పలాస<br>(శ్రీకాకుళం జిల్లా) | 24.04.2004<br>శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | డా॥ వై.రామినాయుడు నర్సింగ్‌హోమ్,<br>వివేకానంద కాలనీ, పలాస | శ్రీ డా॥ వై.రామినాయుడు<br>☎ 08945-241268, 98486 51615 |

'హాసం' అభిమానులు తమ వీలుమేరకు ఈ కార్యక్రమాలలో పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాం.

ఇతరపట్టణాలలో 'హాసం క్లబ్బు'లు ప్రారంభించ దలచినవారు సంప్రదించవలసిన చిరునామా -

**శ్రీ ఎస్.వి.రామారావు, కన్వీనర్, హాసం క్లబ్స్,**
**జి3, ఉమా అపార్ట్‌మెంట్, లలితానగర్, దిల్‌సుఖ్‌నగర్,**
**హైదరాబాద్ -500 060 ఫోన్ - 040-2416 0279**

# కొన్ని సంగీత కథలు...

- దేవరకొండ శేషగిరిరావు

భారతీయ సంగీతానికి, వాగ్గేయకారులకు సంబంధించిన అనేక కథలు మనోరంజకంగా ఉంటాయి. సంగీతం ఎలా పుట్టిందో చెప్పడానికే ఒక కథ ఉంది.

బ్రహ్మ సచరాచర ప్రపంచాన్ని సృష్టించాడు. అయినా అతనికి తృప్తి లేదు. కారణమేమిటని సరస్వతి అడిగింది. "సృష్టి చేసేను కాని ఈ సృష్టి మానవులలో స్పందనను కలిగించడం లేదేమిటని చింత పట్టుకొంది" అన్నాడు. దానికి సరస్వతి ఇలా సమాధానం చెప్పింది - "సృష్టిలో దాగిన మాధుర్యాన్ని ప్రజలచేత ఆస్వాదింపచేసే బాధ్యత



మహా గాయకుల జీవితాలలో జరిగిన సంఘటనలను కొన్నింటిని ముచ్చటించుకుందాం.

తాన్‌సేన్ అమర గానాన్ని విని ముగ్ధుడైన అక్బరు "ఇంతకంటె గొప్ప గాయకులున్నారా" అని అడిగాడు.

"లేకేమి మహారాజా! నా గురువు హరిదాస్ యొక్క సంగీతంలో నాకు సహస్రాంశమైనా పట్టుబడలేదు. అతడు మేరువైతే నేనొక ఆవగింజను." అన్నాడు తాన్‌సేన్. ఆయన గానం వినాలన్నాడు అక్బర్.

"ఆయన ఎవరి దగ్గరకు రాడాయె!" అని సందేహం వెలిబుచ్చాడు తాన్‌సేన్.

'దాని కేముంది, ఆయన వద్దకే వెళ్ళి అడుగుదాం' అన్నాడు అక్బరు.

"భక్తి భావంతో ఆయన పాడినపుడు మనం వినాలిగాని. మనం పాడమంటే పాడడు" అన్నాడు తాన్‌సేన్.

తాన్‌సేన్, మారువేషంలో ఉన్న అక్బర్ హరిదాస్ ఆశ్రమానికి వెళ్లారు. కానీ గురువుగారు పాడే ఉద్దేశ్యంలో లేరు.

ఇక ఉండబట్టలేక తాన్‌సేన్ కావాలని తప్పు స్వరంతో పాడేడు. గురువు కోపించాడు భూనభోంతరాలు వ్యాపించేటట్లు గానం చేసేడు గురువు.

ఆయన గానం విన్న తరువాత అక్బరు తాన్‌సేన్‌ని అడిగాడు - "నువ్వు గురువు ముందు వెలవెల పోతున్నావేం?" అని.

"నీకోసం పాడేవాణ్ని నేను, పైవాడి కోసం పాడేవాడు నా గురువు" అన్నాడు తాన్‌సేన్ నిజాయితీగా, నిర్మొగమాటంగా. ■

నాది. వారికి కళా ప్రపంచపు ద్వారాలు తెరిచి చూపిస్తా. కళలనందిసా" అన్నది. సృష్టిలోని సౌందర్యాన్ని ఆనందాన్ని ఆస్వాదింపమొదలు పెట్టారు ప్రజలు. ఈ కథ ఓ దివ్య సందేశాన్ని అందిస్తోంది కదా!

ఒక త్యాగరాజు కీర్తన విన్నా ఒక ఆలయ శిల్పం చూసినా ఒక నాట్యకత్తె నృత్య భంగిమల్ని వీక్షించినా ఒక శిల్పి చెక్కిన సుందర శిల్పాన్ని కనులారా వీక్షించినా ఏదో ఒక దివ్యానుభూతి కల్గుతోంది కదా! భౌతిక అవసరాలను తీర్చుకోవడంతోనే మానవుడు తృప్తి పడకుండా ఏదో అందని ఆనందాన్ని ఆస్వాదించాలని ఉవ్విళ్లూరుతూ ఉంటాడు. ఈ కళలే లేకపోతే సృష్టి నిర్జీవంగా కొనసాగబడి ఉండేది.



**భా**రతీయ సంగీతం రాగమయం. ఒక్కొక్క రాగం ఒక్కొక్క భావంతో ముడిపడి యుంటుంది. ఒక్కొక్క రాగానికి ఒక్కొక్క అధిదేవత ఉంటుంది. ఆ దేవతే ఆ రాగానికి జీవాన్ని ప్రసాదిస్తుంది. దీని నాధారంగా మహాగాయకుల జీవితాలలో ఆశ్చర్యకరమైన సంఘటనలు జరిగాయి. అవి లోకంలో ప్రసిద్ధిని పొందాయి.

తిరుపతిలో స్వామి సన్నిధిలో త్యాగరాజస్వామి కీర్తన పాడగా తెరతొలగినట్లు ప్రసిద్ధి. రాగ ప్రభావంచే దొంగలలో మార్పు వచ్చినట్లున్న కథ అందరికీ తెలిసిందే. అమృతవర్షిణి రాగం వల్ల ముత్తుస్వామి దీక్షితులవారు వర్షం కురిపించినట్లు చరిత్ర చెబుతోంది. మేఘరంజని వల్ల వర్షం, దీపక్ రాగం వల్ల అగ్ని రగలడం, నాగవరాళి రాగంచే పాములు తలవంచడం ప్రసిద్ధాలు. ఒక్కొక్క రాగాన్ని ఒక్కొక్క విద్వాంసుడు పాడి అతనిసొత్తే అనిపించేటట్లుగా వారి జీవితాలుండేవి. ఆ రాగాల పేర్లతోనే వారిని పిలిచేవారు. తోడి సీతారామయ్య, బేగడ సుబ్రహ్మణ్య అయ్యర్, కేదార గౌళ నరసింహ అయ్యంగార్ మొదలగు వారు ప్రసిద్ధులు. కేదార రాగానికి నర్సీమెహతాను చెప్పుకుంటారు.

గుజరాత్‌కు చెందిన నర్సీ మెహతా గొప్పసంగీతజ్ఞుడు. భక్తుడు. కృష్ణుడికి ఇష్టమైన కేదార రాగం ఆలపించి పాము కాటుచే చనిపోయిన ఒక హరిజన బాలుణ్ణి బ్రతికించినట్లు చెప్తారు.

ఓ సారి ఆయన దగ్గరకు ఒక బ్రాహ్మణుడు వచ్చి తన కూతురు వివాహ నిమిత్తం రూ.500 ఇమ్మని కోరాడు. నర్సీ వద్ద డబ్బులేదు. ఒక వ్యాపారస్తుడి వద్ద అప్పడగబోయాడు. ఋణదాత "ఏదైనా తాకట్టు పెట్టు" అన్నాడు.

'నా దగ్గర ఏమీలేదని' నర్సీ జవాబు.

"నీ దగ్గర మహిమాన్వితమైన కేదార రాగం ఉంది కదా. అది తాకట్టు పెట్టు. అప్పు తీర్చేవరకు ఆలపించవద్దు" అన్నాడు ఋణదాత. సరేనన్నాడు నర్సీ.

అప్పు తిరిగి ఈయలేకపోయాడు. ఈలోగా నర్సీపై ఒక అభియోగం మోపబడింది. రాజు సమక్షంలో విచారణ.

నర్సీ తను నిరపరాధినన్నాడు. నేరం గురించి తనకేమీ తెలియదన్నాడు. సాక్షాత్తూ కృష్ణుడే వచ్చి తాను ధరించిన మాలను నీ మెడలో వేస్తే నీ మాటలు నమ్ముతామన్నారు న్యాయాధీశులు.

కేదార రాగాన్ని ఆలాపిస్తే కృష్ణుడు పలుకుతాడని, వచ్చి రక్షిస్తాడని తెలుసు నర్సీకి. కానీ తాకట్టు కారణంగా ఆ రాగం పాడడానికి వీలుకాదుకదా! నర్సీని శిక్షించమని పట్టుబడుతున్నారు అసూయాగ్రస్తులు.

భక్తుని అవస్థను గ్రహించిన కృష్ణుడు ఋణదాత వద్దకు నర్సీ రూపంలో వెళ్లి బాకీ తీర్చి తన రాగాన్ని తనకిమ్మన్నాడు. బాకీ తీరిందనే పత్రాన్ని రాసి ఇచ్చాడతను.

అది పట్టుకుని కృష్ణుడు మారురూపంలో వచ్చి నర్సీ ముందు పడవేశాడు. ఆశ్చర్యపడుతూనే నర్సీ కేదార రాగాన్ని ఆలాపించాడు. సంతుష్టుడైన కృష్ణుడు ప్రత్యక్షమై తన దండను ఇతని మెడలో వేసి తృటిలో అదృశ్యుడయ్యాడు. రాజుతో సహా అందరూ నర్సీకి. సాష్టాంగ నమస్కారాలు చేసేరు.

ఒక అడుగు మనం ముందుకు వేస్తే వంద అడుగులు ముందుకు వేస్తూ స్వామి ఆదుకుంటాడని, నా గొప్పేదేముందని సవినయంగా నర్సీ వారిని వారించాడు. ■




బాగా హిట్ అయిన చిత్రాన్ని తమిళ రంగం నుంచే కాకుండా హిందీ నుంచి కూడా తీసుకుని, హక్కుల్ని కొని తెలుగులో పునర్నిర్మించటం ఎప్పట్నించో జరుగుతున్నదే...! కె.అమర్‌నాథ్ నిర్మించగా 1957లో విడుదలయిన 'బడాభాయ్' హిందీ చిత్రం హక్కుల్ని సుందర్‌లాల్ నహతా - డూండీ కొని, రాజశ్రీ ప్రొడక్షన్స్ పతాకంపై 'శభాష్ రాముడు' పేరిట తెలుగులో పునర్నిర్మించారు. హిందీలో అజిత్, కామినీ కౌశల్, అనంత్ మరాఠే, అమిత, నసీర్‌హుస్సేన్, జయంత్, కుంకుం, పాత్రల్ని తెలుగులో ఎన్.టి.ఆర్, దేవిక, జె.వి.రమణమూర్తి, మాలిని, గుమ్మడి, ఆర్.నాగేశ్వరరావు, ఎమ్.ఎన్.రాజం నటించారు. కామిడీ ట్రాక్‌కి మాత్రం - రాజ్‌ఖోస్లా దర్శకత్వంలో దేవానంద్, వహిదారెహమాన్‌తో గురుదత్ నిర్మించగా 1956లో విడుదలైన 'సి.ఐ.డి'చిత్రంలోని జానీవాకర్ పాత్రకు సంబంధించిన కొన్ని సన్నివేశాల్ని ప్రేరణగా తీసుకున్నారు. 1959లో విడుదలయిన

# శభాష్‌రాముడు

చిత్రంలో ఘంటసాల సంగీత నిర్వహణలో ప్రజాదరణ పొందిన ఓ నాలుగు పాటలివి.



అతడు: హల్లో డార్లింగ్ మాట్లాడవా
మురిపిస్తావ్ మెరిపిస్తావ్
దరి కొస్తే గొడవా
ఆమె: మాటా మంతీ మనకెందుకోయ్
సరిసరిలె నిర్వాకం తెలిసింది పోవోయ్
అతడు: మన ప్రేమ మరిచేవా కనికరం లేదా
ఆమె: కనికరం మమకారం అనకింక నాతో
అతడు: ఏమే చిలుకా ఇంకా అలుకా
మురిపిస్తావ్ మరిపిస్తావ్ దరికొస్తే గొడవా
దయగంటె మొరవింటె నీ పాదాల్ పడతా
మనలోన మనకేమి తలవొంపే చిలక
దండాల్ పెడతా సెల్యూట్ కొడతా
మురిపిస్తావ్ మెరిపిస్తావ్ దరికొస్తే గొడవా
ఆమె: పదిమంది ఇదివింటె పరువా మరియాదా
అతడు: వదిలేస్తా వొట్టేస్తా ఇదిగో నీ మీదా
ఆమె: అయితే సరిలే
అతడు: రైటో పదవే
ఇద్దరు: మనసొకటే మాటొకటే మనజీవాలొకటే

ఈ పాటను సదా శివబ్రహ్మం వ్రాయగా పిఠాపురం నాగేశ్వరరావు, జమునారాణి ఆలపించారు. రేలంగి, గిరిజపై చిత్రీకరించారు. పైన ఉదహరించిన సి.ఐ.డి చిత్రం కోసం ఓ.పి.నయ్యర్ సంగీత దర్శకత్వంలో రఫీ పాడగా హాస్య నటుడు జానీవాకర్ అభినయించిన 'ఏ దిల్‌హై ముష్కిల్ జీనా యహా' పాట ట్యూన్‌ని ఈ పాటకు యధాతథంగా వాడుకోవటం జరిగింది. శంకరాభరణం స్వరాలతో వచ్చే మేజర్ కార్డ్స్‌ని ఉపయోగించుకుని చేసిన 'కార్డ్స్ కంపొజిషన్'లో అద్భుతమైన స్వర రచనగా పేరుతెచ్చుకున్న మాతృతకు ఏ మాత్రం అన్యాయం జరగని రీతిలో మన వాతావరణానికి అనువుగా మలచుకోవటంలో అందరూ కృతకృత్యులయ్యారనే చెప్పాలి.

జయమ్ము నిశ్చయమ్మురా భయమ్ము లేదురా
జంకు గొంకు లేక ముందుకు సాగిపొమ్మురా
సాగిపొమ్మురా ॥జయమ్ము॥
ఏనాటికైన స్వార్థమూ నశించి తీరునూ ॥ఏనాటి॥
ఏ రోజుకైన సత్యమే జయించి తీరును జయించి తీరునూ
కష్టాల కోర్చుకొన్ననే సుఖాలు దక్కును
సుఖాలు దక్కునూ ॥జయమ్ము॥
విద్యార్థులంతా విజ్ఞానం సాధించాలి ॥విద్యా॥
విశాల దృష్టి తప్పకుండ బోధించాలి బోధించాలి
పెద్దలను గౌరవించి పూజించాలి పూజించాలి ॥జయమ్ము॥
కష్టాల కోర్చు కొన్ననే సుఖాలు దక్కును సుఖాలు దక్కునూ
ఈ లోక మందు సోమరులై ఉండకూడదు ఉండకూడదు
పవిత్రమైన ఆశయాలు మరువకూడదు
మరువకూడదు ॥జయమ్ము॥
గృహాన్ని స్వర్గసీమగా చేయుము దేవా బ్రోవుముదేవా
కుటుంబ మొక్క త్రాటి పైన నిలుపుము దేవా నడుపుము దేవా
బీదసాద నాదరించు బుద్ధి కొసగుమా శక్తి నొసగుమా ॥జయమ్ము॥
గాడాంధకారమలముకొన్న భీతి చెందకు ॥గాఢా॥
సందేహపడక వెలుగు చూపి సాగు ముందుకూ సాగు ముందుకు
నిరాశలోన జీవితాన్ని కృంగదీయకూ కృంగదీయకు ॥జయమ్ము॥
పరాభవమ్ము కల్గునంచు పారి పోకుమోయ్
జయమ్ము నిన్వరించుదాక పోరి గెల్వవోయ్ పోరిగెల్వవోయ్
స్వతంత్ర యోధుడన్న పేరు నిల్వబెట్టవోయ్
నిల్వబెట్టవోయ్ ॥జయమ్ము॥



ఈ పాట ఆ రోజుల్లో విపరీతమైన హిట్. 'బడాభాయ్' చిత్రంలోని 'కదమ్ బడాకె జా ... నడర్ ... కదమ్ బడాకే జా' పాటను కొద్ది మార్పులతో స్వరపరిచి ఈ పాటను మలచుకోవటం జరిగింది. ఘంటసాల, సుశీల, తమిళ గాయని ఎమ్మెస్ రాజేశ్వరి కలిసి బృందంతో పాడిన 'జయమ్ము నిశ్చయమ్మురా' పాటను సినిమాలో మూడు బిట్‌లుగా చూపిస్తారు. మొదటి బిట్‌ని తెలుగు చిత్రాల తొలి తార సురభి కమలాభాయ్‌ని రిక్షాలో ఎక్కించుకొని తొక్కుతూ ఎన్.టి.ఆర్ అభినయించారు. విఠలాచార్య చిత్రాలలో ఎక్కువగా పాల్గొనే హాస్యనటుడు మోతూకూరి సత్యం ఈ బిట్‌లో ఎన్.టి.ఆర్ ప్రక్కన జూనియర్ ఆర్టిస్ట్‌గా కనిపిస్తాడు కూడ. రెండో బిట్‌ను, మూడో బిట్‌ను, రమణ మూర్తి, బేబీ శశికళ, దేవిక అభినయించగా సన్నివేశ పరంగా ఇంటర్‌కట్స్‌లో ఎన్.టి.ఆర్ కూడా కనిపిస్తారు. సింధుభైరవి రాగంలో వచ్చిన పాటల్లో ఒక మంచి పాటగా ఉదహరించవచ్చు ఈ గీతాన్ని. జానపద గీతాలకు పేరెన్నికగన్న కొసరాజు రాఘవయ్య చౌదరి ఈ పాటను వ్రాశారన్న నిజం - క్యాసెట్ కంపెనీల వారికి తెలియరాలేదంటే ఇవాళ ఆశ్చర్యపోవడం తప్ప ఇంకేం చేయగలం!?

రేయి మించెనోయ్ రాజా
హాయిగ నిదురించరా హాయిగ నిదురించరా ॥రేయి॥
వెల్లి విరిసి వెన్నెల్లు కాసే
చల్లన్ని చిరుగాలి మెల్లంగ వీచె ॥వెల్లి॥
స్వప్నాలలోనా స్వర్గాలు కంటూ
స్వర్గాలలో దేవగానాలు వింటూ
హాయిగ నీవింక నిదురించవోయి ॥రేయి॥
చీకటి వెంటా వెలుగేరాదా
కష్ట సుఖాలు ఇంతే కాదా
చింతావంతా నీకేల నోయి
అంతా జయమౌను శాంతించవోయి
హాయిగ నీవింక నిదురించవోయి ॥రేయి॥

ఈ పాటను సదా శివబ్రహ్మం వ్రాయగా సుశీల ఆలపించారు. దేవిక, ఎన్.టి.ఆర్ అభినయించారు. రాగ నిర్ధారణకు దొరకని మిశ్రమ స్వరాలతో స్వరపరిచిన ఈ 'విశ్రమ గీతం' (విశ్రమించటానికి ఉపయోగించిన గీతం) - జోలపాటంటే ఇలా ఉండాలని అనిపిస్తుంది.

ఆమె : కల కల విరిసి జగాలే పులకించెనే ॥కలకల॥
అతడు : వలపులు కురిసి సుఖాలే చిలికించెనే ॥కలకల॥
ఆమె : అలరుల తోటా అందాల బాటా
హాయిగ పాడే కోయిల పాట కోయిలపాట
అతడు : తెలియని కోరికలేవో కలిగించెనే ॥కలకల॥
ఆమె : చల్లని గాలీ మెల్లగవీచే
హృదయము దూసీ మనసేదోచే మనసేదోచే
అతడు : మనసులు నిండి ప్రణయాలే చెలరేగెనే ॥కలకల॥
అతడు : చెలి చూపులలో అనురాగాలూ
నిజమేనా అని అనుమానాలూ అనుమానాలు
ఆమె : సందేహాలేలా హృదయాలే మన సాక్షులు ॥కలకల॥

ఈ పాటను ఘంటసాల,సుశీల ఆలపించారు. రమణమూర్తి, మాలిని అభినయించారు. 'బడాభాయ్' చిత్రంలోని 'చోరి చోరి దిల్‌కా లగానా బురీ బాత్ హై' పాటకు 'కలకల విరిసే' పాట యధాతథంగా అనుసరణ. మధ్యమావతి రాగాన్ని అధారంగా చేసుకుని స్వరపరిచిన ఈ 'చోరిచోరి దిల్‌కా' పాట వింటుంటే 'మాంగల్యబలం' చిత్రంలో 'ఆకాశ వీధిలో అందాల జాబిలి' పాటను ఈ పాటలోంచే తీసుకున్నారని మ్యూజిక్ ఇయర్ లేని వారికి కూడా తెలిసిపోతుంది. ఆ 'ఆకాశ వీధిలో అందాల జాబిలి' పాటకి గాని ఈ 'కలకల విరిసే జగాలే పులకించెనే' పాటకి గాని సాహిత్యాన్ని సమకూర్చింది శ్రీశ్రీయే అన్న విషయాన్ని ఇక్కడ ఓ విశేషంగా చెప్పుకోక తప్పదు మరి.

ఈ సందర్భంగా నాషాద్ అనే ఓ స్వరకర్త గురించి ప్రస్తావించి తీరాలి. నాషాద్ అంటే నౌషాద్ అని పొరబడే వాళ్ళు ఎంతో మంది ఉన్నారు. 'బరాదరి' చిత్రంలో తలత్ మొహమ్మద్ పాడిన 'తస్‌వీర్ బనాథా హూ తక్‌ధీర్ నహీ బన్‌తీ' పాటను ఇప్పటికీ మరిచిపోలేని వారు ఎంత మంది ఉన్నారో ఆ పాటను స్వరపరిచిన నాషాద్ గురించి తెలియని వాళ్ళు కూడా అంతకు మించే ఉన్నారు. 'బరాదరి' (1955) చిత్రానికి సంగీతాన్నిచ్చిన నాషాద్ 'బడాభాయ్' చిత్రానికి కూడా స్వరరచన చేశారు. నగ్మా (1953) చిత్రానికి కూడా నాషాదే సంగీత దర్శకత్వం వహించారు. చక్కటి సంగీతాన్ని ఇచ్చే నాషాద్ బాలీవుడ్‌లో ఇమడలేక 1970లో పాకిస్తాన్‌కు వెళ్ళిపోయి, అక్కడే మనుగడ సాగిస్తూ, 31.01.1981న మరణించారని ఆయన్ని అభిమానించే ఆప్తులు సేకరించిన సమాచారంలో ఉంది. ◆

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 11

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహదూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్విని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర . సంక్రాంతి పండుగకు అల్లుడు రాజేంద్ర, కూతురు గీతలు వస్తారు. మావల సంఘం సెక్రటరీ అప్పారావు ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించినట్టు వీరభద్రానికి తెలుస్తుంది. అత్తగారి కోరిక మేరకు తనకు రావలిసిన కట్నం బాపతు సొమ్ము రాబట్టు కోవడానికి ఒక సంవత్సరం గడువిస్తాడు రాజేంద్ర. కాలేజీనుండి ఇంటికి బయలుదేరిన శ్రీరామ్‌ను తన ఇంటికి తీసుకెళ్లి తండ్రికి పరిచయం చేస్తుంది అశ్విని. శ్రీరామ్ వివరాలను కనుక్కున్న విష్ణుమూర్తి తన కుమార్తె వివాహ విషయమై చర్చింటానికి తన మిత్రులతో కలసి వీరభద్రం ఇంటికి వస్తాడు.

-(ఇక చదవండి)

కారు హాస్టల్ దగ్గర ఆగింది.
డోరు తెరవబోయాడు శ్రీరామ్... అతని చేతిమీద తన చేయి వేసింది అశ్విని -
"నన్ను మర్చిపోవుగా?" - అతని కళ్ళల్లోకే చూస్తూ - దీనంగా అడిగింది.
'మర్చిపోనని' చెప్పాలనుకున్నా - ఎందుకో పెదవి విప్పి మాట్లాడలేక, ఆమెవైపు అలాగే, ఆరాధనాభావంతో చూస్తూండి పోయాడు.
"రామ్! నేను మాత్రం నిన్ను మర్చిపోలేను... ఎందుకంటే, ఏనాడో నేను మానసికంగా నీదాన్నయిపోయాను కనుక!.. వేరెవరినైనా పెళ్లి చేసుకున్నా నేను సుఖపడలేను, అతన్ని సుఖపెట్టలేను!.. అందుకే ఈ జీవితానికి ఇలాగే వుండిపోవాలని నిశ్చయించుకున్నాను!" -
ఆమె తనను బెదిరిస్తోందో, లేక మనస్ఫూర్తిగా తన నిర్ణయాన్ని చెప్తోందో అర్థం చేసుకోలేక పోయాడు శ్రీరామ్.
"రామ్! నాదో చిన్న రిక్వెస్టు!" - వెంటనే అందామె మళ్లీ.
ఏమిటన్నట్టు చూశాడు
నీ పెళ్లికి దయుంచి నన్ను పిలవద్దు!.. నాకు శుభలేఖ కూడా అసలు పంపొద్దు!..."
అయోమయంగా చూశాడతను.
"ఎందుకంటే - నాకెంతటి ధైర్య సాహసాలున్నా - నేనెంత మొండిఘటాన్నైనా - నీ భార్య స్థానంలోకి వేరెవరో వచ్చేశారన్న 'ఫీలింగు'ని నేను భరించలేను.. ఆ దృశ్యాన్ని చూసి, నా ఈ చిన్న గుండె తట్టుకోలేదు!" -
ఆమె కళ్ళల్లో కనిపించిన కన్నీటిని చూసి శ్రీరామ్ కదిలిపోయాడు -
"నన్ను క్షమించు అశ్వినీ!.. నేను అసమర్థుణ్ణి!.. పిరికివాణ్ణి..! అంతేకాదు- నువ్వంటే ప్రేమలేక కాదు...!ఐ లవ్ యూ వెరీమచ్! కానీ నా బలహీనతేమిటో నీకు తెలుసు!" - మళ్లీ పాతపాటే, కొంచెం కొత్త బాణీలో పాడేడు.
అంతలో, ఏదో ఆలోచన వచ్చిన దానిలా - అతని వైపు సూటిగాచూసి అడిగిందామె -




"పోనీ... ఓ పని చేస్తే?"
"ఏమిటీ?"
"మీ నాన్న గారితో - మన ప్రేమ గురించి కుండ బద్దలు కొట్టినట్టుగా చెప్పేసి - పెళ్లికి ఒప్పించే ధైర్యం నీలో కలిగిస్తే...?"
"ఇంపాజిబుల్! అనవసరంగా కుండ బద్దలవుతుందే తప్ప - నాలో ధైర్యం కలగదు..!"
"నేను కలిగిస్తాను" దృఢమైన స్వరంతో చెప్పిందామె.
"నువ్వా?...ఎలా?"
"తావీజ్ మహిమ!"
"అంటే....?" - అర్థం కాలేదతనికి
"రసూల్ బాబా దగ్గర తాయెత్తు తీసుకుని కట్టుకో!... నీక్కూడా ధైర్య సాహసాలూ శక్తియుక్తులూ వస్తాయికదా?"
"వస్తే...?"
"ఏముందీ?..ధైర్యంగా మీ నాన్నగారితో చెప్పేసి - 'కన్విన్స్' చేయచ్చు!" శ్రీరామ్ ఆలోచనలో పడ్డాడు -
'అశ్వినిని పెళ్లిచేసుకుంటే బావుండునని - తన మనసు పొరల్లో ఎక్కడో కోరిక లేకపోలేదు.. పైగా తన మేనత్త కూతురు శ్యామసుందరి, సంసారపక్షంగా వున్నప్పటికీ - అశ్వినితో పోల్చి చూస్తే - అన్నివిధాలా తక్కువే!.. అశ్వినికి చదువుంది, అందముంది ... అన్నింటికీ మించి కోట్ల ఆస్తికి ఏకైక వారసురాలు...!'
తన తండ్రి చాదస్తం వల్లా - మూర్ఖత్వం వల్లా - చిన్నతనంనించీ ఆయన పట్ల ఏర్పడ్డ భయభక్తుల వల్లా - కాళ్ళదగ్గరకొచ్చిన 'కనక మహాలక్ష్మి' లాంటి అశ్వినిని ఇంతకాలంగా, కాదుపొమ్మంటున్నాడు తను...!'
'అసలు - పెళ్ళి చేసుకునేది జీవితంలో సుఖపట్టానికే కదా?... జీవితంతో రాజీ వడేందుకు కాదుగా?... ఎవరి ఇష్టాయిష్టాలకో తల వంచే కంటే - తాను మనసుపడే అమ్మాయిని చేసుకోటంలో తప్పేమిటీ?... ఈ లోకంలో ఎంతమంది ప్రేమించి పెళ్లి చేసుకోవటంలేదూ?'
'ఇప్పుడు రసూల్ బాబా ఇచ్చే తావీజు కట్టుకుంటే - తన అదృష్టం మారిపోవచ్చు. తన వ్యక్తిత్వం కొత్తమలుపులు తిరగచ్చు!'
కానీ...మంత్రాలకు చింతకాయలు రాల్తాయా?
'ఏమో - ఏ పుట్టలో ఏ పాముందో...? ప్రయత్నించటంలో తప్పు లేదుగా?.. తాను చేసే సాహసానికి తండ్రి తలవంచితే - అశ్విని తన స్వంతమవుతుంది... బెడిసికొడితే - తన శ్యామసుందరి తనకు ఎలాగూ వుంటుంది..!'
అలా ఆలోచనల ప్రవాహంలో కొన్ని క్షణాలు కొట్టుకుపోయి - తర్వాత అడిగేడు శ్రీరామ్ -
"కానీ ఆ బాబా ఎవరో మనకి - అయ్ మీన్ - అదే, నాకు -తాయెత్తు ఇస్తారంటావా?"
"ఓ..యస్! తప్పకుండా ఇస్తారు...మన అదృష్టం బావుండి వందేళ్ళు పైబడినా ఆయనింకా బ్రతికేవున్నారు....నువ్వు "ఉ" అన్నావంటే - ఇప్పుడే నిన్ను ఆయన దగ్గరకు తీసుకెడతాను" చెప్పింది అశ్విని ఉత్సాహంగా.
"సరే .."ఉ" అంటున్నాను! నీ ఇష్టం!" అన్నాడు శ్రీరామ్.
"హుర్రే" అంటే కారులోనే ఎగిరి గంతేసి తర్వాత కారు రివర్స్ చేసి మశీదువైపు వేగంగా పోనిచ్చింది అశ్విని.

* * *

ఇరుకు సందులోకి నెమ్మదిగా వచ్చిన కారు శిథిలావస్థలో వున్న ఓ చిన్న పెంకుటింటి ముందు ఆగింది....పక్కనే వున్న మశీదు లోంచి 'నమాజు' విన్పిస్తోంది.. ఆ ఇంటి గుమ్మం ముందు బక్కచిక్కిన రెండు కుక్కపిల్లలు సరసాలాడుకుంటున్నాయి.



అశ్వినీ.....శ్రీరామ్‌లు -కారుదిగి గుమ్మం దగ్గర కొచ్చారు. వాళ్ళిద్దర్నీ చూసిన కుక్కపిల్లలు,తమ సరసాలాపి - సీరియస్‌గా మొరగటం ప్రారంభించాయి. శ్రీరామ్ భయపడి ఓ అడుగు వెనక్కి వేశాడు...అశ్విని మాత్రం నిర్భయంగా ముందుకు నడిచి-గుమ్మానికి వేలాడుతున్న 'గోనె బరకం' లాంటి తెర తొలగించి లోపలకు చూస్తూ 'బాబా' అని పిలిచింది.

''కౌన్? ..అందర్ ఆయియే!''..లోపల్నించి బాబా గొంతు వినిపించింది.

"బాబా ఇంట్లోనే వున్నారు...కమాన్" అంటూ శ్రీరామ్ చేయి పట్టుకుని లోపలకు తీసుకెళ్ళింది....

కుక్కలు రెండూ..మొరగటం మానేసి ..బుద్ధిగా దారిచ్చాయి.

"ఇది కూడా తావీజు మహిమే కాబోలు" అనుకున్నాడు శ్రీరామ్. లోపలి గదిలో ..ఓ కుక్కిమంచం మీద కూర్చుని'హుక్కా' పీలుస్తున్నాడు రసూల్‌బాబా...మంచం ముందు ఓ ముక్కాలి పీట ..పక్కనే కొన్ని పింగాణీ పాత్రలూ....మంచినీళ్ళ కూజా ...వున్నాయి. గోడమీద వానకు తడిసిపోయి నట్టున్న 'మక్కామశీదు' కేలండరూ.. ఆగిపోయిన గడియారం కనిపిస్తున్నాయి...గది మధ్యగా కుట్టిన దండెం మీద రంగుల వెలిసిపోయిన లాల్చీలు వేలాడుతున్నాయి.

"కౌన్ హై?" చేయి నుదుటికి అడ్డం పెట్టుకుని తల ముందుకు సాచి భూతద్దాల కళ్ళజోడులోంచి చూస్తూ అడిగేడు బాబా..

''నేను బాబా! .....విష్ణుమూర్తి గారి అమ్మాయిని!"

"నువ్వా బేటీ ? ..బావున్నావా?...మీ నాయన కులాసాయేనా?" అడిగేడు.

అతను అచ్చతెలుగులో మాట్లాడటం చూసి ముచ్చట పడ్డాడు శ్రీరామ్...బాబా అడిగిన కుశల ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పింతర్వాత, అతనికి శ్రీరామ్‌ని పరిచయం చేసింది..తర్వాత చెప్పింది....!




"ఇతనికి ఓ తాయెత్తు కావాలి బాబా !"

"దేనికి?"

"అదే ...అప్పుడెప్పుడో ఓసారి నాకోసం మా డాడీ అడిగితే, నువ్వు మంత్రించిన తాయెత్తు ఇచ్చావు కదా...! ..అలాంటిదే ఇతనికీ కావాలి!"

''ఈ మధ్య నేను తావీజులు ఇవ్వటం మానేశాను బేటీ!... పైగా చాలా మందికి వాటిలో నమ్మకం తగ్గిపోయింది..ఎవరూ రావటం లేదు....!"

"నాకు మాత్రం నువ్విచ్చిన తావీజు మీద గొప్పనమ్మకం వుంది బాబా...ఇదిగో.... దాన్ని నా లాకెట్లో వేసుకున్నాను!" మెడలో గొలుసుకున్న లాకెట్టు తీసి చూపించింది...

ఓసారి 'హుక్కా' గొట్టం నోట్లో పెట్టుకుని ఏదో ఆలోచించినట్టుగా రెండు క్షణాలు శూన్యంలోకి చూసి చెప్పాడు బాబా...

"అచ్చా! రేపు శుక్రవారం కదా!... నమాజ్ చేసి ..తావీజు మంత్రించి ఇస్తాను!"

"సరే !" సంతోషంగా చూసింది అశ్విని.

"కానీ ..నేను ఇవాళే మా ఊరు వెళ్ళి పోవాలనుకుంటున్నానే?" శ్రీరామ్ చెప్పాడు.

"ఇవ్వాల్టికీ ..రేపటికీ కొన్ని గంటలేగా తేడా?...రేపు బస్టాండుకి వెళ్ళేటప్పుడు 'ఆటో' ఇక్కడ ఆపుకుని తాయెత్తు తీసుకో" సలహాఇచ్చింది.

"అయిసా కరో బేటా!" అన్నాడు బాబా...

ఇద్దరూ ఆయన దగ్గర శలవు తీసుకుని బయటకొచ్చి మళ్ళీ కారెక్కారు...కార్లో కూర్చోగానే 'డాష్‌బోర్డ్' ఓపెన్ చేసి, అందు లోంచి ఓ సెల్‌ఫోనూ, ఓ పెద్దపుస్తకం తీసి అతనికిచ్చింది అశ్విని.

"మీ ఇంట్లో ఫోన్ లేదుగా?" ..అందుకే 'సెల్‌ఫోన్' కొన్నాను నీకోసం..నా సెల్ నెంబరు ఇందులో 'సేవ్' చేశాను.. ప్రతిరోజూ నాతో మాట్లాడాలి!" ..శ్రీరామ్ రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు...

ఆమె మళ్ళీ చెప్పింది

"ఇక ఆ పుస్తకం "విజయానికి అయిదు మెట్లు"! మీ ఊరు వెళ్ళగానే ఆ పుస్తకంలో నేను మడత పెట్టివుంచిన 'ఛాప్టరు' ముందుగా చదవాలి!"

* * * *

కుడి చేత్తో 'కీచైన్' తిప్పుకుంటూ ..పరుగు లాంటి నడకతో హుషారుగా లోపలకు వచ్చిన అశ్విని..తలక్రిందులుగా పేపరు పట్టుకుని 'గుప్పు గుప్పు'న 'పైప్' పీలుస్తూ...సోఫాలో కూర్చునివున్న తండ్రిని చూసి సడెన్‌గా ఆగిపోయింది.

"డాడీ"...అనుమానంగా చూస్తూ పిలిచింది. విష్ణుమూర్తి ఇంకా అదే పోజులో వున్నాడు.

"అదేమిటిడాడీ! ...పేపరు తలక్రిందులుగా చూస్తున్నారేమిటి?" పక్కనే కూర్చుంటూ అడిగింది.

''అవును బేబీ!.నా ఆశలు తల్లక్రిందు లయ్యాయి?" చెప్పాడు.

అందుకు అశ్విని పెద్దగా 'రియాక్ట్' కాలేదు... కాకపోగా -ఎంతో ఉత్సాహంగా చెప్పింది.

"కానీ నా ఆశలు ఫలించాయి డాడీ! మీకు ఆ 'శుభవార్త' చెప్పాలనీ, ఎనభైమైళ్ళ స్పీడులో వచ్చాను!"

"నేను చెప్పబోయే 'అశుభవార్త' విన్నావంటే.. నీకు నూట నాలుగు డిగ్రీలు జ్వరం వస్తుంది."

"అశుభవార్త?...ఏమిటదీ?"

"ముందు నీ శుభవార్తేమిటో నువ్వు చెప్పు... ఆ తర్వాత నేను చెప్తాను!"

''నన్ను పెళ్ళిచేసుకోవటానికి శ్రీరామ్ ఒప్పుకున్నాడు డాడీ...! అతన్ని నా దారికి తెచ్చుకున్నాను!" చెప్పింది అశ్విని గర్వంగా.

"కానీ, నిన్ను కోడలుగా చేసుకునేందుకు వాళ్ళ 'బాబు' ఒప్పుకోలేదు...! వాడొప్పుకున్నా నేను ఒప్పుకోను..!... అదే నేను నీకు చెప్పదల్చుకున్న అశుభవార్త!" చేతిలోని పేపర్ని టీపాయ్ మీదకు విసిరేస్తూ చెప్పాడు కోపంగా.

-(ఇంకావుంది)



రచన : వీటూరి    గానం : ఘంటసాల

ఆలయాన వెలసిన ఆ దేవుని రీతి
ఇల్లాలే ఈ జగతికి జీవనజ్యోతి ॥ఆలయాన॥
పతిదేవుని మురిపించే వలపులవీణ
జీవితమే పండించే నవ్వులవాన ॥పతి॥
కష్టసుఖాలలో తోడూనీడగా
తల్లిని మరిపించే యిల్లాలి ఆదరణా ॥కష్ట॥
మగువేగా మగవానికి మధురభావనా ॥ఆలయాన॥
సేవలతో అత్తమామ సంతసించగా
పదిమందిని ఆదరించు కల్పవల్లిగా ॥సేవ॥
తనయుని వీరునిగా పెంచే తల్లిగా
సతియే గృహసీమను గాచే దేవతగ
సృష్టించెను ఆ దేవుడు తనకు మారుగా ॥ఆలయాన॥

రచన : పాలగుమ్మి పద్మరాజు    గానం : పి.బి. శ్రీనివాస్, జానకి

హేమ: భళారే ధీరుడ నీవేరా వహవ్వా
వీరుడ నీవేరా...వయ్యారీ భామ
వచ్చెరా నీకు ప్రేమ నిచ్చెర ॥భళారే॥
చుక్కల్లో చంద్రుడినీవు చక్కనైన చుక్కను నేనూ
బ్రతుకంతా వెన్నెలపంట మదన మోహనా....ఓ ఓ ఓ॥చుక్కల్లో॥
కుమార్:ఎగరాల గువ్వల జంటై రివ్వున మింట
పాడాలి కమ్మనినోట తియ్యని పాట ॥ఎగరాల॥
ఇద్దరూ: పాడాలి పువ్వుల బాటా నా వరాల మూట హేమ:॥భళారే॥
కుమార్:నీ నవ్వుల నవరత్నాలు నీ చూపుల కొంటెతనాలు
మాయదారి నాగకుమారి మతులు పోయెనే ఓ ఓ ఓ॥నీ నవ్వుల॥
హేమ: కలిసింది వరుసా వావి ముద్దుల బావ
కుదిరింది ఈడూ జోడూ మనకీనాడు ॥కలిసింది॥
ఇద్దరు: నీలాల పందిరికింద నీకూ నాకు పెళ్ళి
హేమ: భళారే ధీరుడా నీవేరా వహవ్వా వీరుడ నీవేరా
వయ్యారి భామ వచ్చెరా నీకూ ప్రేమ నిచ్చెర ॥భళారే॥

రచన : వీటూరి    గానం : సుశీల

అందములొల్కు మోముపై
హొస విలాస మనోజ్ఞరేఖలే చిందులువేయ
వాల్కనుల సిగ్గులు మొగ్గలుపూయ
అందియల్ సందడిసేయ
కాంతివలె చల్లగ జానకి వచ్చె
ఓరగా సుందరుడైన రాఘవుని చూచె
తటాలున పూలమాలికా బంధమువైచె
దేవతలు పాడగా..లోకము సంతసించగా ఆ.. ఆ.. ఆ..

రచన : వీటూరి    గానం : మాధవపెద్ది

ఈతడే ట్రాజెడీ యాక్టింగులో కింగు
హింది ఫీల్డుకు ప్రాపు ఈ దిలీపు
నటనలో హ్యూమరు నటులకే గ్రామరు
రాణించు గ్లామరు రాజ్‌కపూరు
రాముడై ఇలతోటరాముడై -జగదభి
రాముడై వెలిసిన రామరావు...
వాసిగా అల దేవదాసుగా కవి కాళి
దాసుగా వెలుగు నాగేశ్వరుండు
మ్రోగు జగ్గయ్య కంఠము ఖంగు ఖంగు
దంచు విలనుని కాంతారావు గుంజీ -గుంజీ-గుంజి గుంజి
ఇతడు బాలయ్య రమణమూర్తితడు చలం
అబ్బ వీరిని పొగడ నీ అబ్బతరమే
బ్బెబ్బెబ్బె - నా అబ్బతరమె ఆ...ఆ...ఆ....ఆ...ఆ...ఆ...

రచన : వీటూరి    గానం :ఘంటసాల, సుశీల

ప్రసాద్: కన్నుల్లో మిసమిసలు కనిపించనీ
గుండెల్లో గుసగుసలు వినిపించనీ
కన్నుల్లో మిసమిసలు కనిపించనీ...
సీత: నీ చూపుతో నన్ను ముడివేయకూ
ఈ పూలు వింటాయి పడిచేయకూ
నీ చూపుతో నన్ను ముడివేయకూ...
సెలయేరు నవ్వుతుంది చిరుగాలి చూస్తుంది
నాపైట చెంగులాగి కవ్వించకూ ॥సెలయేరు॥
ప్రసాద్: అనువైన వేళా అందాలు దాచకూ ॥2॥
అణువణువు నిన్నే కోరే మురిపించకూ
ఇకనైన నను సిగ్గు తెరవేయకూ సీత: ॥నీ చూపుతో ॥
సీత: ఎటుచూసినా నువ్వే వినిపించె నీ నవ్వే
మోహాలతో నన్ను మంత్రించకూ ॥ఎటుచూసినా॥
ప్రసాద్: మనలోని ప్రేమా మారాకు సేయనీ ॥2॥
మనసార ఒడిలో నన్ను నిదురించనీ
నీ నీలి ముంగురులు సవరించనీ సీత: ॥నీ చూపుతో ॥
ప్రసాద్: కన్నుల్లో మిసమిసలు కనిపించనీ
గుండెల్లో గుసగుసలు వినిపించనీ కన్నుల్లో మిసమిసలు కనిపించనీ...

రచన : దాశరథి    గానం: ఎస్.జానకి

అరె ఖుషీ ఖుషీ చేస్తేనే కలుగు హుషారు....
బలెబలె మొగుసులే వలపు సితారు ॥అరెఖుషీ॥
వలపు మజా చూపిస్తా యిటురావోయీ
ఖుషీఖుషీ చేస్తేనే కలుగు హుషారు
నాతో దీటైన నాయకుడు నీవేలే
నీకు సరియైన ప్రియురాలిని నేనేలే ॥నాతో॥
మల్లె విరజాజి మనసూ నీకేలే
గులాబిరేకు వంటి నా సొగసూ నీకేలే ॥మల్లీ॥
అందించిన అందాన్ని అనుభవించవోయ్
వృధా చేయకోయ్ చేజారనీయకోయ్
ఇదే సమయమోయ్..... ॥అరె ఖుషీగా॥
స్వర్గం ఎక్కడనో లేదోయీ మొనగాడా
అంతా నాలోనే వుందోయీ చెలికాడా ॥స్వర్గం॥
నిజాన్ని తెలుసుకుని భుజాలు కలుపుకొని ॥నిజాన్ని॥
సుఖాన్ని పొందాలి ఓ అందగాడా
విలువైన జీవితాన్ని అనుభవించవోయ్
వృధాచేయకోయ్ చేజారనీయకోయ్
ఇదే సమయమోయ్ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ॥అరె ఖుషీ॥

రచన : వీటూరి    గానం : ఘంటసాల

జగమెల్ల పరికించు చల్లని జాబిల్లి
సుదతి సీతను నీవు చూడలేదా
ప్రతి చరాచరముల పయనించు చిరుగాలి
జానకి నెటనైనా కానలేదా
కరుణతో విశ్వమ్ము భరియించు భూమాతా
చెలిజాడ నీవైన తెలుపరాద
తరులార గిరులార మెరయు తారకలార
పడతి ఏమయ్యెనో పలుకరాద
ఏది వైదేహి? జానకి ఏది?
సీత లేనిదే రాముడే లేడూ
లేడటంచు కరకు కొండల గుండెలే
కరగి మారుమ్రోగ ఎలుగెత్తి పిలిచెనా
రాఘవుండు సీతా..హో... సీతా.....

రచన : వీటూరి　　గానం :ఘంటసాల, సుశీల

అ: తొలి వలపే పదే పదే పిలిచే　ఎదలో సందడి చేసే
ఆ: తొలివలపే పదేపదే పిలిచే　మదిలో మల్లెలు విరిసే... తొలివలపే...
అ: ఏమో ఇది ఏమో నీ పెదవుల　విరిసే నవ్వుల పువ్వుల అందాలు
ఆ: ఆ అందం అనుబంధం నా మనసున నీకై కాచిన పూసిన కానుకలు
అ: ఏమో యిది ఏమో నీ పెదవుల　విరిసే నవ్వుల పువ్వుల అందాలు
ఆ: ఆ అందం అనుబంధం నా మనసున నీకై దోచిన పూచిన కానుకలు
అ: నీ కనుల వెలిగేనే దీపాలు
ఆ: అవి నీ ప్రేమకు ప్రతిరూపాలు　॥నీ కనుల॥
మన అనురాగానికి హారతులు
అ: తొలివలపే పదేపదే పిలిచే ఎదలో సందడిచేసే తొలివలపే॥తొలి॥
ఆ: గరి నిరిగా
అ: ఆ ఆ ఆ ఆ
ఆ: మగనిగమా
అ: ఆ ఆ ఆ ఆ
ఆ: గమ నీద నీదపా
అ: ఆ ఆ ఆ ఆ
ఆ: ఏలా ఈ వేళా కడువింతగ తోచె తీయగ హాయిగ ఈ జగమూ
అ: యవ్వనము అనుభవమూ జతకూడిన వేళా
కలిగిన వలపుల పరవశమూ　॥ఏలా ఈ వేళా॥
ఆ: ఈ రేయి పలికెలే స్వాగతమూ
అ: ఈనాడే బ్రతుకున శుభదినమూ　॥ఈ రేయి॥
ఈ తనువే మనకిక చెరి సగమూ　॥తొలి॥

రచన : కొసరాజు　　గానం : పద్మనాభం, యల్.ఆర్. ఈశ్వరి

కుమార్ : మావూరు మదరాసు, నాపేరు రాందాసు　॥2॥
కమ్మని నీ పోజు కవ్వించే ఈ రోజు　॥2॥
మదనపడి మనసుచెడి వచ్చాని అమ్మాయి
మావూరు మదరాసు, నాపేరు రాందాసు
హేమ : మావూరు బొంబాయి నాపేరు రాధాబాయి　॥2॥
ఏమిటి నీ బాధ ఏ మాత్రం నీ హోదా　॥2॥
ఆ విషయం ఆ వివరం చెప్పవోయి అబ్బాయి
మావూరు బొంబాయి నాపేరు రాధాబాయి
కుమార్: రోడ్లమీద కార్లున్నాయ్... బ్యాంకులో డబ్బులున్నాయ్॥2॥
దేవుడిచ్చిన కాళ్లున్నాయ్... చూడ్డానికి కళ్లున్నాయ్
మనబింకం మనపొంకం తెలిసిందా అమ్మాయి
మావూరు మదరాసు, నాపేరు రాందాసు
హేమ: క్యాడిలాక్ కారుందా ? న్యూ మోడల్ మేడుందా ? ॥2॥
ఇంటిముందు వ్యానుందా ? నిదురబోను ఫ్యానుందా?
కాఫీలకు సినిమాలకు కరువేమీ లేదు కదా?
మావూరు బొంబాయి నాపేరు రాధాబాయి
కుమార్: మావూరు మదరాసు నాపేరు రాందాసు
వూరు తిరగ బస్సుంది పబాం....పబాం...
వుండను ఫ్లాట్‌ఫారముంది హి...హి...　॥వూర తిరగ॥
కడుపునిండా నీరు త్రాగ కార్పొరేషన్ టాపుంది
ఏమున్నా.. లేకున్నా... ఏమున్నా లేకున్నా
మిన్నవిరిగనదొకటుంది... మిన్నవిరిగనదొకటుంది
హేమ : ఏముంది?
కుమార్: ప్రేమించే హృదయముంది
హేమ : అదే నాకు కావాలి... ఇతడె నన్ను ఏలాలి　॥అదే॥
కుమార్ : అబ్బాయిని అమ్మాయిని ఇద్దరినీ కనాలి　॥2॥
కుమార్,హేమ: హాపీగా తాపీగా... హాపీగా తాపీగా
బ్రతుకు పరుగు తీయాలి బ్రతుకు పరుగు తీయాలి
కుమార్ : మావూరు మదరాసు నాపేరు రాందాసు
హేమ : మావూరు బొంబాయి నాపేరు రాధాబాయి

రచన : సి. నారాయణరెడ్డి　　గానం : మాధవపెద్ది సత్యం,ఎస్.జానకి

ఒహో హో హో ఓ ఓ ఓ యా యా యా ఓ ఓ ఓ
ఆడ : నాకు నీవే కావాలె రా ఓ..ఓ..ఓ...
నీకు నేను కావాలె రా ఆ..ఆ..ఆ...
ప్రక్కన నువులేకుంటే...
ఒక్కదాన్నే వుంటె వూరంతా పడుకుంటే
ఏమో ఏమో ఏమేమొ అయరా　॥నాకు నీవె॥
మగ : ఒహో హో హో ఓ ఓ ఓ యా యా యా　ఓ ఓ ఓ
ఆడ: అద్దాన నీ రూపే ముద్దుగా కనిపించె
నిద్దరలో నీ పిలుపే కొద్దిగా వినిపించె
కలలో వస్తివి గమ్మత్తు చేస్తివి
అమ్మతోడు ఉలికులికి పడ్డానురా
నన్ను నమ్మరా ఇంక నమ్మరా
నిన్నిడిచి వుండలేనురా
ఓరయ్యో బలే ఓరయ్యో　॥నాకు॥
మగ : ఒడ్డున పోతుంటే ఒళ్ళు జల్లుమన్నాదే
పడవను నడుపుతుంటే పట్టుదప్పిపోనాదే
చేపలు పడుతున్నా ఏ పని చేస్తున్నా
అమ్మతోడు చూపంతా నీ మీదనే
నన్ను నమ్మవే ఇంక నమ్మవే
నిన్నిడిచి పోలేనులే
ఓలమ్మీ భలే ఓలమ్మీ
ఆడ : నాకు నీవే కావాలె రా ఓ..ఓ..ఓ...
నీకు నేను కావాలె రా ఆ..ఆ..ఆ...
మగ : ఓయ్
ఆడ : మెత్తని యిసుకుంది మత్తైన గాలుంది
కోరుకున్నపుడెల్ల కొబ్బరి నీరుంది
మగ : మెత్తని యిసుకేమి మత్తైన గాలికేమి
అన్నిటికి మించి నాకు నువ్వుంటివి
నీ అందమే ఆ ఆందమే పదివేల సొమ్మంటిని
ఓలమ్మీ బలే ఓలమ్మీ
ఆడ : ఓరయ్యో బలే ఓలమ్మీ　॥నాకు నీవె॥

రచన : శ్రీ శ్రీ　　గానం :ఘంటసాల

బ్రతుకంతా బాధగా కలలోని గాథగా
కన్నీటి ధారగా కరిగిపోయే
తలచేది జరుగదూ - జరిగేది తెలియదూ
బొమ్మనుచేసి ప్రాణముపోసి
ఆడేవు నీకిది వేడుకా　॥బొమ్మను॥
గారడిచేసి గుండెనుకోసి
నవ్వేవు ఈ వింత చాలిక　॥బొమ్మను॥
అందాలు సృష్టించినావు దయతో నీవు
మరలా నీచేతితో నీవే తుడిచేవులే
దీపాలు నీవె వెలిగించినావె
గాఢాంధకారాన విడిచేవులే
కొండంత ఆశ అడియాసచేసి　॥కొండంత॥
పాతాళ లోకాన త్రోసేవులే　॥బొమ్మను॥
ఒకనాటి ఉద్యానవనము నేడు కనము
అదియే మరుభూమిగా నీవు మార్చేవులే　॥ఒకనాటి॥
అనురాగ మధువు అందించి నీవు
హాలాహల జ్వాల చేసేవులే
ఆనందనౌక పయనించువేళ
ఆనందనౌక పయనించువేళ
శోకాల సంద్రాన ముంచేవులే　॥బొమ్మను॥

# కథా సంగ్రహం

"ఆలయాన వెలసిన ఆ దేవుని రీతి; ఇల్లాలె ఈ జగతికి జీవన జ్యోతి!"

ఒక దేశం యొక్క నాగరికత ఆ దేశంలోని స్త్రీ కుండే విలువను బట్టి నిర్ణయించవచ్చు అంటారు పెద్దలు. అనాదిగా స్త్రీ జాతియొక్క పవిత్రతను గుర్తించి, స్త్రీని దేవతామూర్తిగా అరాధించిన ఘనత ఒక్క భారతదేశానికే దక్కింది. అందుకే ఈ గడ్డపై ఎందరో ఇలవేలుపులు, కులదేవతలు, శీలవతులు ఉద్భవించారు.

ప్రసాద్ కలవారిబిడ్డ. లెక్చరర్‌గా పనిచేస్తూ వుంటాడు. అతని భార్య సీత. అన్నివిధాల అతనికి తగ్గ ఇల్లాలు. వారి దాంపత్యం ఆదర్శప్రాయమైనది. వారి నోములపంట మధు. తన స్నేహితుడైన రాకెట్ (కుక్క)తో ఇల్లంతా సందడి చేస్తుంటాడు. ప్రసాద్ తండ్రి లోకాభిరామయ్యగారు. రోజూ ప్రారంభించేది రామాయణమైనా పారాయణచేసేది మాత్రం లోకాభిరామాయణమే. పురాణం వినడానికి వచ్చిన శ్రోతలకు నిత్యం కాఫీ, భోజన తాంబూలాది సత్కారాలు జరిపిస్తూ ఉంటారు. ప్రసాద్ తల్లి పార్వతమ్మ. ఎప్పుడూ గుండెజబ్బుతో బాధపడుతూ వుంటుంది. ప్రసాద్ చెల్లెలు హేమ. కన్నె పిల్ల. స్కూలులో చదువుతూ ఉంటుంది.

వీరేకాక ఆ యింట్లో ఇంకొక విచిత్ర వ్యక్తి ఉన్నాడు. లోకాభిరామయ్య చెల్లెలి కొడుకు. తల్లిదండ్రులు పోయిన దగ్గర్నుంచి మేనమామగారింట్లోనే పెరిగి పెద్దవాడయ్యాడు. పెద్దలు పెట్టిన పేరు వరహాలు-కానీ ఎవరైనా అలా పిలిస్తే కస్సుమంటాడు,"ప్రేమకుమార్" లేక "ప్రేమ్" అని పిలువ మంటాడు. ప్రేమ్‌కుమార్‌కి సినిమా పిచ్చి, తన అభిమాన హీరోల ఫోటోలను గదిలో పెట్టుకొని దేవతల్లా ప్రార్థిస్తూ, వాళ్ళలాగ తానుకూడా 'హీరో' కావాలని కలలుకంటూ ఉంటాడు. అప్పుడప్పుడు హేమతో కలిసి కొన్ని చిత్రాల్లోని దృశ్యాలను నటిస్తూ, ప్రఖ్యాత హీరోలను అనుసరిస్తూ నటనానుభవం పెంపొందింప చేసుకుంటూ ఉంటాడు.

ఇలా విభిన్న విచిత్ర వ్యక్తులుగల ఆ యింట్లో సీత లేకపోతే ఒక్క క్షణం గడవదు. ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకొనేవరకూ నిర్విరామంగా పనిచేసి ఎవరికీ ఏ లోటూ రాకుండా చూస్తూ ఉంటుంది సీత. అందుకే ఆమె అంటే అందరికీ అమితమైన అభిమానం.

ఉగాది పండుగకు కూతుర్నీ, అల్లుడ్ని తీసుకు వెళ్దామని వస్తాడు తండ్రి శేషయ్య, కాని తన పరిస్థితులన్నీ వివరించి రావడానికి వీల్లేదంటుంది సీత. పండగకు అన్నగారైన జగన్నాథాన్ని పంపించమని తండ్రిని అడుగుతుంది. జగన్నాథం పేరు చెప్పగానే శేషయ్య బాధపడుతూ జగన్నాథం వల్ల తాను పడుతున్న బాధంతా కూతురుముందు వెళ్ళబోసుకుంటాడు.

నిజానికి జగన్నాథం శేషయ్య కొడుకుకాడు. తల్లీ, తండ్రీలేని అభాగ్యుణ్ణి తెచ్చి, పెద్దవాణ్ణి చేసి కన్న కొడుకుకన్న మిన్నగా పెంచాడు శేషయ్య. కాని దుర్మార్గుల సహవాసంలో పడి వ్యసనపరుడై చెడిపోయిన జగన్నాథం ఆస్థికోసం ఒకనాడు తండ్రినే ఎదిరిస్తాడు. అప్పటికే బాగా విసిగిపోయిన శేషయ్య జగన్నాథాన్ని ఇంట్లోంచి పొమ్మంటాడు. "వెళ్తాను,నీ ఆస్థి నాకు ఎలారాదో చూస్తాను" అని సవాల్ చేసి వెళ్తాడు జగన్నాథం.

ఉగాది వచ్చింది. లోకాభిరామయ్యగారింట్లో ఉగాది పండుగకు ఒక ప్రత్యేకత ఉంది. ఆరోజే మధు పుట్టినరోజు. సీతా-ప్రసాద్‌ల వివాహం జరిగినరోజు. అందుచేత ఆ యింట్లో ఉగాదిపండుగ ఘనంగా జరుగుతుంది. ఇంట్లోవారేగాక, అతిథులూ, అమ్మలక్కలూ పేదా,సాదా అంతా అనాటి ఆనందాన్ని పంచుకుంటారు. ఉగాది నాటి రాత్రి తమ తొలికయికకు చిహ్నంగా, అలనాటి మధురానుభూతికి అనవాలుగా ఒక గాజుల జత తెచ్చి భార్యకిస్తాడు ప్రసాద్.

ఆంధ్రా యూనివర్సిటీవారు ప్రసాద్‌కు పి.హెచ్.డి. బిరుదాన్ని ప్రసాదిస్తారు. వైజాగ్ వెళ్తున్న భర్తకు వీడ్కోలు ఇస్తుంది సీత. అదే సమయంలో తాను త్వరలో ఒక పాపాయిని ఇవ్వబోతున్నానని భర్తకు తెలియజేస్తుంది. ఆనందంతో అటువంటి ఉత్తమురాలిని భార్యగా పొందగలిగినందుకు ఎంతో పొంగిపోతాడు ప్రసాద్.

ఒకరోజు ఎవరూ లేకుండా చూసి, హేమతో పిక్చర్‌కు బయలుదేరతాడు ప్రేమకుమార్. కాని అంతా ఒక కంట కనిపెడ్తున్న సీత, అడ్డుపడి బుద్ధిగా చదువుకోమని ఇద్దరినీ మందలిస్తుంది.

శేషయ్యకు జబ్బుగా వుందని టెలిగ్రామ్ వస్తుంది. ఇంట్లో అందరికీ అన్నీ అప్పజెప్పి తండ్రిని చూడ్డానికి బయలుదేరుతుంది సీత.

సీత ప్రయాణం చేస్తున్న రైలుకు ప్రమాదం సంభవించినట్టు పేపరు ద్వారా తెలుస్తుంది. అప్పుడే వైజాగ్ నుంచి వచ్చిన ప్రసాద్ పిడుగులాంటి ఆ వార్త వినగానే వెంటనే భార్య కోసం ప్రమాదం జరిగిన స్థలానికి వెళ్తాడు.

అదృష్టవశాత్తూ ప్రసాద్ సీతను చూడగలుగుతాడు. డాక్టర్ల అనుమతితో గాయపడ్డ భార్యను ఇంటికి తీసుకువస్తాడు.

సీత ప్రాణానికే అపాయం లేదని తెలిసి, ఇంట్లో వారంతా సంతోషిస్తారు. కాని ఆ ఆనందం వారికట్టేసేపు దక్కలేదు. తెలివి వచ్చిన తరువాత కన్నబిడ్డ మధుతో సహా ఇంట్లో వారెవ్వరినీ పోల్చుకోలేకపోతుంది సీత. పిచ్చిగా మాట్లాడుతుంది. ఒక రాత్రప్పుడు ఇంట్లోంచి పారిపోవాలని ప్రయత్నిస్తుంది. డాక్టర్లు ఆమెకు మతి చలించిందని నిర్ణయిస్తారు. మానసినక వ్యాధుల గురించి అనేక పరిశోధనలు చేసి, విదేశాలక్కూడా వెళ్లి వచ్చిన రుక్మిణమ్మను పిలిపించడానికి నిశ్చయిస్తారు.

సీతకు మతిపోవడంతో ఆ యింటి పరిస్థితి తారుమారు అవుతుంది. ఒక్క క్షణం అయినా విడవకుండా భార్యను అతి జాగ్రత్తగా చూస్తూ ఉంటాడు ప్రసాద్. అతిథులూ, ఇరుగు పొరుగువారూ, అంతా వచ్చి సీత పరిస్థితికి సానుభూతి చూపిస్తూ వుంటారు. కాని వచ్చిన వారినందర్నీ అవమానిస్తూ ఉంటుంది సీత. మధును దగ్గరకు రానివ్వదు. ప్రసాద్‌ను మాట్లాడనివ్వదు, మాట్లాడితే అంతా తనను మోసం చేస్తున్నారని అంటుంది. బార్లీలో ఉప్పుకలిపి, వంటకాలు పాడుచేసి అందరినీ ఏడిపిస్తుంది. అందరినీ రెచ్చగొట్టాలనీ ప్రయత్నిస్తుంది. కాని అంతా ఆమెను చూసి జాలిపడతారు.

ఇలా ఉండగా శేషయ్య చనిపోయినట్టు తెలుస్తుంది. ఆయన చనిపోతూ తన యావదాస్తీ సీత పేర వ్రాశాడు. ఆ వీలునామా, ఆ స్థితికి సంబంధించిన పత్రాలు తీసుకుని సీతకు అప్పగించాలని శేషయ్య గారి ప్లీడరు వస్తాడు. అసలే మతిస్థిరం లేని సీతకు తండ్రి మరణ వార్త తెలియనివ్వడం మంచిది కాదని ప్రసాద్ చెప్పగానే ఆ పత్రాలు ప్రసాద్‌కిచ్చి వెళ్ళిపోతాడు ప్లీడరు.

తిరిగి ఉగాది వచ్చింది. అంతా గత ఉగాది సంతోషాన్ని తలుచుకుని బాధపడతారు. తన తల్లికి జబ్బు నయమౌతుందని ఒక సాధువు వద్ద విభూతి తీసుకుంటాడు మధు.

తల్లికి విభూతి పెట్టాలని వెళ్ళిన మధు మెట్లపైనుండి జారిపడతాడు. బాగా గాయపడ్డ మధు చావు బ్రతుకుల్లో ఉంటాడు. అమ్మా అమ్మా అని తల్లి కోసం అహర్నిశలు పలవరిస్తాడు.

అలాంటి పరిస్థితిలో ఆస్థికోసం అక్కడికి వస్తాడు జగన్నాథం. సీతను కలుసుకోవాలంటాడు. వీలుకాదని ప్రసాద్ అడ్డుపడబోగా అతన్ని నానా దుర్భాషలూ ఆడి సీతను ఎన్నినాళ్లిలా దాస్తారో-ఆస్తినాకు ఎలా రాదో చూస్తాను అని వెళ్తాడు జగన్నాథం.

పరీక్ష చేయటానికి డాక్టర్ రుక్మిణమ్మ ఆ ఇంట్లో ఉన్నది సీత కాదని, ఈమె కన్యయేనని నిర్ధారిస్తుంది. ఈ లోగా ప్రసాద్‌కు సీత మరణించిందని తెలుస్తుంది. సాక్ష్యంగా దొరికిన గాజులను తను ఒకనాడు ఇచ్చిన గాజులుగా గుర్తించి ఆ వార్తను ధృవీకరించుకుంటాడు. సీత రూపంలో తన ఇంట ఉన్న అమ్మాయిని ఆమె ప్రేమించిన వ్యక్తితో పెళ్లి ఏర్పాటు చేస్తాడు. కానీ అతగాడు అనుమానంతో ఈమెను కాదంటాడు. ఈ అమ్మాయి కూడా ఆత్మాభిమానంతో అతడిని తృణీకరిస్తుంది. ఈ అమ్మాయిని సీతే అని పొరబడి జగన్నాథం బంధించి బలవంతాన ఆస్తి రాయించుకోవాలని ప్రయత్నిస్తాడు. ప్రసాద్ ఆమెను కాపాడతాడు. ప్రసాద్ మంచితనానికి అతని కుటుంబసభ్యులు తనపై చూపించిన ప్రేమాభిమానాలకు ముగ్ధురాలై ప్రసాద్‌తో తన జీవితాన్ని పంచుకుని సీత లేని లోటు లేకుండా చేస్తుందా అమ్మాయి.

- శుభం -

## నటీనటులు

ఎన్.టి.రామారావు,
పద్మశ్రీ నాగయ్య,
పద్మనాభం,
మాస్టర్ మురళి,
ఝాన్సీ(కుక్క),
వంగర,
రామచంద్రరావు,
కోళ్ళ సత్యం,
కోటేశ్వరరావు ,
కాకరాల,
బొడ్డపాటి,
ఎ.యల్. నారాయణ,
రాజనాల, పెరుమాళ్ళు, వల్లం నరసింహారావు, తాయ్ నాగేష్ ,
బాలకృష్ణ, పేకేటి, రాజబాబు

సావిత్రి,
నిర్మల,
గీతాంజలి,
ప్రమీల,
ఉదయకుమారి,
లక్ష్మీకాంతమ్మ,
జూ. భానుమతి,

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ,మాటలు | : వీటూరి |
| పాటలు | : వీటూరి, శ్రీశ్రీ,దాశరథి,నారాయణరెడ్డి, కొసరాజు , పాలగుమ్మి పద్మరాజు |
| నేపథ్యం | : ఘంటసాల, సుశీల, పి.బి.శ్రీనివాస్, జానకి, మాధవపెద్ది, ఎల్.ఆర్.ఈశ్వరి, పద్మనాభం |
| ఫోటో గ్రఫీ | : ఎమ్.జి.సింగ్. |
| ఆర్టు | : బి.యన్. కృష్ణ |
| ఎడిటింగ్ | : ఎమ్. ఎస్. ఎన్. మూర్తి |
| నృత్యం | : పసుమర్తి కృష్ణమూర్తి, చిన్ని సంపత్, వేణుగోపాల్. |
| స్టిల్స్ | : డి. రాధాకృష్ణమూర్తి |
| మేకప్ | : పీతాంబరం,నాగేశ్వరరావు, పోతరాజు, బి. వీర్రాజు,మాధవరావు, పి.వి. కృష్ణారావు |
| దుస్తులు | : వి.యన్. గాంధీ,యన్.టి.ఆర్'డ్రసెస్, సైడ్ బోకర్ |
| పబ్లిసిటీ | : రాజేంద్ర కుమార్, బి.ఎ, (స్టుడియో రూపకళా) |
| ప్రెస్ పబ్లిసిటీ | : రేవతి |
| స్టుడియో | : వాహిని |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : కె. ఆనంద్ మోహన్ |
| ప్రొడక్షన్ ఆర్గనైజర్ | : జి.వి. రామచంద్రరావు |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : పి. లక్ష్మీనారాయణ |
| అసోసియేట్ డైరెక్టర్ | : కె. గోపాలకృష్ణ |
| సంగీతం | : యస్.పి. కోదండపాణి |
| నిర్మాత | : బి. పురుషోత్తం |
| దర్శకత్వం | : కె. హేమాంబరధరరావు |


వీటూరి


కె. హేమాంబరధరరావు


శ్రీశ్రీ


దాశరథి


కొసరాజు


సి.నారాయణరెడ్డి


ఘంటసాల


పి.బి.శ్రీనివాస్


మాధవపెద్ది


ఎస్.జానకి


సుశీల


ఎల్.ఆర్.ఈశ్వరి


పద్మనాభం

# 'సరిగపదమని-15'

**జవాబులు:-**

అడ్డం: 1.ఉగాది 3.శుభాకాంక్షలు 6.రావే 8.ఆకాశం 10.వేదం 11.కన్ను 13. చెక్క 14. భామ 18.సామ 19.భవ 20.యాత్ర 21.కనులు

నిలువు: 1. ఉట్టి 2. దియ్య 3 .శుభవేళ 4. కాంభోజి 5.వాక 7.నాదం8.ఆహ్వానం 9.శంకరా 12.ఒక్కసారి15.మనుషులు16.శివ 17.సోనియా19.భర్త

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

కె.వి.దుర్గామోహనరావు- నల్గొండ, ఎ.కొండల్‌రెడ్డి- కల్యకుంట (మెదక్), వి.జ్ఞానేత్రి- సింధనూర్, యం.రాజేశ్వరి- అనకాపల్లి, సి.హెచ్.పద్మశ్రీ- హైదరాబాద్, కె.శృతిసంహిత- నల్గొండ, పి.కళ్యాణ్ కళాధర్- నెల్లూరు, మూకల ఫణి- హైదరాబాద్, కె.వి.లక్ష్మి- హైదరాబాద్, టి.అనుష- హైదరాబాద్, వనం జానకీదేవి- పాతపాల్వంచ, ఎస్.వి.ఎస్.భగవానులు- ఒంగోలు, కె.వేదభాస్కరవల్లి- హైదరాబాద్, ఐ.లిఖిత- హైదరాబాద్, నారాయణం రోజా- విజయనగరం, విజయ & ఉదయ భాస్కరరావు- రాజమండ్రి, రావుల వేణుగోపాల్- కాజీపేట (వరంగల్), వంగలూరి సత్యనారాయణ- నెల్లూరు, ఎ.శుభకీర్తి- తిరుపతి, జి.ఆశాజ్యోతి- వినుకొండ, పి.అరుంధతి- విశాఖపట్నం, కె.జ్యోతిశర్మ- కర్నూలు, వై.భానుప్రసాద్- కర్నూలు, గంటిరమ్య- అమలాపురం, యం.సందీప్- నల్గొండ, గంటి వినయ్- అమలాపురం (తూ॥గో॥జిల్లా), చంచలి తవిటినాయుడు- భద్రి (శ్రీకాకుళం), ఎమ్.ఆర్యా- హైదరాబాద్, కె.వి.సరస్వతి- హైదరాబాద్, ఎమ్.రాధిక- హైదరాబాద్, పి.పల్లవి- నర్సపూర్, చింతా ప్రసాద్- విజయవాడ, అయ్యగారి అన్నపూర్ణ- రాజోలు (తూ॥గో॥జిల్లా), లక్ష్మిశారద లొల్లా- తాణే, జె.సామశేఖర్- నంద్యాల, ఎన్.అరుణాకుమారి- యలమంచిలి (విశాఖజిల్లా), అడపా నగేష్‌కుమార్- అకోలా (మహరాష్ట్ర), కేతవరపు సౌందర్యవల్లి- విజయవాడ, మండలీక గణేశ్వరరావు- కాకినాడ, ముసలె అంబాజిరావు- వడ్డెగిరి (కర్నూలు), పి.సురేష్‌బాబు- తిరుపతి, బెహరం శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), శ్రీపాద శారదాదేవి- రాజమండ్రి, బి.కమలవల్లి- హైదరాబాద్, జి.పాండురంగశర్మ- హైదరాబాద్, పి.ఎస్.వి.ప్రసాద్- చీరాల, కె.మంగాదేవి- చోడవరం (విశాఖజిల్లా), పి.ఎస్.ఆర్.మూర్తి- సికింద్రాబాద్, కోక్కొండ పర్షి- పోతిరెడ్డిపల్లి (వరంగల్), వి.సత్యవతి- హైదరాబాద్, బత్తుల ప్రసన్నాంజనేయులు- అద్దంకి (ప్రకాశం), మాడుగుల గురునాథ శర్మ- కడవకల్లు (అనంతపురం), యస్.సుధాపద్మ- హైదరాబాద్, ఎన్,రామనుజాచార్యులు- జగ్గయ్యపేట్, ఎమ్.మీనాప్రభాకర్- పాలెం, కొణిదెన ఆదిత్య- గుంటూరు, కె.జగన్నాధరావు- విజయనగరం, బి.శ్రీనివాస ప్రభాకర్- హైదరాబాద్, యం.శారద- హైదరాబాద్, పాణ్యం జ్ఞానప్రసూన- కర్నూలు, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- మల్కాజ్‌గిరి, మొక రామరావు- ముంబాయి, యార్లగడ్డ మేరిగ్రేస్- డి.కెశవరం (తూ॥గో॥జిల్లా), పి.శ్రీవాణి- వైజాగ్, కె.సుగణాకరరావు- విశాఖపట్నం, టి.ఎస్.హిమబిందు- కాకినాడ, పి.శ్రీదేవి- విశాఖపట్నం, సి.సీతాలక్ష్మమ్మ- కర్నూలు, ఎమ్.సాయిబాబ- హైదరాబాద్, ఎమ్.సీతారామ్- నెల్లూరు, ఎ.సరొజిని దేవి- రాజమండ్రి, ఆర్.ప్రవీణ- ఏలూరు, పి.శ్రీకాంత్‌రెడ్డి- గుంటూరు, డి.వి.సాయిపవన్‌కుమార్- హైదరాబాద్, పి.లక్ష్మిదేవి- దొర్నిపాడు (కర్నూలు), ఉమారాణి- హైదరాబాద్, యల్లాపంతులు చందు- శ్రీకాకుళం, పి.లక్ష్మిరాయలమ్మ- ఆదిలాబాద్, జి.సురేష్- రాజంపేట్ (ఆదిలాబాద్), వి.వెంకట సాయి రామకృష్ణ- శ్రీకాకుళం, బి.శశాంక- ఏలూరు, ఐ.వి.లక్ష్మి- విశాఖపట్నం, జె.బాబురావు- కృష్ణ, డి.శైలజ- హైదరాబాద్, సి.హెచ్.శ్వేత- చీపురుపల్లి (విజయనగరం), ఎన్.చిన్న- కొల్‌కటా(పశ్చిమబెంగాల్), ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, కచ్చపీ- అనంతపురం, కలశపూడి చంద్రశేఖర్- హైదరాబాద్, ఎన్.లక్ష్మిప్రభ- శృంగవరపుకొట (విజయనగరం), ఎన్.శ్రీలత- నెల్లూరు, తిరుమల్‌ప్రసాద్- హైదరాబాద్, పి.వేణుగోపాల్- అచ్చంపేట (మహబూబ్‌నగర్), ఆమిటి సాయి రాజేష్‌కుమార్- రొంపల్లి (విజయనగరం), పి.పార్థసారధి- ఎస్.వి.పురం (అనంతపురం), బి.శ్రీనివాస్- సికింద్రాబాద్, కె.కరుణాకర్- హైదరాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

డి.నిర్మల- బాపట్ల (గుంటూరు), తాడి రంగారావు- రాజమండ్రి, అయినావురపు రామలక్ష్మి- విశాఖపట్నం, మద్దాలి మురక్ష్మికృష్ణ- నిజామాబాద్, పెండ్యాల మురళీధర్‌రావు- మోత్కూరు (నల్గొండ), కె.మల్లిఖార్జున ఆచారి- కర్నూలు, కె.సుధదేవి- చిరాల, కంటా శివనాగేశ్వరరావు- గుంటూరు, ఎమ్.రామకృష్ణ- తెనాలి (గుంటూరు), ఎస్.కె.జిలాని- కొత్తగూడెం (ఖమ్మం), జి.రామనందరెడ్డి- పుణే, పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి, డి.వి.జి.కె.స్వామి- విశాఖపట్నం, ఎస్.శరత్‌బాబు- హైదరాబాద్, ఎన్.వి.రమణమూర్తి- విజయనగరం, పి.రాజేశ్వర్- హైదరాబాద్, బి.ఆపూర్వ- హైదరాబాద్, శ్రీసరస్వతుల కృష్ణచైతన్య- హైదరాబాద్, సి.యామనీ- హైదరాబాద్, ఎస్.కె.భాషా- సాలూరు (విజయనగరం), ఎ.రాజశేఖర్ రెడ్డి- కాజా (గుంటూరు), ఎ.శివరామకృష్ణ- సారాపక (ఖమ్మం), ఎన్.జ్యోతిర్మయి - హైదరాబాద్, పింగళి శ్యామసుందర్- బెంగుళూర్, రాజాసత్యనారాయణ- నార్పురాజుపాళేం (నెల్లూరు), ఆసియాబేగం- నాచారము (రంగారెడ్డి), యం.రాజేశ్వరి- అనకాపల్లి, పోతాప్రగడ రాణి- నరసాపురం (ప॥గో॥జిల్లా), ఎన్.రాంబాబు- తిరుపతి, శ్రీరామకవచం కృష్ణకాంత్- ఒంగోలు, కె.రమణచారి- రుద్రవరం (కర్నూలు), అవధానుల శారద- గాంధిచౌక్ (ఖమ్మం), డి.సబిత- హైదరాబాద్, క్రిరిఝాన్సీ- హైదరాబాద్, వి.వి.ఎస్.మందేశ్వరరావు- మండపేట (తూ॥గో॥జిల్లా), ఎ.లక్ష్మిరమేష్- వెల్లూరు (తమిళనాడు), సపారే ఇందిర- కళ్యాణ్ వెస్ట్ (మహరాష్ట్ర), ఎన్.శ్రీదేవి- విశాఖపట్నం, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, రాచర్ల పద్మజ- హైదరాబాద్, విజయ.వి- హైదరాబాద్, తాళ్ళూరి రేణుకాదేవి- హైదరాబాద్, కాటేపల్లి కృష్ణమోహన్- మిర్యాలగూడ (నల్గొండ), ఎన్.శశిధర్- మంగళగిరి (గుంటూరు), వరదా సాయికుమార్- పర్లాకిమడి (ఒరిస్సా), పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), ఇ.తేజస్విని- చిత్తూరు, యజ్ఞల జగన్నాథం- పాతపట్నం, పి.లక్ష్మిప్రియ- హైదరాబాద్.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

జి.కృష్ణకుమారి- విశాఖపట్నం, జి.వి.కె.డి.ఎమ్.లక్ష్మి- కనవరము (తూ॥గో॥జిల్లా), వి.కనకదుర్గ- గుంటూరు, ఎస్.వి.వి.ప్రసాద్ బాలనేని- హైదరాబాద్, కె.సంతోష్‌కుమార్- సికింద్రాబాద్, సాలా రవికుమార్- విశాఖపట్నం, కె.వాసంతీదేవి- నిజామాబాద్, సి.హెచ్.స్వారోచిష్- కొదాడ (నల్గొండ), ఎస్.శివప్రసాద్- నంద్యాల, శ్రీపల్లవి అత్కూరి- హైదరాబాద్, ఎమ్.వి.రాఘవమూర్తి- రాజమండ్రి, సామంచి సుధాకర్- విశాఖపట్నం, ఎ.పద్మిని- విశాఖపట్నం, ఎం.ఆశాలత- సికింద్రాబాద్, వీరగొని అంజనేయులు గౌడ్- వేములవాడ (కరీంనగర్), టి.వి.ఎల్.శశికాంత్- హైదరాబాద్, కె.వీనస్ రాణి- ఒంగోలు, సోనికా ఫిన్‌లె- సికింద్రాబాద్, పోతుల రమణమూర్తి- కొర్లాం (ప్రకాశం), కె.మురళీకృష్ణ- సత్తెనపల్లి (గుంటూరు), కె.చంద్రహర్ష- సత్తెనపల్లి (గుంటూరు), మేడా పద్మావతి- విశాఖపట్నం, కె.జయప్రకాశ్- గజియబాద్ (ఉత్తరప్రదేశ్), మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మేడా భార్గవి- విశాఖపట్నం, కె.శ్రీనివాసరావు- పోతవరం (గుంటూరు), మండలి కృష్ణప్రియ- విశాఖపట్నం, టి.అనిత- అచ్చంపేట, బి.స్వప్న శంకరరావు- బొమ్మన్‌దేవ్‌పల్లి (నిజామాబాద్), ఉడాలి భాస్కరయ్య- చెన్నై, కె.లక్ష్మికిరణ్- గుంటూరు, ఎమ్.మాధురి రంగారావు- నల్గొండ, ఎమ్.తిరుమలచార్యులు- ద్రోణాచలం (కర్నూలు), జి.మదన్ గోపాల్- యెర్రుపాలెం (ఖమ్మం), జాగిర్దార్ మాధురి- సామర్లకొట (తూ॥గో॥జిల్లా), వేముల పప్పి- నిజామాబాద్, పి.గోపికృష్ణ- హైదరాబాద్, ఎస్.మనోహర్‌బాబు- కావలి (నెల్లూరు), ఎ.టి.గాయత్రిదేవి- అనంతపురం, నెల్లుట్ల రమాదేవి- వరంగల్, మామిడి శ్రీలత- రెపల్లె, కొంపెల్ల వెంకటరత్యలక్ష్మి- విశాఖపట్నం, కొఠి విజయలక్ష్మి- హైదరాబాద్, గన్నవరపు విజయదుర్గ- వరంగల్, యస్.వాణి- చెన్నై, పి.మధు- విజయనగరం, జె.వి.ఎన్.చారి- అహ్మదబాద్ (గుజరాత్), ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా), రాంబాబు అనుముల- విజయవాడ, పి.శిరిష్ కుమార్- రాజమండ్రి, డా౹౹కె.సంజీవ్‌కుమార్- నవీపేట్ (నిజామాబాద్), టి.యస్.కళాధర్- గుంతకల్లు, ఎం.వి.యస్.యన్.శాస్త్రి- విజయవాడ, ముప్పిరాల శశాంక- హైదరాబాద్, పి.పాపారావు- విశాఖపట్నం, బి.కవిత- ప్రొద్దుటూరు (కడప), గణగం వెంకట రమణమూర్తి- విశాఖపట్నం, పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, మన్నవ మాధవి- సత్తెనపల్లి, వి.ఉమకామేశ్వరి- రాజమండ్రి, పి.సత్యనారాయణరాజు- అచ్చంపేట, వరయోగి రామ్‌మోహన్‌రావు- సికింద్రాబాద్.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

ఆమంచి వేంకటలక్ష్మి- రాజోలు, ఎమ్.అనౌష- కాకినాడ, నేమాన సుభాష్‌చంద్ర- శ్రీకాకుళంటౌన్, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, కె.సమీరుకుమార్- ఖమ్మం, ఆర్.సత్యనారాయణ- కొవ్వూరు (ప॥గో॥జిల్లా), ఉప్పులూరి రాఘవరావు- మొగలికుదురు (తూ॥గో॥జిల్లా), కొయ్యా సింధుభారతి- కాకినాడ, ఎస్.సమీర- హైదరాబాద్, మోచెర్ల శ్యామంత్- రాజమండ్రి, చింతపెంట శేషాంజలి- అనపర్తి (తూ॥గో॥జిల్లా), బి.సత్యసాయి శ్రీనివాస్- సిల్ క్యాంపస్ (ఖమ్మం), సి.లలితాదేవి- నెల్లూరు, కరణం సత్యనారాయణ- చెట్టుపల్లి (విశాఖజిల్లా), ఎమ్.డి.సలీంఖాన్- చిన్నూరు (ఆదిలాబాద్), సి.హెచ్.రాధిక- జట్నీ, బాస్కర్ల శ్రీనాధ్- మచిలీపట్నం, సి.ఛాయాదేవి- విజయవాడ, నాళం భువనేశ్వరి- కొరుకొండ (తూ॥గో॥జిల్లా), నిర్మల క్రిష్ణ- తిరుపతి, భావరాజు వెంకటమల్లిఖార్జునం- హైదరాబాద్, కె.వనిత- కరీంనగర్, టి.వింధ్యారాణి- నల్గొండ, పొన్నాడ నిత్యజయానంద పద్మిని- కాకినాడ, వడ్లమన్నాటి భార్గవి- విజయవాడ, సి.భార్గవి- తరిగొండ (చిత్తూరు), శ్రీనివాస్ పవార్- ఆర్మూర్ (నిజామాబాద్), ఇండ్ల బాలకృష్ణ- గుంటకట్ట (నెల్లూరు), గంగారపు కళ్యాణి- సత్తెనపల్లి (గుంటూరు), ఎన్.రెవతి- కరీంనగర్, వి.వి.సూర్యనారాయణ- కాకినాడ, వేంకటేశ్వరరావు ధూర్జటి- హైదరాబాద్, ఆర్.వి.వి.కృష్ణ- హైదరాబాద్, మామిడి మునిశ్రీలత- రెపల్లె, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, వి.యామినిజ్యోత్స్న- విశాఖపట్నం, ఎన్.శారద- విశాఖపట్నం, టి.నాగభూషణం- సికింద్రాబాద్, ఎస్.పి.మధుసూదన్- తిరుపతి, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), ఓగిరాల అంజని- నెల్లూరు, ఆదిరాజు ధర్మారావు- శ్రీకాకుళం. ■

